# చతుర

సంపుటి : 6 సెప్టెంబరు 1983 సంచిక : 8


## ఈ నెల సమగ్ర నవల

అందాలరాశి కాకున్నా చెప్పుకోదగిన అందగత్తె. ఐశ్వర్యవంతుల కుటుంబంలోని గారాల బిడ్డ. రచయిత్రిగా పేరులోకి వస్తున్న మేధోజీవి....విదేశాల్లో రెండు చేతులా సంపాదిస్తున్న కోటీశ్వరుల కుటుంబంలోని యువకుని చేత అందరి ఆమోదంతో తాళి కట్టించుకుంది. పసుపు తడి ఆరని పాదాలతో విదేశాలకు వెళ్లేందు కని భర్తవద్దకు బయలుదేరింది కాని.... రైలు గమ్యం చేరేలోపే ఆమె....




....చేసుకుని అందరికీ అంతు చిక్కని ప్రశ్నార్థకంగా మిగిలి పోయింది. భర్త క్షణం ఆగకుండా అనుకున్న ప్రకారం విదేశాలకు వెళ్ళిపోగా, తల్లిదండ్రులకు మిగిలింది గర్భశోకం. అలాంటి స్థితిలో అందరినీ కలవరపరుస్తూ బయటపడింది ఆమె రాసిన లేఖ ఒకటి! ఏమిటది ? నిండు జీవితాన్ని చేజేతులా ధ్వంసం చేసుకోవాల్సిన స్థితి ఆమెకు ఎలా దాపురించింది?

## జలంధర

అమాయక మేధోజీవుల అలౌకిక అనుభూతులకు, యదార్థ ప్రపంచపు లౌకిక విలువలకు జరిగే సంఘర్షణను వేదనాపరంగా చిత్రించిన 'ఆత్మహత్య' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : ఎస్. ఎస్. రతన్

రెండవ కవరు :
మూడవ కవరు : } బ్రహ్మదేవ్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ — **500 004.**

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GKBE.B82.86 TL




## ఉపవాస వీరులు

ఇదివరకూ పొట్ట పగిలేలా తిండి తిని ప్రపంచ తిండిపోతు వీరులని పేరొందిన హీరోలు చాలా మంది వున్నారు. కొందరు మహానుభావులు తిండి తినకుండా ఉపవాసాలు చేయడంలో కూడా రికార్డు సృష్టించారు. 50 ఏళ్ల క్రితం ఇంగ్లండుకి చెందిన లార్డ్ మేయర్ టెరెన్స్ మెక్స్వెన్నీ జైల్లో ఉపవాసం చేసి అప్పట్లో విదేశాల్లో రికార్డ్ సృష్టించాడు. కాని 91వ రోజున అతనికి బలవంతంగా ఆహారం ఇచ్చారు. తిండి తినంగానే టపా కట్టేశాడట పాపం.

ఈమధ్య బ్రిటన్‌లో జాక్ వేఫెర్ అనే యువకుడు డాక్టర్ల పర్యవేక్షణలో ఉపవాసాలు చేశాడు. ఇతన్ని గాజు కేబిన్‌లో వుంచారట. తర్వాత గ్లూకోజ్ తీసుకొని ఉపవాసదీక్షను విరమించాడు. ఇతనిదీ ఓ రికార్డే!

డెన్మార్క్‌కి చెందిన 33 ఏళ్ళ ఈవ్ ప్లిగాన్ 14 ఏళ్ళపాటు వర్సనే ఉపవాసం చేసిందని చెప్పుకొనేవారు. ఉపవాస సమయంలో ఆమె కేవలం గులాబీ పూల పరిమళాన్ని మటుకే పీల్చేదట. ఈ వార్త నిజమని నమ్మడానికి వీల్లేదనుకోండి.

లండన్‌కి చెందిన లెట్‌లిన్ కూడా దీర్ఘకాల ఉపవాసాలు చేసినవారి జాబితాలో చోటుచేసుకుంది. ఈవిడ ఏడేళ్లుగా ఎలాంటి ఆహారం తీసుకోలేదని నలుగురు నిపుణులు సర్టిఫై చేశారుకూడా.

అయితే మెడికల్ అకాడమీవారు పంపిన నిపుణుల పరిశీలనలో లూసీ వున్న గదిలో నేల కింద దాచబడిన ఆహారపదార్థాలు బయటపడ్డాయి. కాబట్టి ఉపవాసదీక్షల మీద మన కార్టూనిస్టులు వేసే కార్టూన్లలో అతిశయోక్తి ఏమీలేదు సుమండీ!

## విడియో మోజు

ప్రపంచంలో రకరకాల ఆటలువున్నాయి. దేని అభిమానులు దానికే వున్నారు. కాని విడియోగేమ్స్‌కి వున్నంతమంది అభిమానులు దేనికీ వుండరేమో బహుశా. విడియోపట్ల అభిమానం పిచ్చిగా మారింది ప్రస్తుతం. టి.వి.లు వాడుకలోకి వచ్చిన దగ్గిరనుంచి విడియోగేమ్స్ విజృంభించాయి. విద్యార్థులు తరచూ క్లాసులకి డుమ్మా కొడుతున్నారు. అంతెందుకు ఆఖరికి ఉద్యోగులుకూడా ఆఫీసులు ఎగ్గొడుతున్నారంటే ఈ పిచ్చి ఎంతగా ముదిరిందో తెలుస్తుంది. ఈ పిచ్చి ఫ్యాక్టరీ కార్మికుల వరకూ పాకితే ఉత్పత్తి దెబ్బతినక తప్పదు.

విడియోలు అంతటితో ఆగలేదు. గౌరవనీయమయిన కుటుంబీకులు కూడా తమ కుటుంబ సభ్యులను నిర్లక్ష్యం చేయడం ప్రారంభించారు. దీని వ్యామోహంలోపడి అప్పాయింట్‌మెంట్లను కేన్సిల్ చేయడం, ఎక్కవలసిన విమానాలు మిస్సవడం జరుగుతోందట. పెద్దల పరిస్థితే ఇలావుండే ఇక యువతరం సంగతి చెప్పేదేముంది. జపాన్‌లో ఒక సంవత్సరంలోనే విడియోగేమ్స్ ఆడటానికి



గాను డబ్బు దొంగిలిస్తున్న 1956 మంది యువతీయువకులను పోలీసులు పట్టుకున్నారు. బ్రిటన్‌లోనయితే విడియో గేమ్స్ ఆడటానికి అవసరమయిన డబ్బు కోసం పదేళ్ళ ఆడపిల్లలు వ్యభిచరిస్తున్నారట.

మనీలాలో ఓ పదిహేడేళ్ళ పిల్లాడు విడియో వ్యామోహంలోపడి పరీక్ష తప్పగానే అతని తండ్రి దండించడంమాని, కొడుకుకోసం విడియోపార్లర్లు తెరవాలని నిర్ణయించాడు. కాని అవి తన కొడుకు లాంటి లక్షలాది యువకులను పాడు చేస్తాయని చెప్పి అతని భార్య వ్యతిరేకించింది. ఈ గొడవ చివరికి దేశాధ్యక్షుడు మర్కోస్ వద్దకు పోయింది. అతను దేశంలోని అన్ని విడియో పార్లర్లను నిషేధించి పారేశాడు.

ఇండోనీషియా, మలేషియా దేశాల్లో కూడా విడియో గేమ్స్ దిగుమతిని నిషేధించారు. వెస్ట్ జర్మనీలో పద్దెనిమిది ఏళ్ళ లోపువారు విడియో పార్లర్లలో ప్రవేశించడాన్ని నిషేధించారు. ఫ్రాన్సులోనయితే 16ఏళ్ళలోపువారు విడియో పార్లర్లలో ప్రవేశించడానికి తల్లిదండ్రుల అనుమతి తీసుకురావాల్సి వుంటుంది. ప్రస్తుతం స్వీడన్ దేశపార్లమెంటులో ఈ విషయమై చర్చ జరుగుతోంది. కెనడాలోని నార్త్‌యార్క్ అనే పట్టణంలో 600మంది పౌరులు మున్సిపాలిటీ అధికారులను ఘెరావ్‌చేసి జనసమ్మర్దంగల ప్రదేశాల్లో విడియో పార్లర్లను అనుమతించకుండా చేయగలిగారు. బొంబాయిలోనిపౌరులు దేవాలయాలకు, స్కూళ్ళకు 75మీటర్ల పరిధిలో విడియోపార్లర్లు పెట్టడాన్ని నిషేధించాలని కోర్టులో పిటిషన్ పెట్టారు. అంతేకాదు విడియో పార్లర్‌ను తెరవాలంటే ఆ ప్రాంతప్రజల పూర్తి అంగీకారం వుండితీరాలని కూడా వీరు అడిగారు.

ఇన్ని నిషేధాలు, పరిమితులు వున్నా విడియోగేమ్స్ ఖ్యాతి దినదినప్రవర్ధమానమవటం చూస్తోంటే ఈ విడియోల విప్లవానికి అనకట్ట పడేలా లేదు ఇప్పట్లో.

## అగ్నిపర్వతం

"నేను నిన్ను ప్రేమించడం లేదు. నీ ఆత్మీయత, అనురాగం నాకు అన్నయ్య లేని లోటు తీర్చింది...' అని ఆమె అనగానే నాగుండెల్లో అగ్నిపర్వతం బద్దలైంది" అంటాడు ప్రేమికుడు. నిజానికి నిజంగా అగ్నిపర్వతం బద్దలైనపుడు ఆ చుట్టుపక్కల కొన్ని మైళ్ళ దూరం వరకూ బూడిదతప్ప ఇంకేమీ మిగలదు. ప్రియురాలు ప్రియుని హృదయాన్ని బద్దలుకొట్టి భస్మాన్ని బహూకరించడం దారుణమేకదా మరి! అఫ్‌కోర్స్ అదంతా వాడుక వ్యవహారం అనుకోండి.

1883, ఆగష్టు 27న ఇండోనేషియాలోని కకోవ్ ద్వీపంలోని అగ్నిపర్వతం బ్రహ్మాండంగా బద్దలైంది. అంతే! తొమ్మిదంతస్థుల బిల్డింగును క్షణాల్లో నేలమట్టం చేసేంతగా తాడి ఎత్తున అలలు పైకెగిసాయి. కకోవ్‌లోని 163 గ్రామాలు నామరూపాల్లేకుండా పోయాయి. 36, 380 మంది ప్రజల ఎముకలు కూడా దొరకలేదు.

జావా ద్వీపానికి దగ్గర్లో జకార్తా నౌకాశ్రయంలో నిలిచి ఉన్న డచ్ యుద్ధ నౌకను కూడా ఆ కెరటాలు అరమైలు దూరానికి విసిరేశాయి. ఆ ఉధృతం రెండుగంటల్లో దక్షిణాఫ్రికాని కూడా





స్త్రీజీవితంలో
ఎంతో అందమైన క్షణాలలో
ఒకభాగం ఖటావ్

ఖటావ్‌వారి టెర్కోసా చీరలు



Rediffusion/K/1619g/TL

చుట్టబెట్టింది.

అగ్నిపర్వతాలనిపిలువబడే వాల్కాన్‌ల నుంచి లావా, నీటి ఆవిరి, బూడిద మొదలైనవి ఎగసివస్తాయి. అటువంటి వాల్కాన్‌నుండి బూడిద 50మైళ్ళ ఎత్తున గాలిలోకి ఫోర్స్‌గా దూసుకు వచ్చి క్షణాల్లో చుట్టుపక్కలంతా వ్యాపించి సంవత్సరం పాటు చెదరని, చెరగని సూర్యాస్తమయ శోభ నిస్తుందంటే ఆశ్చర్యం, ఆనందం కలుగుతుంది ఎవరికైనా!

## కివి

ఎగిరే జంతువు అంటే ఎంత విచిత్రంగా వుంటుందో, ఎగరలేని పక్షి అన్నా అంతే ఆశ్చర్యంగా వుంటుంది. ప్రపంచంలోకెల్లా అతి విచిత్రమయిన పక్షి 'కివి' న్యూజిలాండ్ దేశంలో జాతీయపక్షిగా గౌరవం అందుకుంటోంది.

పెద్దసైజు కోడిపెట్టలా కనిపించే 'కివి' ఎగరలేదు. కాని నేలమీద వేగంగా నడవగలదు. అత్యంత వేగంగా పరిగెత్తగల సామర్థ్యం వుంది దీనికి. ఇది ఎగరలేదు గనుక నేలమీదే దట్టమయిన పొదల్లోగాని, పొలాల్లోని గడ్డిలోగాని నివాసం ఏర్పరచు





# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం !



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే- కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001

శాఖలు: ● ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MCF/87




కొంటుంది. పగటిపూట గుర్రుకొట్టి నిద్ర పోయి రాత్రిపూటలేచి తిండికోసం బయలు దేరుతుంది.

కివి కుంభకర్ణుడితో పోటీపడి నిద్ర పోతుంది. నిద్రలో వున్నప్పుడు దీన్ని చేత్తో పట్టుకుని తీసికెళ్ళినాసరే దీనికి మెలకువ రాదు. నిద్ర అయిపోగానే పెద్దగా ఆవలిస్తుంది. ఇది ఆవలించేటపుడు ఫలేతమాషాగా వుంటుంది. దీని కాళ్ళు చాలా బలంగా లావుగా వుంటాయి. ఆకలి వేసినప్పుడు చిన్నపిల్లలు కాళ్ళు కొట్టుకున్నట్లు కాళ్ళను నేలకేసి కొడుతుంది. చూసేవారికి ఏ భరతనాట్యమో చేస్తున్నట్లనిపిస్తుంది.

అసలు దీనికి 'కివి' అన్న పేరు ఎలా వచ్చింది అంటే ఈ పక్షి సంతోషంగా వున్నప్పుడు కివి...కివి అన్నశబ్దాన్ని వెలువరిస్తుంది. ఆ శబ్దమే దాని పేరుగా స్థిరపడిపోయింది. దీని గ్రహణశక్తి అద్భుతం. గ్రహణశక్తి సాయంతో ఆహారాన్ని వెతుక్కోవడమేగాక శత్రువుల ఎదురు దాడులనుంచి తనను తాను రక్షించుకుంటుంది.

కివి పక్షి గుడ్డు చాలా పెద్దగా వుంటుంది. గుడ్డు అయిదు అంగుళాల పొడవు, అయిదు అంగుళాల వెడల్పు వుంటుంది. అయితే పూర్తిగా పెరిగిన ఆడ కివి పక్షి పరిమాణంతో పోలిస్తే ఈ గుడ్డు చిన్నదిగానే అనిపిస్తుందనుకోండి.

కివి పక్షుల్లోని మరో విశేషం ఏమిటంటే గుడ్లను మగపక్షులే పొదుగుతాయి. మగ కివిపక్షి గుడ్డును 75రోజులపాటు పొదుగుతుంది. పొదిగేసమయంలో మగ కివిపక్షి తిండితిప్పలులేకుండా గుడ్డును కాపాడుతుంటుంది.

గుడ్డు పొదగబడి కివిపిల్ల బయటకు వచ్చేనాటికి మగ కివిపక్షి చిక్కి సగమవుతుంది. ఒకవంతు బరువు కోల్పోతుందట ఇది.

పాపం మగకివి పని అంతటితో అయిపోలేదు. వాసనపట్టడం, తిండి వెతుక్కోవడంవంటి వాటిని మగపక్షే నేర్పించాలి పిల్లలకి. కివి పక్షిపిల్లలు తప్పిపోయినా, ప్రమాదంలో చిక్కుకున్నా తల్లులసు తలవవు. తండ్రులకోసం ఎదురు చూస్తాయి. కివిపక్షుల్లో ఉమన్స్ లిబ్ బాగా విజయవంతమయినట్లుంది చూడబోతే.

# ఉచితం!

**ఆకర్షణీయమైన
స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నె
రెండు టిన్నులు
ఫారెక్స్ కొన్నపుడు.**

ఈ కానుక అవకాశం సరుకు
ఉన్నంత వరకు ఎన్నుకోబడిన
పట్టణాలలో కలదు.




**గ్లాక్సో** ఉత్పాదన **ఫారెక్స్**®

**పెరిగే పాపాయిల కోసం ప్రత్యేకమైన ఘన ఆహారం.**

CASGLF-43-183 TEL

నొక్క కళాకారులంటే పెద్ద అభిప్రాయం ఏంలేదు. చెప్పద్దూ....జీవితంలో సాయం కాలాల్లోకి వచ్చేసినవాడిని. పెద్ద లంపటం లేకుండా వడ్డీ డబ్బు ఓ రెండువేల రూపాయలు వచ్చేటట్లు ఏర్పరచుకుని రికామీగా జీవిస్తున్నాను.

మొదటినుంచీ నేను ప్లానుతో బతకడానికి అలవాటుపడ్డవాణ్ని. ఏ పనయినా సరిగ్గా ఆయా సమయాల్లోనే చెయ్యడానికీ, బాధ్యతాయుతంగా ప్రవర్తించడానికీ అలవాటయిపోయినవాణ్ని. ఈ విషయంలో నన్ను చూస్తే నాకే గర్వం.

గిట్టనివాళ్ళు నన్ను 'డబ్బు మనిషి' అంటారు. కానీ, ఏమాత్రం క్రమశిక్షణ లేనివాళ్ళన్నా ఒళ్ళుమంట నాకు. వాళ్ళు జీవితంలో కష్టాలు కొనితెచ్చుకుంటారు. బాధ్యత మరొకరిమీదకి తోసేస్తారు.

విధి, దేముడు... ఇవన్నీ ఎక్కడో లేవు. మన చేతుల్లోనే ఉన్నాయని నా నమ్మకం.

ఇలాంటి నాకు కళాకారులంటే మంట ఉండడానికి చాలా కారణాలున్నాయి. "నటవిటగాయకులు పంక్తిబాహ్యులు..." అన్నవాడెవడోగానీ మహానుభావుడనే నా ఉద్దేశం. ఈ ఆధునిక యుగంలో ఆ లిస్టులో రచయితలు వగైరాలనుకూడా చేరిస్తే మంచిదనే అభిప్రాయం నాది.

నేను ప్రతి విషయం నిష్పక్షపాతంగానే ఆలోచిస్తాను. ఈ నా కచ్చకు కారణం నా జీవితపు అనుభవాలే.

మా తండ్రి ఆస్తినంతా నాటకాలకు, తద్వారా రాగరాగిణులకు తగలేశాడు. మా ఇంట్లో కిరసనాయిలు లేనప్పుడు కూడా నాటకాలకు పెట్రోమాక్సులైట్లు కొనే మనిషి ఆయన. అందుకే జమీందారీగాపరిగణింపబడే మా కుటుంబం మండువా ఇల్లు, బోలెడన్ని అప్పులు, పనికిరాని హోదాలతో మిగిలిపోయింది. నాన్న పోతూ అప్పజెప్పినమిగిలిన చెల్లెళ్ళ బాధ్యతలు, ఉమ్మడి అప్పులతో నాకు ఈ ప్రపంచంలోని కళఅన్నా, ఆ బాపతు మనుషులన్నా మంటరగలటంలో ఆశ్చర్యమేముంది.

ఆ తరవాత నా జీవితంలో తటస్థించిన మనుషులయిన మా బావమరుదులూ, తదితరచుట్టాలూకూడా ఈ దిక్కుమాలిన ఆర్ద్రతలు, స్పందనలతో తడిసి ముప్పందుమై అందర్నీ ఇబ్బంది పెట్టిన వాళ్ళే.

కానీ నా అభిప్రాయాలు నేనేనాడూ బయటికి చెప్పను. లౌక్యంగా బతక్క, అనవసరపు బాధలు తెచ్చుకోవడం నాకు ఇష్టంలేదు. ఎవరయినా పిలిస్తే సభలు అలంకరించడం, పైసా ఖర్చులేకుండా వాళ్ళను పొగిడి మనమొక దుశ్శాలువ కప్పించుకుని బయటపడటం—ఇందులో నష్టమేం లేదు. అందువల్లే అంతర్గతమైన నా కళావిరోధం బయట పడలేదు ఎప్పుడూ. చాలామంది ఈ విషయం నమ్మకపోవచ్చు కూడా. ఎందుకంటే నేను ఆశీర్వచనాలు, అభిప్రాయాలు రాసిచ్చిన పుస్తకాల్లో ఒక్క పేజీకూడా నేను చదవలేదని వాళ్ళకు తెలియదు కాబట్టి "వారి అమూల్యాభిప్రాయం ఇలా శలవిచ్చారు...." అని ఆ నా మాటల్ని చాలామంది అవసరార్థం వాడుకుంటూ ఉంటారు. అందులో తప్పేమిటిట?!

కేవలం అణాపైసల జమా ఖర్చులు తప్ప తెలియని నా స్నేహితుడొకడు ఇన్కంటాక్స్ ఎగ్గొట్టాలని సినిమా తీసి, ఆ డైరక్టర్ పుణ్యమా అని గొప్ప సినిమాగా ప్రశంసించబడినదే తీశాడు.




అతనికి గవర్నమెంటు ఉత్తమాభిరుచులు గల నిర్మాతగా పతకమిచ్చి సత్కరించింది. మరి ఇటువంటి పరిస్థితుల్లో నా అభిప్రాయం మాత్రం 'అమూల్యం' ఎందుకు కాదు?!

ఈ నానాజాతి కళా సమున్నతుల్లో అత్యంత ప్రమాదకరమైనవాళ్లు ప్రస్తుతం రచయితలేనని నా అనుమానం. వీళ్లు ఎటు పోతున్నారో, ఏమైపోతున్నారో అని నాకు బాధ. కేవలం ఓ నాలుగు దస్తాల కాగితాలు, ఒక అర్ధ రూపాయి సిరా ఖర్చుతో దేశాన్ని, మనుషుల్ని చెడగొట్టే అధికారం వీళ్లకెవళ్లు ఇచ్చారట? అంటే వీళ్ల రచనలు చదివే దేశం తల్లకిందులైపోతోందనే చవటను కాను నేను. కానీ చెప్పొద్దూ ... అప్పుడప్పుడు చాలా మంది జీవితాలు ప్రభావితమవ్వడానికీ, అనేక కొత్త కష్టాలు కొని తెచ్చుకోవడానికీ ఫలానా రచయితల రచనలు కారణం అని విన్నప్పుడు మాత్రం 'పాపం' అనిపిస్తుంది.

ఇల్లాంటి నాకు పేరెన్నికగన్న రచయిత్రి 'ఉమ' మేనగోడలవడం విచిత్రమే! ఓ నాలుగు నవలలు, ఓ పది కథలు, కాసిన్ని గేయాలు రాసి, మొత్తానికి అదో రచయిత్రిగా సాహిత్యాన్ని ఫీడ్ చేసింది.

ఇక్కడ 'ఉమ' ప్రసక్తి ఎందుకంటే హాయిగా జరిగిపోతున్న రైలు ప్రయాణం లాంటి నా జీవితంలో ఉన్నట్లుండి ఓ సుప్రభాతాన ఓ తలనొప్పి సమస్య వచ్చింది. అది సృష్టించింది మా ఉమే!

* * *

తలుపు చప్పుడైంది... పాలపాకెట్టు అబ్బాయేమోనని తీశాను.

ఎదురుగా నా చెల్లెలు వసుంధరా, ఆమె భర్త కేశవరావు.

"అన్నయ్యా! ఉమ చచ్చిపోయింది" బావురుమంది చెల్లెలు.

"అదేమిటి? ఎలా....లోపలికి రండి"

నాకు ఖంగారనిపించింది. రెండు రోజుల క్రితం సలక్షణంగా బాంబే మెయిల్ ఎక్కి అత్తగారింటికి బయలుదేరిన పిల్ల చచ్చిపోవడమేమిటి ? ఎలా ? ఎప్పుడు? ఎక్కడ?

మా బావను చూస్తూ అడిగాను ఆ ప్రశ్న!

"రైల్లో" అన్నాడాయన.

"అదేమిటి? ఏదన్నా అఘాయిత్యం జరిగిందా?"

స్వతంత్ర భారతదేశంలో రైలు ప్రయాణాలు ఎంత భయంకరమైనవో పేపర్లో చదువుతూనే ఉన్నాము. ఎప్పటి కప్పుడు 'అవి మనకు రావులే' అనుకోకపోతే ప్రయాణం చెయ్యలేము కూడా!

"లేదు...." నేల చూపులు చూస్తూ చెప్పింది చెల్లెలు వసుంధర.

ఒక్కసారి పరీక్షగా చూశాను. జుట్టు రేగిపోయింది. బొట్టు చెరిగిపోయింది. నలిగిన చీర. చేతినిండా ఎర్రగాజులతో కలిపిన బంగారు గాజులు, రవ్వలదిద్దులు మామూలే. అయినా నా చెల్లెల్ని ఇలా చూడలేదెప్పుడూ. చిన్నప్పటినుంచీ వాడని పువ్వులా ఉండేది...మా బావ ఇన్కంటాక్స్ ఆఫీసరై రెండు చేతులా సంపాదించుకోవడంతో పెళ్లయినా దాని అలవాట్లు, హోదాలు తగ్గించుకోవలసిన అవసరం ఏనాడూ రాలేదు. తన స్నేహితురాళ్లను, పరిచయాల్ని కూడా సమానస్థాయిలోనే ఉంచుకునే మనిషి. చిన్నప్పుడు అందర్నీ పేరంటానికి పిలిచివచ్చి, "ఆ పూజారి వాళ్లమ్మాయిని

పిలవలేదులే...ఆc! చిరుగుల పరికిణీ కట్టుకుని ఏం వస్తుంది లెద్దూ!" అనేది. అటువంటి మనిషి ముఖమంతా కందగడ్డలా వాచి, దుఃఖంతో గొంతు పూడుకుపోయి..

చూడలేకపోయాను.

"ఏమైంది బావా?" ఆయననే అడిగాను.

స్థూలకాయం, బట్టతల, చేతికి వెంకటేశ్వరస్వామి ఉన్న ఉంగరం, చాలా కాస్ట్లీ రిస్టువాచీ – మా బావను చూస్తే ఎవరూ గవర్నమెంటు ఆఫీసరనుకోరు. ఏదో పెద్ద బిజినెస్ మాగ్నెట్ అనే అనుకుంటారు.

"స్లీపింగ్ పిల్స్ మింగేసింది..."

"ఎప్పుడూ?"

"బహుశః మేమంతా రైలు ఎక్కించి తిరిగి వచ్చాక"

"వెంట ఎవరు వెళ్లారు?"

"ఎవరూ వెళ్లలేదు బావా! అదే మేం చేసిన పొరపాటు"

"అదేమిటి?"

"అదే పొరపాటు అంటున్నాంగా! అసలిక్కడి నుంచి బాంబేకి ఫ్లైట్ లోనే పంపమన్నాడు అతను అక్కడినుంచి తీసుకువెళతానన్నాడు..."

"అదేమిటి? అరేబియానించి వచ్చినవాడు బాంబేనించి ఇక్కడికి ఒక పూట వచ్చి పెళ్లికూతుర్ని తీసుకువెళ్లలేడూ?" అడిగాను నేను.

"అతనికి ఈ ఫార్మాలిటీస్ అవీ లేవట. అదొక తత్వం...వెధవగోల..." విసుక్కుంటూ వెక్కుతూ అంది వసుంధర.

అయితే అక్కడ రెండు చేతులా ఆర్జిస్తున్న ఈ అబ్బాయిని వలలో వేసి చిక్కించుకుని అల్లుణ్ని చేసుకోవాసికి వీళ్లిద్దరూ ఎంత అవస్థపడ్డారో నాకు తెలుసు. అతను నిశ్చితార్థానికి పెట్టిన డైమండు నెక్లెస్ గురించి ఆ తరువాత పది రోజులు మా వసుంధర నోట్లోనుంచి ఎన్నిసార్లు విన్నామో మాకే గుర్తులేదు.

కానీ అది తప్పుకాదు.... ఆడపిల్లలను కన్న ప్రతి తండ్రీ తన కూతురు అత్తవారింట్లో వీలైనంత దర్జాగా బతకాలని కోరుకోవడంలో తప్పులేదు. పైగా వీళ్లకున్నది ఇద్దరే ఆడపిల్లలు. ఉమ పెళ్లికి ఫైవ్‌స్టార్ హోటళ్లలో పెళ్లికొడుకు స్నేహితులకు బుక్ చేసిన రూముల ఖర్చు పదిహేను వేలు దాటిందట. పెళ్లి ఖర్చు చెప్పనే అఖర్లేదు. కళ్యాణ మండపంలో అయిన కరెంటు ఖర్చుతోనూ, అందరి కార్లకూ పోయించిన పెట్రోలు ఖర్చుతోనూ ఓ నాలుగైదు కుటుంబాలు సంవత్సరకాలం హాయిగా బతకవచ్చు. కానీ అల్లాంటి ఖర్చు తప్ప ఇల్లాంటి అల్లుణ్ణి తేలేదుమరి. ఒక రకమైన బిజినెస్ లాంటిది ఇదంతా. రెండు పక్కలవాళ్ల బుర్రల్లోనూ లాభనష్టాల బేరీజులూ, వాళ్లకు చేరే స్టీలు గ్లాసుల ఖరీదు దగ్గరనుంచీ అంచనా ఉండనే ఉంటుంది. వీటికే అనవాయితీ, సాంప్రదాయం, హోదా అంటూ ఏవేవో అర్థం పెట్టుకుంటారు. అంతే! ఇది లోకంలో రివాజు.

కానీ, ఇక్కడి పరిస్థితి ఏమిటి?

"పోనీ ఫ్లైట్ లో పంపకపోయారా?"

"వెళ్లనంది. దాని బుర్రలో ఏముందో మాకేం తెలుసు చెప్పు. అసలు బైటపడనే లేదాయె! 'అమ్మా!ఇండియా మళ్లీ ఎప్పుడు చూస్తానో సరదాగా రైల్లో వెళతాను' అంటే నిజమేలే అనుకున్నాం గానీ ఇంత అఘాయిత్యం చేస్తుందని అనుకోలేదు అన్నయ్యా" వెక్కుతూ అంది

వసుంధర.

దాని జీవితంలో చెల్లి అంతగా దుఃఖ పడటం నేను చూడలేదు. ఎప్పుడూ అందర్నీ లొంగదీసుకుని, తననుకున్న మాటే చెల్లించుకుని బతికిందది. దాని మాట వినేవాడూ, స్థితిపరుడూ అయిన భర్త రావడంతో దాని జాతకం మహర్జాతకం అన్నారంతా.

''అయినా తోడు లేకుండా పంపడం ఏమిటి'' విసుక్కుంటూనే అన్నాను.

"ఆయనకు ఆఫీసు పని ఉందన్నారన్నయ్యా! నేనే వెళ్దామనుకున్నాను గానీ ఎవరూ వద్దమ్మా అంటూనే ఉందది. పైగా ఆ వచ్చిన బహుమతులు అవీ ఇంకా సర్దనే లేదు. బోలెడంత వెండిసామాను ఇంటి నిండా. పైగా చుట్టాలు"

"ఇప్పుడు దాదాపుగా అన్నీ. దాచుకో ఎవరే చుట్టాలు .... ఎవరు ? మా అక్కయ్యలూ, అమ్మావాళ్లేగా. వాళ్లంతా దోచుకుపోతారని నీ భయం. ఇప్పుడు దాచుకో ఎవరికోసరం దాస్తావో" అక్కసుగా అన్నాడు బావ.

మా వసుంధర వాళ్లింట్లో అడుగు పెట్టిన నాటినుంచీ మా బావ ఎంత సంపాదించినా, ఆయన తరఫువాళ్లకు అరవై రూపాయల చీరలూ, వచ్చిన మూడో రోజు నుంచీ పలకరించకపోవడాలతో ఎవరూ ఆయన ఇంట్లో తలెత్తే అవకాశం రాలేదు. పెళ్ళి కాబట్టి పిలవక తప్పలేదు. మా బావ భార్యను అడ్డం పెట్టుకుని బాధ్యతలు చాలా తప్పించుకున్నాడు. తను చెప్పడానికి మొహమాట పడ్డవి అనేకం ఆవిడ చేత చెప్పించుకున్నాడు. కానీ, ఇప్పుడు జరిగిన విషాదం వాళ్ళ బిడ్డ గురించి. దాంతో లోపలి బాధ బయటపడింది. అయినా ఆయనా మనిషేగా... !

"సర్లెండి... కావాలంటే తెచ్చి అందర్నీ నెత్తికెక్కించుకోండి. వద్దన్నానా...?" అని ఆయనను ఒక్క విదిలింపు విదిలించి,

"అక్కడికి లక్ష్మణ్‌ను పంపిందా నన్నయ్యా" అన్నది.

"మరి అతను...?"

"మన కింద క్లర్కు కదా... అతను స్లీపర్‌లో ఉన్నాడు. అమ్మాయి ఫస్ట్ క్లాస్‌లో ఉంది. ఒకసారి దార్లో వచ్చి చూశాడట... నిద్రపోతోందని వెళ్ళిపోయాడట"

"మరి అల్లుడు?"

"ఏముంది? మా కు ఇ లా అ ని పెళ్ళిగాం ఇచ్చి ఉమ బాడీని పోలీసులకు హాండోవర్ చేసి ఆరోజె వెళ్ళిపోయాడు గల్ఫ్‌కు" మా బావ చెప్పాడు.

"అదేమిటి? కనీసం ఇ క్క డి కి రాలేదా!"

"అతనికి శలవు లేదట... పైగా కాపురానికి వచ్చే పెళ్ళాం చేతుల్లో శవంలా వాలితే ఏమనిపిస్తుంది చెప్పు అతనికి? ఎవరి మొహం చూడలేక వెళ్ళిపోయి ఉంటాడు. ఇప్పుడు మనం వాళ్ళ వాళ్ళందరికి ఏం సమాధానం చెప్పాలి? ఏమనుకుంటారు వాళ్ళు ? ఎన్ని మాటలు పడాలో...? వాళ్ళంతా హోదాల్లో ఉన్న వాళ్ళు..."

బిడ్డపోయినా దాని బుర్రలో అల్లుడి జీతం, అతని వాళ్ళ హోదా, ఇచ్చిన అయిదారు లక్షల కట్నం—ఇవన్నీ సుళ్ళు తిరుగుతున్నాయి.

"ఛా! నోర్ముయ్. జరిగేది చూడాలి ముందు...."

మా బావ వసుంధర మీద ఏరోజూ





విసుక్కోలేదు ఇలా. పరిస్థితి ఇదిమరి.

"ఇప్పుడేం చేద్దామంటావు?"

"ఏముంది? బొంబే పోలీసులను కాంటాక్ట్‌చేసి, శవం పోస్ట్‌మార్టం జరక్కుండా చూడాలి బావా... రంజిత్ వాళ్ళకు టెలిగ్రాం ఇవ్వాలి"

ముందు కేసులు, ఎంక్వైరీలు, పత్రికలవాళ్ళు — ఇవన్నీ నా బుర్రలో గిర్రున తిరిగాయి.

నాకు తెలిసిన పోలీసు ఆఫీసర్లకు ఫోన్లు, మా బావ హోదాలో అయన చేయగలిగినఇన్‌ఫ్లుయన్సులు, బొంబాయికి ఒక ఇరవై - ముప్పై ఎస్.టి.డి. కాల్సు, అక్కడే ఉండిపోయిన లక్ష్మణ్‌తో చర్చలు...

ఇవన్నీ మూడు రోజుల్లో జరిగాయి. అయినా పోస్ట్‌మార్టం జరక్కుండా ఆపలేకపోయాం. అది ఆత్మహత్య అని బైటకు రాకుండా చేసేందుకు మా బావ భయంకరంగా డబ్బు విరజిమ్మాడు. 'ఏదో హార్ట్ వీక్‌నెస్‌తో పోయింది అని డాక్టర్ స్టేట్ మెంటు ఇచ్చారు' అని అంద రికీ చెపుతున్నాం కానీ, ఎవరికీ నమ్మకం కలిగినట్లు లేదు. అలాగని వారికి మాట్లాడే ధైర్యమూ లేదు.

శవాన్ని తీసుకువచ్చిన రోజు విపరీతమైన జనం... పత్రికలవాళ్ళు, ఫొటోగ్రాఫర్లు, బంధువులు, స్నేహితులు. సహం మంది వార్తాసేకరణకు వస్తే, సహం మంది ఉమ రచయిత్రి కాబట్టి వచ్చారని వినేదాకా దాన్నిగురించి జ్ఞాపకమే లేదు.

ఇందాకే చెప్పానుగదా! రచయితలు, రచయిత్రులు, కళాకారులు - వీళ్ళంటే నాకేం పెద్ద ఇష్టం లేదు. వాళ్ళకు వచ్చే భావావేశాన్నీ, వాళ్ళకు అందని తీయని అనుభవాల్నీ, వాళ్లు చెయ్యలేని సాహసాల్నీ కాగితాల మీద పెన్ను దులిపి రూపకల్పన చేస్తారు. ఆ కవిత్వానికి, వాళ్ళ జీవితాలకు నాకు తెలిసినంతలో సంబంధం కనబడదు. వాళ్ళకు వచ్చే ఒక మెరుపులాంటి ఆలోచన కథగానో, నవలగానో రూపం దిద్దుకుంటుంది. కానీ వాళ్ళ జీవితం, ఆలోచనలు వేరు. పైగా కాలంకు ఇంత, పేజీకి మరింత అని ప్రోత్సాహం ఇచ్చే పత్రికలుండబట్టి కాస్త చెప్పగలిగిన నేర్పు ఉన్న ప్రతి ఒక్కరూ దీన్ని కుటీర పరిశ్రమచేశారని నా అభిప్రాయం. నేను సినిక్‌నన్నా సరే—నేను చూసినంతలో, చదివినంతలో నాకు అర్థమైంది ఇదే! చాలా గొప్ప రచయితలనేవారు ఏం మిగుల్చుకోలేదు—పేరు, దరిద్రం తప్ప. అయినా కవితాస్వేదాన్ని కాగితాల మీద కుమ్మరించి కన్నీరు తెప్పించే చాలా మందికి నిజ జీవితంలో కన్నీటి బొట్టుకు విలువ తెలియదు. వారి అనుభవాలు వేరేమోగానీ నా మాటలు ఇవే.

అందుకని ఉమను ఒక రచయిత్రి అనడంకన్నా, నా మేనగోడలు, ఎమ్.ఎ. పాస్ అయింది, వీణ వాయిస్తుంది అంటూ ఆలోచించుకోవడం బావుంటుంది నాకు.

చాలా పత్రికలు 'కాలం' కట్టి ఉమ గురించి రాశాయి—

"ప్రఖ్యాత రచయిత్రి ఉమాదేవి ఆత్మహత్య"

చాలా గొప్పగా, అందంగా అందరూ గుర్తించి ఆలోచించేట్లు చేసిన పనేనన్న మాట ఉమ చేసింది?

అరబ్బు దేశాల్లో పనిచేస్తున్న కోటీశ్వరుడైన ఒక అందగాడు, యువకుడు అయిన వ్యక్తి చేత బుద్ధిగా అందరి ఆద

పిల్లలలాగే తాళి కట్టించుకుని భర్త దగ్గరకు వెళదామని రైలు ఎక్కి- శవంగా అతని చేతిలో వాలిన యువతి కథ!

కానీ, అప్పుడు ఆమె శవంలా లేదు. చాలా అందంగా అలంకరించుకుని, తలనిండా పూలతో, ఎర్రగళ్ళ రంగు చీరతో, కళ్ళ నిండా కాటుకతో - ఆమె భాషలో చెప్పాలంటే 'నేల రాలిన పారిజాతం'లా ఉన్నది ఉమ.

'గ్లామర్ క్వీన్స్ అయిన సినిమా ఆర్టిస్టుల్నే కాదు - కొందరు అందగత్తెలు కూడా పత్రికలకు ముఖపత్ర సుందరులుగా పరిగణింపబడవచ్చు' అని నిర్ణయించుకున్న ఒక పత్రిక ఉమ ఫొటో పత్రిక అట్టమీద వేసింది. అందులోనే పై వాక్యాలు రాసింది. చనిపోయిన కారణం ఇంకా తెలియదనీ రాసింది.

కొన్ని పత్రికలు మామూలుగానే వాళ్ళ 'ఊహ'ను 'నిజం'గా రాశాయి. కొన్ని నిజాయితీగల పత్రికలు ఇది మా 'ఊహ', 'నిజం' కావచ్చు అని రాశాయి.

నాకీ మొత్తం గందరగోళంలో నచ్చనిదేమిటంటే, ఎక్కడో అరబ్బు దేశాల్లో ఉన్న ఉమ భర్త మీద వ్యాఖ్యానాలు రాశారు కొంతమంది. మరి కొందరు ఆమెకు అజ్ఞాత ప్రేమ కథ ఉందని రాశారు. ఆమె తల్లీ దండ్రీ ఆమె ఇష్టాన్ని మన్నించలేదు కాబట్టి కసాయి వాళ్లన్నారు. కట్నం విషయంలో తేడా

వచ్చిందనీ, అభిజాత్యమున్న ఆడపిల్ల కాబట్టి ఆత్మహత్య చేసుకుందనీ, ఆమె అత్తవార్ని క్రిమినల్ కోడ్ కింద బుక్ చెయ్యాలనీ కొందరన్నారు.

శవదహనం–న్యాయంగా ఆమె భర్తే చెయ్యాలి. కానీ, "నాకీ సెంటిమెంట్లు లేవు... నేను రాను" అని స్పష్టంగా చెప్పాడట ట్రంకాల్‌లో. సరే, తండ్రి చెయ్యొచ్చని బ్రాహ్మలు అడ్జస్ట్‌మెంటూ, అమెండుమెంటూ చేశారు.

ఉమ స్నేహితురాళ్లూ, ఓ ఐదారుగురు రచయితలూ వచ్చి దుఃఖపడ్డారు. 'నేలరాలిన పారిజాతం' అని అప్పటికప్పుడు కవితాగానం చేశాడు ఒక ఆశుకవి. విపరీతంగా ఏడ్చాడు లక్ష్మణ్.

అర్థంకాని మంత్రాలు, అర్థం చెప్పని ఆచారాలతో పన్నెండు రోజుల దాకా క్రతువు సాగుతోంది.

"ఇంటికి పెళ్ళికి వేసిన రంగులు, పెట్టిన ముగ్గులు ఇంకా మాయలేదు వదినా! అప్పుడే ఈ తంతు" అని వెక్కి వెక్కి ఏడుస్తోంది వసుంధర వియ్యపురాల్ని కౌగిలించుకుని.

అవతలివాళ్ళ మనస్సులో ఏమున్నాయోకానీ, ఒక్కరూ బైటపడటం లేదు.

"చక్కగా అంత చదువుకున్నా కాలికి పారాణి పెట్టించుకుంది. వడ్డాణం, వంకీ పెట్టాం.....చక్కటి పిల్ల. ఏం పాపమో...." మూసవాయనాలు ఇస్తూ ఏడుస్తున్నారు– వాళ్ళ ఆడబడుచులూ, అత్తగారూ.

ఈ గందరగోళాల మధ్య అప్పుడప్పుడు ఉన్నట్లుండి ఏ పత్రికావిలేఖర్లో దిగి ఆమె తల్లినీ, తండ్రినీ, అత్తమామల్నీ ఇంటర్వ్యూ చేస్తూనే ఉన్నారు.

పన్నెండో రోజున ఈ గందరగోళమంతా చూస్తూ, దూరంగా పడక్కుర్చీ వేసుకుని కూర్చున్న నాకు అరికాలు మంట నెత్తికి వస్తోంది. 'చచ్చినవాళ్ళ కళ్ళు చారడేసి...' అని చెప్పుకోవాలి కాబట్టి ఊరుకున్నాను గానీ, ఇంత కొట్టు పెట్టి చచ్చిపోయిన ఉమ మీద నాకు చాలా కోపంగా ఉన్నది. 'అదరగణ్ణంపిల్ల' అని తిట్టుకున్నాను కాసేపు. కానీ, వద్దనుకుంటున్నా మనసులో ఎక్కడో కలుక్కుమంటూనే ఉంది ఆ పిల్ల గుర్తుకు రాగానే.

కారణం – ఉమను నా చేతుల్లో ఎత్తుకుని పెంచాను. జనముద్దుపిల్ల అది.

పత్రిక మీద దాని బొమ్మ కనబడింది ఉమ అందగత్తెలకిందే లెఖ్ఖ. సైడ్ పోజు బొమ్మ వేశారు. మెళ్ళో బంగారు గుళ్ళ దండ, కాటుక కళ్ళు, తలనిండా పూవులు; పట్టుదల, పంతం సూచించే గడ్డం–చక్కటి పిల్ల. ఆ బొమ్మలో కనబడనిది, ఉమకు మరింత అందం తెచ్చింది బారాటి జుట్టు. ఒక ఛాయ ఎక్కువైన పిల్లే! ఎందుకిలా వడ్డించిన విస్తరిలాంటి జీవితం పాడు చేసుకుంది?

పదమూడో రోజు దీపాలు చూడకుండానే తట్టాబుట్టా సర్దుకుని వెళ్ళిపోతున్న వాళ్ళలో ఒకావిడ నా వెంట పడింది–

"ఇదుగో బావగారూ! జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పటికైనా తెలివి తెచ్చుకుని మీ చెల్లెలు రెండో కూతుర్నైనా మా అబ్బాయికి ఇస్తుందేమో కనుక్కోండి. మా అబ్బాయీ ఫారన్‌రిటండ్ డాక్టర్. వాళ్ళకేం తీసిపోడు. ఎక్కడో అరబ్బు దేశాలు, అమెరికాలు అని ఎచ్చులు పోయారు. ఈ పరిస్థితుల్లో వాళ్ళతో




మాట కదలెయ్యడం అంతగా బావుండదు" అని వెళ్ళిపోయింది.

అవాక్కైపోయాను కాసేపు.

నిజమే...ఇంత ఆస్తికి ప్రస్తుతం రమ వారసురాలు. బాషలు, పుట్టుకలు మనుషుల లౌక్యాలు ఆపలేవు... దేని దారి దాందే.

అప్పుడే పరీక్షగా చూశాను రమ ఎక్కడుందా అని.

బెల్‌బాటం పాంటుతో మెట్ల మీద క్రోటన్స్ పక్కన కూర్చుని నెయిల్ పాలిష్ కాబోలు వేసుకుంటోంది రమ.

"రమా!" పిలిచాను.

"ఏమిటి మావయ్యా!" ఛంగున వచ్చి లాన్‌లో కుర్చీ లాక్కుంటూ అంది.

పరీక్షగా చూశాను. మొదటి రెండు రోజులు ఏమేడిచిందోగానీ ఆ తరవాత చాలా మామూలుగానే ఉంది.

"ఉమఎందుకుచచ్చిపోయిందంటావు?"

"మామయ్యా... అదో ఫూల్! అంతే! తనకి ఈ పెళ్ళి ఇష్టంలేకపోయినా, ఇంకేదన్నా ఫీల్ అయినా దర్జాగా చెప్పి ఉండచ్చు. ఈ న్యూసెన్స్ ఏమిటి? నా కిదేం నచ్చలేదు" గట్టిగా విసుగ్గా అనేసింది.

ఖంగుతిన్నాను నేను.

"ఏమిటో మామయ్యా! అక్కయ్య ఇలా చేస్తుందని అనుకోలేదు" అని అది కళ్ళంబడి నీళ్లు పెట్టుకుంటే, సముదాయించే మూడ్‌లో ఉన్నాను మరి.

"నిజమేననుకో! నా ఆలోచనా అదే! కానీ, కారణం ఉండాలికదా" గడ్డం కింద చెయ్యి పెట్టుకుని సూటిగా చూస్తూ అడిగాను.

"నాకు ఊహాగానాలు చేసే అలవాటు లేదు" కటువుగా అంది చేతులు నిస్సహాయంగా పైకెత్తి.

"అడిగానని కాదు ... ఏదైనా లవ్ ఎఫైర్!"

"ఎవరికి ! ఉమకా !" గట్టిగా నవ్వింది.

"ఏమిటి రమా ఆడపిల్లకు ఆ నవ్వు!" ఎక్కడినుంచో వింటోంది కాబోలు అరిచింది అంతకన్న గట్టిగా వసుంధర.

"ఏమిటా అరుపు! ఏమిటా గట్టిగా మాట్లాడ్డం! – అని అంతకన్న గట్టిగా అరిచి చెపుతారు తల్లులు. ఆచరించ లేనివి చెప్పడంలో అంత నమ్మకం వాళ్లకు"

"పైకి ఉమ రూముకు పోదాంరా!" అని లేచాను.

"వస్తానుండు మామయ్యా..." అని క్యూటెక్స్ సీసా మూత జాగ్రత్తగా మూసి పట్టుకుని చెంగున మెట్లెక్కింది రమ.

మా బావమరిది చాలా పెద్ద ఇల్లు అధునాతనంగా కట్టించాడు...చాలా చక్కటి ఫర్నిచరు కొన్నాడు. పెయింటర్ పేరు తెలియకపోయినా, గొప్ప పెయింటింగ్స్ అని విన్నవి కొని అక్కడక్కడ గోడలకు పెట్టించాడు. చలువరాయి మేడ, పాలరాళ్ల బాత్‌రూంలు, చాలా ఖరీదైన పూలకుండీలు – అన్నీ ఉన్నాయి. కానీ అలంకరణలో ఎక్కడో అస్తవ్యస్తత ఉందనిపించింది. నేనేం ఇంటీరియర్ డెకరేటర్‌ను కాను చెప్పడానికి. చెప్పలేనంత మాత్రంచేత ఫీలవకపోముగా...!

ఉమగది మూసి ఉంది. తెరిచి లోపలికి అడుగుపెట్టాను. తూర్పువైపు కిటికీలోంచి ఎండ లోపలికి పడుతోంది. చల్లగా ఏర్‌కండిషన్ గదిలా ఉంది. తెల్లటి దుప్పట్లు, గలేబులు– ఒకసైడు పుస్తకాల





రాక్, చిన్న ట్రాన్సిస్టర్, ఏదో శిల్పంలో బిగించిన ఆర్టిస్టిక్ గడియారం మామూలు కార్పెట్టు, టేబిల్ మీద మట్టిబొమ్మ... రాధాకృష్ణులు కాబోలు – పదిరూపాయలు ఖరీదు కూడా చెయ్యదేమో.. అయినా చాలా ఆర్టిస్టిక్‌గా ఉంది. గోడకొక కాలెండర్, దానిమీద పొన్నచెట్టు కింద కృష్ణుడు, అతని చేతుల్లో మురళి.. దానివంకే చూస్తూ ఆలోచిస్తున్నట్లున్నాడు అతను.... వెనకాల యమునానది, దాని కింద 'రాధాభావన' అని రాసిఉంది. పుస్తకాలు తిప్పి చూశాను. గొప్ప లిటరేచర్ అనిపించేవి అన్నీ ఉన్నాయి. ఒక మూల స్టాండ్ మీద వీణ. అంతకన్న ప్రత్యేకత ఏం కనబడలేదు నాకు ఆ గదిలో. నిశ్శబ్దంగా వుంది చుట్టుపక్కల. ఆమె రాసుకునే బల్ల దగ్గర నిలబడ్డాను.

'ఏమైపోయావు ఉమా నువ్వు ...' అనుకున్నాను.

'ఇక్కడే ఉన్నాను మామయ్యా!' అని నవ్వినట్లు అనిపించింది.

ఉలిక్కిపడ్డాను. చుట్టూ చూశాను రమ ఏదో పుస్తకాలు తిప్పుతోంది. ఎవరూ లేరు.

నా భ్రాంతి కాబోలు. ఇంకెక్కడి ఉమ! తలుపు దగ్గరకేసి వస్తూంటే రంగుల పూసలు శబ్దం చేశాయి. వాటికి కట్టిన మువ్వలు కాబోలు రవళించాయి. వీణ ఎవరో శృతి చేసినట్లు మోగింది.

"ఏమిటది రమా!"

"ఏంలేదు మామయ్యా! గాలికేమో.." అంది తలుపు నా వెనకాలే మూసివేస్తూ.

ఇల్లంతా తిరిగాను. ఎందుకో ఉమ గురించే ఆలోచన. ఎలా ఉండేది ఉమ?! ఎప్పుడూ ప్రత్యేకింగా ఆలోచించలేదు నేను. నా చెల్లెలికూతురు గురించి ఇంకే ముంటాయి ఆలోచించడానికి? ఉమ కొంచెం సాత్వికురాలు, రమ కాస్త అదరగణ్ణం చేసేది. అంతే నాకు తెలుసు.




మేడ మెట్లు వారగా, కింద వరండాలో లక్ష్మణ్ స్టూలు మీద కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్నాడు. సామాన్లు ఏవో లెఖ్ఖ చూస్తున్నాడు. మనిషీ బాగా నలిగిపోయాడు. గెడ్డం మాసిపోయింది. భుజంమీద ఒక మాసిన నాప్కిన్ ఉన్నది. పాపం ఈ పదమూడు రోజుల హడావిడి అంతా అతని మీదుగానే జరిగింది. మా వసుంధర దృష్టిలో క్లర్కులు వగైరాలంతా వాళ్లాయనకు, తనకు ఊడిగం చెయ్యడానికి ఉన్నారనే! పాపం వాళ్లూ వాళ్ల అయ్యగారి దృష్టిలో మంచిగా ఉండటానికి అలాగే పని చేసి పెట్టేవారు. స్వతంత్ర భారతదేశం అంటారు కానీ ఈ సేవాపరాయణత, స్వామి భక్తి వగైరా పదాలకింద ఆ స్వతంత్రత ఎప్పుడో సమాధిచేయబడింది.

లక్ష్మణ్ విషయం అలాకాదు. ఇట్లాంటి వాళ్లు మరీ బాధ్యతలు నెత్తిన వేసుకుని, అందరి పనులు చూస్తూ వాళ్ల సంకెళ్లు వాళ్లే వేసుకుంటారు. ఈ బాపతు మనుష్యుల్ని ఎవరూ రక్షించలేరు. వాళ్ల ఖర్మ అంతే.

మెల్లిగా వెళ్లి దగ్గరగా నిలబడ్డాను. వంటవాళ్లకు లెఖ్ఖలు కట్టి డబ్బు ఇస్తున్నాడు. "ఇంకొక పదిరూపాయలు ఎక్కువ వేసి ఇవ్వండి బాబూ!" అంటున్నాడు వంటవాడు.

"సర్లే! అమ్మగారు నన్ను తిడతారు" అంటూనే సర్దుతున్నాడతను.

మా వసుంధర ఇల్లాంటి విషయాల్లో మహా గట్టి. అవసరమున్నవాళ్లకు ఆభరణాలన్నా ఇస్తుంది కానీ, 'అఖ్ఖర్లేదు' అనుకున్నప్పుడు ఐదుపైసలు కూడా లెఖ్ఖ కడుతుంది. బహుశా ఈ పదిరూపాయలు లక్ష్మణ్ జేబులోంచి పడినా ఆశ్చర్య పడనక్కర్లేదు.

"లక్ష్మణ్! నా బట్టలు ఐర్నింగ్‌కు ఇచ్చాను. తెప్పించి పెట్టు. రేపటినించీ కాలేజీ" పైకెక్కుతూ అరిచి చెప్పి వెళ్లిపోయింది రమ.

"సరేనండీ" లెక్కలు చూస్తూనే అన్నాడతను.

అతనివంక జాలిగా చూశాను. ఏ ఐదారువందల జీతంతోనో తన కుటుంబం కష్టాల్లో ఉన్నప్పుడు ఆదరించి, ఉద్యోగం వేయించారన్న కృతజ్ఞత ఇతనిచేత ఎన్ని పనులు చేయిస్తోంది!! ఇతడు ఒక్కడూ ఎంత బాధ్యతతో పని...

చటుక్కున గుర్తుకు వచ్చింది. ఉమ ఆఖరి ప్రయాణంలో దగ్గర ఉన్నది ఇతనేనని.

"లక్ష్మణ్" పిలిచాను.




"వస్తున్నాను సార్" జమా ఖర్చు పుస్తకాలు సర్దేసి పనివాళ్ళకు ఆదేశాలు ఇచ్చి నా వెనకాలే వచ్చాడు మెల్లిగా. ఇంటి వెనకాల తోటలో సిమెంటు బెంచీ మీద కూర్చున్నాం ఇద్దరం. అరిచెయ్యి చూసుకుంటూ ఆలోచిస్తున్నాడతను.

"ఏమిటి నీ చేతినిండా పసుపు ఆడపిల్లలా?" నవ్వుతూ అన్నాను.

"ఇందాక జాడీలోనించి కిందపడితే వంటవాళ్ళతోపాటు ఎత్తాను సార్" నవ్వుతూ అన్నాడు.

వాతావరణం చల్లగా ఉంది. విరజాజి మొగ్గలు జోగుతున్నాయి. చటుక్కున తలనిండా జాజిపూలతో, కాటుక కళ్ళతో 'ఉమ' గుర్తుకువచ్చింది.

"లక్ష్మణ్! ఉమ ఎందుకు పోయిందంటావ్?" సూటిగా అడిగాను.

ఒక్కసారి తలెత్తి చూసి తలవంచుకున్నాడు. మాట్లాడలేదు. అతనికి తెలిసి ఉండకపోవచ్చు. అయినా అతనికి ఎలా తెలుస్తుంది?

"ఎందుకు చచ్చిపోయింటో?" ఆలోచిస్తూ అన్నాను.

"బతకలేక" తపీమని సమాధానమిచ్చాడు.

ఉలిక్కిపడ్డాను. నిజానికి అదేం గొప్ప సమాధానం కాదు. బతకలేకే చచ్చిపోతారు. కానీ లక్ష్మణ్ అలా సమాధానం ఇవ్వడం కొంచెం ఆశ్చర్యమనిపించింది.

పరీక్షగా అతనివంకే చూశాను. సూటిగా నా వంక చూస్తున్నాడు. అతని కళ్లు నిర్మలంగా ఉన్నా అందులో కన్నీటి పొర.

దూరంగా ఎక్కడినించో అయ్యప్ప భజన తాలూకు విచిత్రమైన సంగీతం వినిపిస్తోంది.

"నిజం సార్! ఆవిడ బతకలేకే చచ్చిపోయారు. ఎలా అని అడక్కండి. నేను చెప్పలేను. నాకు తెలియదు కూడా. కానీ ఇలా ఏదో అవుతుందని మొదటి నించీ అనుకుంటూనే ఉన్నాన్నేను"

ఆశ్చర్యంగా చూశాను. ఇతను మా వాళ్ళ ఇంట్లో పనిచేసే మామూలు క్లర్కు. కనీసం వాళ్లింటి గోడల డిస్టెంపర్‌కు, కర్టెన్లకు ఉన్న ఖరీదు కూడా చెయ్యని మనిషి అక్కడివాళ్ళ దృష్టిలో. కానీ మనిషి...

"ఎందుకని అలా అనిపించింది లక్ష్మణ్ నీకు?" కుతూహలంగా అడిగాను.

"చెప్పలేను సార్! కారణం ఆమెగారి పట్ల నా..." ఆగిపోయాడు. ఒక్కసారి రెండు అరచేతుల్లోనూ మొఖం దాచుకుని ఏడ్చేశాడు. ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నాను. కాస్సేపు ఏడవనిచ్చాను.

ఏడిచే మగవాడి మీద నాకు పెద్ద గౌరవం ఏంలేదు. కానీ లక్ష్మణ్ ఏడుపులో ఏదో తెలియనిది, చెప్పలేనిది అయిన బరువు ఉంది. దుఃఖానికి వైబ్రేషన్ ఉందేమో నా కళ్ళల్లోనూ నీరు తిరిగింది.

మెల్లిగా అతని భుజంమీద చెయ్యి వేశాను.

"ఏడవకు లక్ష్మణ్.....పోయినపిల్ల తిరిగిరాదు. కానీ పిచ్చిపిల్ల. అనవసరంగా చచ్చిపోయింది. అంత ఆవేశం ఏమిటి ఏం జరిగితేమాత్రం? చాలా మందికన్నా తను ఎంత సుఖంగా ఉన్నది? ఆలోచించుకోవద్దూ!" అన్నాను లాలనగా.

"కాదు సార్" తలకాయ అటూయిటూ తిప్పుతూ అన్నాడు. "కాదు సార్...ఎలా చెప్పాలి?" ఎర్రటి పెదవి కొరుక్కుంటూ ఎటో చూస్తూ అన్నాడు.

"సార్...ఆ మల్లెతీగెకు వేపకాయ

కాస్తే ఎలా ఉంటుంది? నాకు కవిత్వం చెప్పడం రాదు సార్. కానీ అంత అసహజంగా ఉండేది ఉమ బతికి ఉండటం. ఆవిడ ... ఆవిడ దేవత సార్. ఈ లోకంలో ఉండకూడదు"

"లక్ష్మణ్!" ఎక్కడినుంచో వసుంధర గొంతు వినిపించింది.

"వస్తున్నానండీ! వస్తాను సార్" అని చటుక్కున లేచి పరిగెత్తాడు.

అతను వెళ్ళినవంకే చూస్తూ కూర్చుండిపోయాను. ఏం పిల్లాడితను? ఇతనికి ఉమ అంటే ఎంత గౌరవం? యజమాని కూతురు మీద ఇంత గౌరవం, ప్రేమ.... చటుక్కున ఆగిపోయాను. ఇతనికి ఉమ అంటే ఉన్న ఆరాధన...ఆశ్చర్యంలేదు. చాలాచోట్ల యజమానుల కూతుళ్ళ మీద తెలియని మమకారాలు పెంచుకుని చెప్పుకోలేక ఆగిపోయినవారు సృష్టిలో చాలామంది ఉన్నారు. అవి శృతిమించి రాగానపడి అల్లరిపడ్డవాళ్లూ ఉన్నారు. లక్ష్మణ్ తన స్థాయి తనకు తెలిసినవాడు.

లాన్‌లో నడుస్తూ వస్తూంటే కాలికి కుక్కపిల్ల తగిలింది. దాని కళ్ళలో తెలియని మమకారం. ఉమ చచ్చిపోయిన నాటినుంచీ అది పాలు సరిగ్గా తాగడం లేదుట. బలవంతంగా పడుతున్నారు చచ్చిపోతుందేమోనని.

'మా ఉమకేమయింది?' అని నన్ను ప్రశ్నిస్తున్నట్లు చూస్తోంది.

మెల్లిగా దాన్ని ఎత్తుకుని ఆలోచిస్తూ అడుగులు వేస్తున్నాను. చేతిలో కుక్కపిల్ల, లక్ష్మణ్ గురించినఊహ..కొంపదీసి

అటుదిటు కాలేదు కదా! ఒకవేళ ఉమ లక్ష్మణ్ మీద ఆశలేమయినా పెంచుకుని..

ఛా! ఛా! అది వసుంధర కూతురైతే మాత్రం అలా చెయ్యదు.

ఏమో-చెప్పలేని ప్రేమలు, అనుకోకూడని పరితాపాలు ఇవన్నీ మామూలే. అందులో ఈ రచించే జబ్బు ఉన్న పిల్లాయె....

ఇక మెల్లిగా వసుంధరకుచెప్పి ఇంటికి వెళదామని ఆవిడ గదిలోకి వెళ్ళాను. ఉమ పెళ్ళి చీరలు.. చాలా ఖరీదుచేసేవిలా ఉన్నాయి-తీసి జాగ్రత్త పెడుతోంది.

"రా అన్నయ్యా! చూశావా ఈ చీరలు? ఒక్కొక్కటి ఐదువేలు. ఇవి చూడు-రెండు మూడువేలు. ఒక్కసారి కూడా కట్టుకోలేదన్నయ్యా. ఏమొచ్చి ఇలా అన్యాయం చేసిపోయింది చెప్పు...? మా ఖర్మ. నలుగురి నోళ్ళలో నానాలని నా మొహాన రాసిపెట్టి ఉంది. మా అత్త గారూ వాళ్లూ ఏమంటున్నారో తెలుసా? దాన్ని నేను డబ్బు మైకంలో అమ్ముకోడానికి కూడా సిద్ధపడ్డానట. అందుకే ఈ కడుపు కోకంట. అసలే పిల్లపోయి నేనేడుస్తూంటే..." వెక్కిలు పెడుతూ మంచంమీద కూలబడిపోయింది.

నాకు జాలేసింది. దగ్గరకువెళ్ళి తల నిమురుతూ "ఏడవకమ్మా" అన్నాను. ఎవరి జీవితంలోనన్నా ఇలాంటి సంఘటనే జరిగితే మా వసుంధర ఏ మాట అంటుందో నాకు తెలుసు. తన అత్తారు తరఫువారిని అది పెట్టిన రట్టుకు వాళ్ళు బదులుతీర్చుకుంటున్నారు సమయం వచ్చిందని. ఇవన్నీ లౌకిక ప్రపంచంలో మామూలే.

"నేను ఇంక ఇంటికి వెళతానమ్మా!" అన్నాను.

"అదేమిటన్నయ్యా! అప్పుడే నీకు ఇది పరాయి ఇల్లయిపోయిందా? నాలుగు రోజులు ఉండివెళ్లు. దాని అత్తారు తరఫు వాళ్ళతో ఈయన గట్టిగా మాట్లాడలేరు. మనం పెట్టిన నగలు, ఇచ్చిన కట్నం-వీటి సంగతి మాట్లాడేసుకుంటే బావుంటుంది. ఆ తరవాత తెగవు వ్యవహారాలు. నేను మాట్లాడితే ఈ పరిస్థితిలో నానామాటలంటారు. నలుగురి తరఫున పెద్దవాడివి నువ్వే తేల్చివెళ్లు"

నేను వింటూ నిలబడిపోయాను. 'వసుంధరా! ఈ ఆస్తి ఇలాపెరగడానికి నీ బుర్ర ఎంత కారణమో ఈ జన్మకు మా బావ గ్రహించలేడు' అనుకుంటూ "సరే" అన్నాను.

వ్యవహారాలు ముగ్గులోకి వచ్చేటప్పటికి గరుడపురాణాలు, పాపపుణ్యాలు, ప్రేమా ప్యాయతలు కలికంలోకి లేకుండా పోయాయి.

రంజిత్ తనకు అత్తవారిచ్చిన కట్నం చెల్లెళ్లిద్దరికీ పంచేఏర్పాటు చేశాడట .వాళ కుటుంబరాజకీయాలు వాళ్ళవి. ఎవరికీ ఏవీ వదులుకోవడం ఇష్టంలేదు. అరుపులూ, గోలలూ, తిట్లూ, ఒక లెవల్లో శాపనార్థాలు.

"ఎట్లా అన్నా తగలబడమను. నా పిల్ల నాకు తిరిగి వస్తుందా?" అన్నాడు మా బావమరిది విసుగొచ్చి.

"వాళ్ళకేం తక్కువండి! నెల తిరక్కుండానే మరొక పిల్లను చేసుకుంటారు. మళ్ళీ ఇంత డబ్బు వస్తుంది. పిల్ల, డబ్బు రెండూ మనకెందుకు పోవాలి? కాస్తా కూసానా...నాలుగులక్షలు... ఆ పైవి పోనే పోయాయి..."ఏడుస్తూనే అన్నది వసుంధర.

నాలుగులక్షలు అన్నమాట సామాన్యం




కాదు. మళ్ళీ మా బావ రంగంలోకి వచ్చాడు. నానా గందరగోళాల తరవాత రాజీకి వచ్చి 8 లక్షలు తిరిగి ఇచ్చేటట్లు, నగలు, వెండిసామాను ఇచ్చే సేట్లు—ఏదో మతలబుకు వచ్చారు.

"ఏమిటీ న్యూసెన్స్! ఉమ లేనప్పుడు దాని డబ్బు తీసుకునే రైట్ వాళ్ళకేముందిట... బార్బరస్ పీపుల్..." అని అరిచింది రమ.

గోడకానుకుని ఈ అరిచేవాళ్ళకు మధ్య మధ్య కాఫీ, టీలు సప్లయిచేస్తూ జరుగుతున్నదంతా నిర్లిప్తంగా చూస్తున్న లక్ష్మణ్‌ను గమనిస్తూనే ఉన్నాను. నాకెందుకో అతని గురించిన అనుమానం పోవడంలేదు.

"ఏమిటి లక్ష్మణ్ అవతలివాళ్లు ఇలా మాట్లాడుతున్నారు ?'' అని పరీక్షగా అడిగాను.

"మీకు తెలియనిది ఏముంది సార్? వీళ్ళందరికీ బస్సులు, కార్లు,ప్లేన్ టిక్కెట్లు బుక్ చేసి, గెస్ట్‌హౌస్‌లు బుక్ చేసి అన్ని రకాల మర్యాదలు చేసినపుడు కూడా, టైంవస్తే వీళ్లు ఇలా మాట్లాడతారని మన అమ్మగారికి, సార్‌కు తెలియదంటారా? అందరికీ అన్నీ తెలుసు. ఇదంతే" అని నిర్లిప్తంగా వెళ్లిపోయాడు.

ఏం మాట్లాడలేకపోయాను నేను.

హడావిడి సర్దుకోగానే ఇల్లంతా పొగమంచు వాలినట్లుంది. రంజిత్ తరపు వాళ్లు వీడ్కోలు తీసుకుని 'వీలైతే మీరంతా మా ఊరు రండ'ని మర్యాదకన్నారు. 'పిల్ల లేకపోయినా, మీరు వస్తూ పోతూ ఉండాల'ని వీరన్నారు. ఇంక ఎవరూ, ఎక్కడికీ రారని అందరికీ తెలుసు. ఇదంతా ఫార్మాలిటీ. అంతే.

ఆ రాత్రి నాకు నిద్రపట్టడం లేదు. మెల్లిగా లేచి లాన్‌లో పచారీలు చేద్దామని వెళ్లాను. అక్కడ ప్లాస్టిక్‌వైరు మంచం మీద దిండుకూడా లేకుండా పడుకున్నాడు లక్ష్మణ్. ఇంట్లో అందరికీ పరుపులు, దుప్పట్లు సర్దిపెట్టి చేసిన అతను ఎలా పడుకున్నాడా అని కూడా ఆలోచించదు వసుంధర.

'ఆఁ! అంత వెతుక్కోవడానికి ఏమున్నా' అనుకుంటుంది.

వెల్లకిలా పడుకుని ఆకాశంలోకి చూస్తున్నాడతను.

"లక్ష్మణ్!ఏమిటి ఆలోచిస్తున్నావు?" మెల్లిగా మంచం మీద కూర్చుంటూ అన్నాను.

"సార్...మీరిపాటివేళ...ఇక్కడ..." గభాల్న లేస్తూ అన్నాడు.

"నిద్ర పట్టలేదు...వస్తుంటే నువ్వు కనబడ్డావు ... ఫరవాలేదు ... పడుకో" అన్నాను నేను.

సాధారణంగా నేను ఇలాంటి పరిస్థితుల్లో పడను. నాకు లక్ష్మణ్ మీద ఒక రకమైన సానుభూతి ఉంది.

"ఏమిటి ఆకాశం వంక చూస్తున్నావు?"

"ఏం లేదు సార్...ఈ చుక్కల్లో ఎక్కడో మన ఉమగారు చుక్కై కనబడతారేమోనని..." రెండు చేతులూ వెనక్కు పెట్టుకుని ఆకాశం వంక చూస్తూ అన్నాడు.

జాలివేసింది నాకు. ఈ ఇంట్లో పాత్ర సామానుతో సమానమైన అభాగ్యుడు అర్ధరాత్రి చనిపోయిన ఉమ ఆత్మను చుక్కల్లో వెతుకుతున్నాడు.

"జీవి ఈ పదమూడోరోజు తరువాత భూ ఆవరణలన్నీ దాటి వెళ్లిపోతుందట సార్. పుణ్యలోకాలకు వెళ్లగలిగినవాళ్లు వెళ్లి కర్మానుబంధాన్ని పట్టి వెనుతిరిగి

జన్మ ఎత్తుతారట. కర్మానుబంధాన్ని తెంచుకున్నవారు విముక్తాత్మలవుతారట. ఉమగారు బహుశ ఒక నక్షత్రమై ఆ నక్షత్రమండంలో ఎక్కడో ఉండి ఉంటారు సార్...."

లక్ష్మణ్ కళ్లల్లో నీరు. నాకెందుకో తెలియని అనుమానం కలుక్కుమంది గుండెల్లో. నిజంగా కాలం, ఖర్మం కలిసివచ్చి ఈ ఇద్దరు ఒకరి ప్రేమలో ఒకరు పడి ఈ ఇబ్బందికరమైన పరిస్థితులకు బలైపోయారా?!

"లక్ష్మణ్! ఉమ ఇలా ఎందుకు చేసిందంటావ్?"

"చెప్పాను కదా సార్...బతకలేక. అసలు...."

నాకు తెలుసు ఇప్పుడు అతనిచేత మాట్లాడించగలనని. చుట్టూ నిశ్శబ్దత, అతని వంటరితనం, ఉమ గురించి భావన— ఇవన్నీ అతనిచేత మాట్లాడిస్తాయి. టాప్ చెయ్యడంలోనే ఉంది ప్రజ్ఞ.

"లక్ష్మణ్ .... ఉమ ఎవర్నైనా ప్రేమించిందంటావా?"

"ప్రేమా! తెలియదుసార్ ... కానీ ఆమె ప్రేమించదగ్గ వ్యక్తి ఈ ప్రపంచంలో ఉన్నాడని నేననుకోవడంలేదు సార్"

ఇదేమిటి ? ఇదే ప్రశ్నకు రమ నవ్వింది. లక్ష్మణ్‌ను అనుమానిద్దామనుకుంటే ఈ సమాధానం ఏమిటి? ప్రేమికుడైనవాడు ఇలా సమాధానం చెప్పడే! తనను తాను తక్కువ చేసుకునేవాడెవ్వడూ ఎదటి మనిషి తనదే అనుకునే నమ్మకం తెచ్చుకోడు. ఇదేదో భక్తుడు దేవత గురించి చెప్పే మాటలా ఉందే!

"ఎందుకని లక్ష్మణ్! ఉమ అంత గొప్పదా?"

నాకే నవ్వొచ్చింది ఈ ప్రశ్నకు. నా మేనగోడలు, నా ముందు గౌన్లు తొడుక్కుని తిరిగిన పిల్ల–దానికి గొప్పతనం ఆపాదించుకుని ఈ అమాయకుడు దుఃఖపడడం, నేను అడగడం...చాలా బావుంది.

ఈ విషయమే కదిలించినపుడు– "ఏమో...ముదనష్టపు పిల్ల...తలెత్తుకోకుండా చేసింది. ఏం తక్కువ చేశామని?" అని పంచాంగం విప్పింది వసుంధర.

"ఏమో బావా! దానికేం కావాలా అని మేమెప్పుడూ ఆలోచించ లేదేమో ! నాకు ఎంతసేపూ డబ్బు సంపాదన, జాగ్రత్త పడడంతో సరిపోయింది. తల్లి చూసుకునేది అంతా. ఏమో...అందరు తల్లులూ అమ్మలు కాలేరేమో" తడి అంగవస్త్రం ముఖానికి అడ్డం పెట్టుకుని స్మశానంనించి రాగానే బావురుమన్న బావ గుర్తుకు వచ్చాడు.

ఏమిటి ఉమ?! ఎవరికీ అర్థం కానిదా? మన మధ్యే ఉన్నా కొన్ని మనకసలు తెలియనివి ఉంటాయి. ఇన్నాళ్లు దాని గురించి ఆలోచించలేదు. ఇప్పుడు ఒప్పుకోక తప్పదేమో మరి.

"అదంతా నాకు తెలియదండీ! ఆమెతో నేను ఎక్కువ మాట్లాడేవాణ్ని కాదు. చెబితే వినేవాణ్ని. ఆవిడకు, ఈ ఇంట్లో మనుషులకు చాలా తేడా ఉంది సార్. ఎన్నోసార్లు నేను ఉద్యోగం వదిలి వెయ్యాలనుకున్నప్పుడు, ఇంట్లో కష్టాలు భరించలేక చచ్చిపోదామనుకున్నప్పుడు ఆమెగారే నన్ను ఆపారండీ! పరిస్థితుల్ని, మనుషుల బలహీనతలను చూసి నవ్వుకోవడం, ఆ తరువాత క్షమించడం ఆమె నేర్పారండీ. దాంతో నాకు కోపం, అర్థంలేని ఆవేశం తగ్గి

పోయాయి సార్. మరీ చీప్‌గా ప్రవర్తించేవాళ్ళను చూస్తే జాలివేస్తుంది అంతే! అటువంటి ఉమగారు చచ్చిపోతే నేను నా చేతుల మీదుగా ఇదంతా...." పెదవి బిగపట్టి దుఃఖం ఆపుకున్నాడతను. అతని కళ్ళల్లో నీళ్ళు. కానీ, మనసు ఏడుస్తోందని నాకు అర్థమైంది.

'కొన్ని కళ్ళతో చూడలేము, సాక్షి భూతాలుండవు.కానీ అనుభవం అవుతుంది' అని వేదాంతులు రాసేది ఇదుగో ఇల్లాంటిదే అయ్యుంటుంది.

నేను ఆలోచిస్తున్నాను – లక్ష్మణ్‌కు కనబడిన ఉమ నాకు ఎప్పుడూ అలా కనబడలేదే ఎందుకని? నేను చూశానేకానీ పరిశీలించలేదా?!

కానీ, నాకు వెంటనే ఒక ఆలోచన వచ్చింది. ఇంత చనువున్న మనిషి ఆఖరి క్షణాల్లో లక్ష్మణ్‌కు ఏం చెప్పి ఉండదా? అదే అడిగాను.

"లేదు సార్! ఆవిడ ఏం చెప్పలేదు. కనీసం తన బాధ కూడా బైట పడనివ్వలేదు. భలే మభ్యపెట్టారండీ అందర్నీ. బహూశ మేమందరం బాధపడడం ఇష్టం లేదేమో..."

ఇతడితో మాట్లాడి ప్రయోజనం లేదు. విషయం బయటకు రాదు. ఇతనికి ఉమ ఏం చేసినా గొప్పగానే ఉంటుంది.

"ఆ భర్త ఏమిటి లక్ష్మణ్? శవాన్ని పోలీసులకు అప్పగించి నిన్ను కాపలా పెట్టి వెళ్ళడమేమిటసలు? కనీస మానవత్వం ఉండద్దూ?"

ఈ మాటతో లక్ష్మణ్ లోపలి మనిషి బయటకు రావాలి. కారణం–అతను అంత గౌరవించే మనిషి శవంగా మారేటప్పటికి అలా వదిలేసినవాణ్ని భరించలేక నిజాలు మాట్లాడతాడు.

"తప్పులేదుసార్! అతని పరిస్థితిలో, అతని మనస్థత్వంలో అంతకన్న చేసేది ఏం లేదు"

మౌనంగా ఉండిపోయాను "పడుకో లక్ష్మణ్ ఆలస్యమైంది" అంటూ లేచాను.

మర్నాడు ఒక్కక్షణం కూడా ఉండ బుద్ధి కాలేదు ఆ ఇంట్లో. ఏమిటో గజిబిజిగా ఉంది మనసు. ఈ ఇంట్లో మనుషులకు, వాతావరణానికి దూరమైపోతే తప్ప బతకలేననిపించింది. నా ఇంట్లో నా భార్యా వియోగం నన్ను ఒంటరివాణ్ని చేసినా వంట కుర్రాడు, తోటమాలితో బోలెడు ప్రశాంతంగా ఉంటుంది. ఈ గోలలేవీ మమ్మల్ని అంటవు. ముఖ్యంగా ఉమను మర్చిపోవచ్చు.

కాని ఇలా అనుకోవడం ఎంత పిచ్చిదనమో తరవాత తెలిసింది నాకు.




మధ్యాహ్నానికి మా ఇంటికి నేను వచ్చేశాను.

మూడు రోజుల తరవాత కాబోలు సాయంత్రం టీ తాగుతున్నాను. అప్పటికే ఉమ పోయి 16 రోజులు దాటినట్లుంది.

"ఉన్నారాండీ" గేటు దగ్గర చప్పుడు చేస్తున్నారెవ్వరో. వాకిట్లోకి వచ్చాను. రామేశంగారు.

"రండి రండి" అని ఆహ్వానించాను"

"ఈమధ్య వచ్చాను. మీరు లేరు. ఒక ఆట వేద్దామా?"

"ఆ! సలక్షణంగా" అంటూనే ఛెస్ బోర్డ్, కాయిన్స్ తెప్పించాను. అవన్నీ సర్దుతున్నారు. ఆయన వంకే చూస్తున్నాను నేను.

రామేశంగారి పరిచయం చాలా తమాషాగా జరిగింది నాకు.

"బాబుగారూ!" అని ఒక రోజు పొద్దున్నే పిలుపు వినబడింది. చూద్దును కదా—నీర్కావి పంచ, విభూది రేఖలు, పిలక, ఆజానుబాహువైన మనిషి సాక్షాత్తు శివుడిలా ఉన్నాడు. చేతిలో పూలబుట్ట.

"ఏంకావాలి మీకు? రండి" అన్నాను.

"ఏంలేదు. ఇవ్వాళ మా ఇంట్లో దేవీ పూజ. అదుగో ఆ నాలుగో ఇంట్లో వెనక షెడ్డులో అద్దెకుంటున్నాము మేము. నా పేరు రామేశం అంటారు. మీ ఇంట్లో మందారపువ్వులు కోసుకువెళదామని వచ్చాను. అమ్మవారిని 'జపాకుసుమ భాసురాం' అన్నారు కదండీ అందుకని"

"దానికేమభ్యంతరం? సలక్షణంగా తీసుకువెళ్ళండి" అన్నాను. బుట్టనిండా పూవులు తీసుకుని – "అమ్మవారి ఆశీర్వచనం మీకు ఎప్పుడూ ఉండాలి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత మరొకసారి నేనే రమ్మనమని ఆహ్వానించాను. మాటల సందర్భంలో ఆయనకు ఛెస్ ఆడడం వచ్చని తెలిసింది. అప్పటినించీ ఆయనే మా ఇంటికి అప్పుడప్పుడు వస్తూవుంటారు. ఏదో పత్రికల్లో వాటిల్లో మంత్రశాస్త్రం గురించి రాస్తూఉంటాడట. ఆయనా,ఆయన భార్యా ఇద్దరే కాబట్టి తృప్తిగా బతికేస్తున్నారు. పిల్లలు ఎక్కడో ఉద్యోగాల్లో ఉన్నారు.

నా పరిధిలోకి వచ్చేవారెవ్వరూ నాతో అతి చనువు తీసుకోనంతకాలం నేను మంచి స్నేహితుణ్ణే. కానీ ఇంట్లో ఆడదిక్కు ఉండదుకదా అని పనివాడిచేత అతిగా కాఫీలు తెప్పించుకోవడం, నేను లేకపోయినా నా ఇంట్లో జొరబడి పేపర్లు వగైరా చదివెయ్యడం, నా వస్తువులు వాడుకోవడం,లేకపోతే ఇంట్లో బాధ్యతలు తప్పించుకోడానికోసరం రోజులో ముప్పాతిక దినం మా ఇంట్లోనే పడివుండి మా ఇల్లు క్లబ్బుగా ఉపయోగించుకుని నాకు ప్రైవసీ లేకుండా చెయ్యడం–ఇవేవీ భరించను నేను. ఇటువంటి పరిచయస్థులకన్న ఒంటరితనమే బావుంటుంది నాకు. కానీ రామేశంగారు వీటిలో ఏ అలవాటూ లేనివాడు, టైమింగ్ మెయిన్టేన్ చేసేవాడు, తక్కువ మాట్లాడేవాడు. ఆయనకు కాఫీ అలవాటులేదు కాబట్టి బాధేలేదు. ఎప్పుడన్నా నా బలవంతంమీద మజ్జిగ తీసుకునేవాడు. కాని ఈయన కూడా నా రూల్సులో అతిముఖ్యమైనదాన్ని అతిక్రమించాడు. కానీ దానివల్ల నాకు మరింత చేరువే అయ్యాడు.

నాకున్న నియమాల్లో అప్పు అడగకపోవడం, ఇవ్వకపోవడం ముఖ్యమైనది. ఎన్నో సుఖాలు కాదనుకుని అవసరాలను కూడా మానుకుని పైసా పైసా కూడబెట్టి దాచుకున్న డబ్బు చాలా సులభంగా అప్పు తీసుకునేవాళ్ళంటే భరించలేని కోపం నాకు. అలాగే నేను అడిగే పరిస్థితి నాకు రాకూడదనే పట్టుదల నాకు.

అటువంటి నన్ను రామేశంగారు భార్యను హాస్పిటల్‌లో చూపించాలని నాలుగు వందల అప్పు అడిగాడు. నేను ఇరకాటాన పడ్డాను.

"మీరు సందేహించద్దు బాబుగారూ! మీ పరిచయాన్ని ఉపయోగించుకుంటున్నాననుకోకండి. 26 గంటల్లో మీ డబ్బు పూవుల్లో పెట్టి తెచ్చి ఇస్తాను" అన్నాడు.



ఇది మామూలు మాటే... తప్పనిసరై ఇచ్చాను ఆయనను నాలుగు తిట్టుకుని.

మర్నాడు లేదు..మూడోనాడు ఆయన డబ్బు తీసుకుని వచ్చి ఇచ్చాడు ... ఖంగు తిన్నాను. ఆయన కొడుకులు పంపించారా?! ఆవిషయమే అడిగాను.

"లేదు బాబుగారూ ! ఋణమంటే భయం నాకు. పునర్జన్మల మీద నమ్మకమున్నవాణ్ణి. ఈ ఋణం నాకు జన్మబంధం నుంచి విముక్తినివ్వదు... తీసుకోండి"





అన్నారు.

నేను మాట్లాడలేదు. ఆ తరవాత చెస్ ఆడేటప్పుడు ఆయన వేలికి ఉండే బంగారు ఉంగరం లేకపోవడం చూశాను. అప్పుడే కాదు, మరెప్పుడూ కనబడలేదది. డబ్బెక్కడినించి వచ్చిందో నాకు అర్థమైంది. కానీ, నేనేం మాట్లాడలేదు.

ఇదుగో, మనకు నమ్మకమున్నా ఉండకపోయినా ఈ విధి, కర్మ, ఋణం, ఇవన్నీ నమ్మేవాళ్లతో మనకు బోలెడు సుఖం. మనకు సేవచేసి 'కృష్ణార్పణం' అనుకుంటారు. వాళ్లకు మనమేమైనా చేస్తే ఋణవిముక్తి అని అణాపైసలతో లెఖ్ఖ తేల్చేస్తారు.

ఆనంద్

అల్లాంటి ఛాందసుడు రామేశంగారు. అందుకే ఆయనతో స్నేహం కుదిరింది నాకు.

"ఏమయ్యారు మీరు? ఇరవైరోజులుగా అయిపులేరు?" ఆటకట్టిస్తూ అన్నాడు.

"మా మే న కో డ లు ఒకి పిల్ల పోయిందండీ!"

"అయ్యో ఎంతపని జరిగింది? చెప్ప రేమండి మరి? ఎలా? ఎప్పుడు? మొన్నీ మధ్యే ఒక పిల్ల పెళ్ళి జరిగినట్లుంది. ఇప్పుడు...?"

"ఆ పిల్లేనండీ పోయింది"

"శివ శివా! ఎలా జరిగిందండీ?"

ఆయన గొంతులో ఖంగారు, ఆప్యా యతా- వాటిల్లో నిజాయితీ ఉన్నాయి.

మామూలు పరిస్థితులు, ఆ య న మరొక రకం వ్యక్తి అయితే డాక్టర్ సర్టి ఫికెట్స్, హార్ట్ అటాక్-ఇవీ చెప్పేవాణ్ణి. ఆ స్థితిలో ఎందుకో రామేశంగారితో అబద్ధం చెప్పలేకపోయాను. పైగా, ఆయన స్కాండల్ మాంగర్ కాదు. నిజాయితీపరుడు.

మెల్లిగా అక్షరం, అక్షరం ఆలోచించి చెప్పాను జరిగిన విషయం.

"అయ్యో పాపం! పిచ్చిపిల్ల. బతక లేక చచ్చిపోయి వుంటుంది బాబు గారూ!"

ఒళ్ళు మండింది నాకు. ఎవర్ని చూసినా అదేమాట. బతకలేకపోవడ మేమిటసలు నాన్సెన్స్! షుభ్రమైన తల్లీ తండ్రీ, బోలెడంత ఆస్తి, స్థితిపరుడు- హోదాగల మొగుడు, ఏది కావాలంటే అది తెచ్చిపెట్టే మనుషులు – ఏంగాదని చచ్చిపోవడానికి! ఏం తక్కువైందని?! అదే ఛడామడా బైటికి అనేశాను రామేశంగారితో.

"బాబుగారూ! మీ దృష్టిలో అత్యంత విలువైనవి ఆ అమ్మాయికి లెఖ్ఖలో లేనివి కావచ్చు. ఇన్ని లౌకిక సుఖాలను వదులు కుని చచ్చిపోయిందంటే, ఆ బిడ్డ ఎంత బాధపడిపోయిందో? పసిపిల్ల అయినా చాలా తెలిసింది అయిఉంటుంది"

నాకు మళ్ళీ కోపం వచ్చింది. పసి పిల్లట... చాలా తెలిసిందై ఉంటుందట. లక్ష్మణ్ అదేమాట, ఏమీ తెలియని ఈ పిలక శాస్త్రుల్లు అదేమాట. నా మేనకో డలు సుఖంగా కాలేజీకి వెళుతూ హాయిగా చదువుకుంటున్న పిల్లకు అనవసరమైన గొప్పతనాలు, లేనిపోని త్యాగాలు ఆపా దిస్తారేమిటి?

"ఏమీకాదు! ఒళ్ళు పొగరుతో చచ్చి పోయుంటుంది" కసిగా అన్నాను.

"బాబుగారూ!" కుర్చీ ఒక్కసారి తోసి ని ల బ డు తూ అన్నారాయన. ఆయన మొహంలో అంతకోపం ఈ నా రెండేళ్ళ పరిచయంలోనూ చూడలేదు.

"ఏం మాట్లాడుతున్నారు మీరు? ఆత్మగౌరవానికి దెబ్బ తగిలినప్పుడు ప్రతి ఒక్కటి గరికపోచకన్నా విలువలేనిదిగా కనబడుతుంది. నీకు తెలుసా బాబు గారూ...అట్లాంటి పరిస్థితిలో మనం ఏం చేస్తున్నామో మరొకరికి అర్థంకాదు. నేనె వర్నో తెలుసా?ఒకప్పుడు ఐ.ఎ.ఎస్. ఆఫీ సర్ని. కేవలం ఒక కేంద్రమంత్రితో వచ్చిన తగవుతో ఆ క్షణాన రిజైన్ చేసే శాను. కారణం ? నన్ను ఒక నేరానికి సాక్ష్యాధారం లేకుండా చెయ్యడం కోసరం ఫైలు మాయించెయ్యమన్నారు. అది భయంకరమైన నేరం. దేశపు ఆర్థిక, నైతిక వ్యవస్థలనే కూల్చివేసే నేరం. నేను ఉద్యోగం చేసే నా గవర్నమెంటు అనే యంత్రాంగంలో ఒక ముఖ్యమైన




తుప్పు మేకు మూలంగా దేశమే, దేశ క్షేమమే కదిలిపోవడం భరించలేని నేను ఆయన నేరం బైటపెట్టి రిజైన్ ఇచ్చాను. నా జీతం ఆ కాలంలోనే రెండు వేలు. ఈ మీ లెక్కల ప్రకారం 6—7 వేల జీతం ఉండి ఉద్యోగం చేసుకుని ఉండచ్చు. కానీ ఎదురు తిరిగానని ఆ మంత్రిగారు నన్ను నానా బాధలు పెడ్తాడనీ తెలుసు. నా దేశం కోసరం ఎదురు తిరిగిన నన్ను ప్రభుత్వానికి ద్రోహం చేసినవాడిగా జమకట్టింది ప్రభుత్వం. ఆశ్చర్యం కదూ? అందుకే స్వతంత్రుడిగా వచ్చేశాను. ఆ తరవాత నేను పడ్డ ఆర్థిక న్యూనత మీకు తెలియదు. అయినా ఎంత దుఃఖంలోనూ, కష్టంలోనూ కూడా నేను చేసిన పని తప్పని నా కంఠం మీద కత్తి పెట్టినా ఒప్పుకోను. నా ఆత్మగౌరవం ముందు ఆ ఉద్యోగం తృణప్రాయం"

కాలరుద్రుడిలా ఉన్నాడాయన. కళ్ళు ఎర్రబడిపోయినాయి. అవాక్కైపోయాను నేను. ఏం మనిషి ఈయన? ఏనాడూ ఈ విషయం చెప్పలేదు నాకు. ఆయన చదువు ముందు, హోదాముందు నేనెంత! నా కళ్ళల్లో భీతి, ఆశ్చర్యం ఆయన గమనించినట్లున్నారు - కొంచెం చల్లబడ్డారు.

"కాబట్టి బాబుగారూ....సులభంగా మాటలు అనెయ్యకండి. అడ్జెస్ట్అయిపోయి ఉండచ్చు, గాడెక్కి ఎదురు తిరుగుతారు- లాంటి మాటలన్నీ ఒడ్డున ఉన్నవాళ్ళ నేవి"

నేనేం మాట్లాడలేకపోయాను. ఏనాడూ నేను పరిశీలించినంత మేరలో ఉమలో ఆత్మగౌరవం బైటపడడం చూడలేదు. ఇంకా రమ కాస్త కజ్జాకోరుది. అనుకున్నవి అయ్యేదాకా నిద్రపోయేది కాదు. కానీ మరి ఉమ చేసింది ఈ పని?

ఛెస్‌బోర్డునే తీక్షణంగా చూస్తున్నారు. రామేశంగారు.

"ఇవ్వాల్టికి ఎన్నో రోజు?"

"పదహారు"

ఏదో లెక్కలు కట్టారు.

"అమ్మాయి పోయిన తిథి?" మళ్ళీ ఆయనే లెఖ్ఖకట్టారు. ఆలోచించారు. వేళ్లు చాపారు. ముడిచారు. నేను ఆశ్చర్యంగా చూస్తున్నాను. ఏమిటీ మనిషి?

"జాతకరీత్యా అమ్మాయికి మారకం రోజులే బాబూ! కాస్త ముందుగా ఈ జాతకం తెలిసినా ఈ ప్రయత్నం తప్పించగలిగే వాళ్ళమేమో! కానీ? విధి!" రెండు చేతులూ కట్టుకుని, కళ్ళజోడు నుంచి సూటిగా చూస్తూ అన్నారు ఆయన.

నాకు మతిపోయింది. ఏమిటి ఈయన ఉద్దేశ్యం? మృత్యువుని తప్పిద్దామనా? అసలు ఆమాటేమిటి? కొంపదీసి ఈయన పిచ్చివాడు కాదుకదా? ఏముందీ! ఇంట లెక్చువల్ కెపాసిటీలు, పనికిరాని పరిజ్ఞానాలు ఎక్కువైనా పిచ్చివాళ్ళే అవుతారు.వాళ్ళకు వాళ్లు ఉపయోగించరు. మరొకరికి బాధకలిగిస్తారు. కానీ కాసేపు ఈ అహంభావితో ఆడుకోవాలనిపించింది.

"ఏం చేసేవారు రామేశంగారూ ముందుగా తెలుస్తే?"

మెల్లిగా తలెత్తి సూటిగా చూశారు ఆయన.

"ఈ మృత్యుఘడియలు తప్పించ గలిగే వాళ్ళమేమో! అంతా ఆ తల్లి దయవుంటే...ఆ తరవాత పద్దెనిమిదేళ్ళ ధోకా లేకుండా బతికేది"

నాకు అరికాలు మంట నెత్తికి వచ్చింది.

"ఎలా?" కోపం అణుచుకుంటూ

వ్యంగ్యంగా అడిగాను.

"ఎలా అంటే... ఆ ఆ సమయాల్లో సరిగ్గా లేని గ్రహాలకు శాంతి చేసి దేవిని ప్రసన్నురాలిని చేసుకుని ఆ కృపతో ఆపగలిగే వాళ్ళమేమో కానీ కాలేదుగా..." ఆ గొంతులో నిస్పృహ.

సందేహంలేదు... ఈయనకు పిచ్చన్నా ఉండాలి లేదా నేను పిచ్చి వెధవలాగా కనబడన్నా ఉండాలి.

అయినా నేను వదలదలుచుకోలేదు.

"బాబుగారూ! గ్రహాలు అవీ ఆకాశంలో రూపం దాల్చి, పీఠం వేసుకుని కూర్చుని ఏదీ...ఈ మనుషులిచ్చే తర్పణం కోసరం, నైవేద్యాలకోసరం ఎదురుచూస్తూ ఉంటాయంటారు. పోనీ, కాసేపు అదీ నిజమేననుకుందాము. కానీ ఒక్కొక్క గ్రహం ఒక్కొక్క మనిషి పన్లే చూస్తూ ఉంటే, మిగతా జనాభా గతి ఏమిటిట?! అది సరే... ఒక్క ఇండియాకేనా ఈ నమ్మకాల పీడ?! ప్రపంచంలో ఇవన్నీ ఏమాత్రం నమ్మని గాంగు శుభ్రంగా బతికేస్తున్నారే? వాళ్లను ఈ గ్రహాలేం చెయ్యవా? బావుంది మీరు చెప్పేది. సమయం వచ్చింది చచ్చిపోయింది. ఎటోచ్చీ బలవంతంగా పోయింది. అదే కాస్త బాధ... అంతేకానీ, మృత్యువునే మీరు ఆపగలిగితే బాబుగారూ మీ ఇల్లు తిరణాల అయ్యేది. ప్రపంచంలో చావు తప్పించుకుందామనుకోనివాడు లేడు. ఈ పిచ్చి మాటలు నాకు చెప్తే చెప్పారు కానీ, ఇంకెవరి దగ్గరా అనకండి" నిర్మొహమాటంగా నాకు అనాలనిపించిన నాలుగూ అన్నాను. నాకేం భయం...? అంతగా అయితే రేపటినించీ రాడు ఆయన. అంతే !





కానీ ఆయన ఈ మాటలకు బాధ పడినట్లు లేరు. నావంకే చూస్తున్నారు. ఆ కళ్లలో భావం చూడగానే నాకు మరీ మండిపోయింది. ఏదో కుర్రకుంకను అల్లరి తల్లి సహించినట్లు, పెద్ద హైనా ఉడతపిల్లను చూసినట్లు చూస్తున్నారు. నాకు చిర్రెత్తినట్లైంది. ఏదో అనబోయే టంతలో–

"శంకరంగారూ! మీరు నాస్తికులా?" మెల్లిగా అడిగారు.

"అంటే?"

"దైవశక్తి నాస్తి అనుకుంటున్నారా?"

మాట్లాడలేదు నేను. ఏమనాలి? అప్పుడప్పుడు తిరుపతి అదీ వెళ్లొస్తూంటాను. శనివారం ఒకపూట ఉపోషం ఉంటాను. మా ఆవిడ బతుకున్న రోజుల్లో సత్యనారాయణ వ్రతం అదీ చేసేవాళ్లం. ఇప్పుడు అప్పుడప్పుడు దేముడి గొడుగులనీ, అయ్యప్ప భజనలనీ ఏదో వచ్చినప్పుడల్లా ఐదో, పదో దానం చేస్తూనే ఉంటాను.

ఈ ప్రశ్న నన్ను ఇంత ఇరకాటాన పడేస్తుందనుకోలేదు నేను. నన్ను నేను ఎప్పుడూ ఈ ప్రశ్న వేసుకోలేదు.

"చెప్పండీ?" ఆయన గొంతు ఖంగుమంది.

"కాదు... అవును. రెండూను"

"అంటే?"

"అంటే నేను ఏదో శక్తి ఉందని నమ్ముతాను. అంతేకానీ..."

"అంతేకానీ?"

"దాని చేతుల్లోనే అంతా ఉందని అనుకోను. దానికి ఒక ఊహ కల్పించి మనం మన ఊహగా చూసి, మరొకడూ మరొకటిగా చూసి, పైత్యంలో పడి... ఇవన్నీ నేను నమ్మను"

"మరి అది మనశ్శక్తే. దైవం ఎందుకు

మధ్యన" మెల్లిగా అడిగారు.

నిజమే! ఎందుకు? నేను ఆలోచిస్తే బలహీనమైపోతానని,

"అన్నీ మన చేతుల్లో ఉన్నాయను కోను నేను. కొన్ని కొన్ని సమయాల్లో మన ప్రయత్నాలు వ్యర్థమవుతాయి. అప్పుడు విధి ఒకటి ఉందనిపిస్తుంది"

"అదిసరే,మరి అది విధి అయినప్పుడు ఇంక దాన్ని గురించి ఆలోచించంగా. అది మార్చటానికి ప్రయత్నం కూడా చెయ్యం. అప్పుడు ఈ నమ్మకాలు, మొక్కుబళ్లు, జాతర్లు—ఇవన్నీ అజ్ఞానుల వంతుగానీ మనకెందుకుట"రామేశంగారు నవ్వు దాచుకుంటూ అన్నారు.

నాకు మండింది.

"అలాకాదు... నా చేతుల్లో లేదు ఈ పని, విధికి లొంగుతున్నాను అనిపించి నప్పుడు దేముడు జ్ఞాపకానికి వస్తాడు. ఏదో మొక్కుకుంటాము. అహ...మొక్కు కున్నంత మాత్రం చేత అవుతుందనీ, ఈ రాతిబొమ్మలు వింటాయనీ కాదు. అవొక ఆత్మస్థయిర్యం ఇస్తుంది. దానితో మనకు కొత్త ధైర్యం వస్తుంది. మన పని సులు వవుతుంది ఇంతకన్న దేముడి గురించి కన్సెప్షన్ ఇంకేం లేదు" తేల్చిపారేస్తూ అన్నాను.

అమ్మయ్య. ఇలా చెప్పగలగడం వల్ల నా ప్రాణం ఎంతో హాయిగా ఉంది. అయినా కొన్ని కొన్ని ప్రశ్నలు మనని మనం ప్రశ్నించుకోం ఎప్పుడూ. ఆచ రిస్తాం. అర్థం ఆలోచించం. వాచీ ఎడంచేతికే ఎందుకు పెట్టుకోవాలి? అన్నం కుడి చేత్తోనే ఎందుకు తినాలి? ఇవన్నీ ఎలాగో దేముడిని ఎందుకు నమ్మాలి అన్న ప్రశ్న కూడా నా వరకూ అంతే మరి.

''కాబట్టి మన చేతుల్లో విషయం లేదని ఒకటి ఒప్పుకున్నారు. మీరు మాట్లాడే విధిని దారి మార్చగల దైవం లేదా నమ్మకం ఒకటుందన్నారు. అంత వరకు నిజమేనా?!"

''నేను దైవం ఉన్నాడనడం లేదు. ఆ ఆలోచన నాకు ధైర్యాన్నిస్తుందంటు న్నాను." మొండిగా అన్నాను.

''అంటే లేనిది ఉందని ఆత్మవంచన చేసుకుంటున్నారన్నమాట. మరి ఈ రాముడి ఫొటో, ఈ హనుమంతుడి ఫొటో—ఇవన్నీ ఏమిటిట?"

అటు చూశాను. నిజమే. రాముడి ఫొటో ఇంట్లో ఉంటే శాంతి అని మా ఆవిడ ఉంచిందది. ఆవిడ పోయిన తరవాత కూడా అలాగే ఉంచేశాను. అదెందుకందో ఆమాట?! హనుమంతుడి పటం అంటారూ...? ఒంటరిగా ఉంటాను. ఏదో గాలి, ధూళీ ఇవన్నీ రాకుండా వాయుపుత్రుడు కాపాడతాడంటారుగా. అందుకని రాముడి బొమ్మ దగ్గర హను మంతుడున్నాడనుకోండి. అయినా విడిగా ఉంటే కొంచెం పవర్ ఎక్కువ ఉంటుందని... కానీ ఈ మాటలన్నీ బైటకు అంటే ఈ రామేశంగారు ఆత్మ వంచన అంటారు. ఎలా?

''తీసెయ్యండి ఆ ఫొటోలు. పోనీ నేను తీసెయ్యనా ?" గభాల్న లేస్తూ అన్నారు.

"అయ్యో వద్దండి....అవి ఇప్పటివి కావు" గబుక్కున లేస్తూ అన్నాను. ఈ ముసలాడు అసలే తిక్కమనిషికూడా.

"ఏమిటండీ ఆ ఖంగారు! ఆఫ్టరాల్ అవి కాలెండర్ బొమ్మలండీ. మీరు ఫ్రేం కట్టించారు కాబట్టి పటాలయ్యాయి. మూడు రూపాయలు పెడితే మళ్లీ దొరుకుతాయి..." లేస్తూ అన్నారు.

"అది కాదు...అది నేను రోజూ ణ్ణం పెట్టుకునేది...."

"అంటే...దేనికి దణ్ణం? ఈ కాలెం దరుకా? పోయిన సంవత్సరం ఈ బొమ్మలు వేసిన కంపెనీవాళ్లు, ఈ సంవత్సరం అర్ధనగ్న సుందరిని వేశారు. కాబట్టి ఆర్టిస్టులోనో, కాలండర్ లోనో దేముడు లేడు. మరి మీ పూజ ఎవరికట?"

"నాకు నమ్మకమున్న అజ్ఞాత శక్తికి!"

"అంటే! అదివచ్చి ఈ కాలెండర్లో కూర్చుంటుందా?"

"నా వరకు అంతే" మొండిగా అన్నాను.

"దానికేం పనిలేదా? ప్రపంచం మొత్తం వదలి మీ కాలెండర్లో కూర్చుని మిమ్మల్ని రక్షించడమేనా?"

"ఏమో! నాకు మొక్కుకుని వెళితే అనుకున్న పని అవుతుంది. అంతే!"

"ఓహో! అంటే మీ దృష్టి ప్రకారం సృష్టిశక్తో, అజ్ఞాత శక్తో ఏదో ఎంత చీపంటే—మీ మాటలు విని, మీ కోరికలు అవి ఎట్లాంటివైనా సరే తీర్చి మీ కొబ్బరి కాయలు, మొక్కుబడులు ఆస్వాదించి, మిమ్మల్ని రక్షించి, మీ వెనుకాలే వచ్చి మీ పనులు చేసి పెడుతున్నదన్న మాట. ఇదేనా భగవంతుడంటే మీ కన్సెప్షన్?!" ఆయన మాటలు మంచు కత్తి ఝళిపిస్తున్నట్లున్నాయి.

"అలా అంటే ఏమో కానీ..." అయోమయంలో పడుతూ అన్నాను నేను. మా బామ్మగారు చిన్నప్పుడు ఊరు వెళ్లి వస్తే చాలు-దాసులు కొద్దీ వండి నైవేద్యం చేసేది. ఎందుకంటే, తనంత శ్రద్ధగా ఎవరూ పెట్టకపోవడం వల్ల దేముడు పస్తుపడున్నాడట. ఇలా తింటూ పోతే పాపం ఆ దేముడి గతి ?! నవ్వొస్తుంది నిజమే. కానీ, నేను చేస్తున్నపని మాత్రం?!

"మీకన్న నాస్తికులు కోట్లరెట్లు నయం శంకరంగారూ! వారి సంఘర్షణలో, పట్టుదల్లో మూర్ఖత్వాన్ని ఎదిరించి మూఢనమ్మకాలను ఎదుర్కొనే ప్రయత్నంలో నాకు సర్వేశ్వరుడు కనబడతాడు. మీరేం చేస్తున్నారో, ఎందుకు నమ్ముతున్నారో మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోకుండా, సనాతనత్వం కింద తల దాల్చుకుని దణ్ణంపెట్టి యాచించుకోవడం పక్కపొడి తిన్నంత సులభంగా అలవాటు చేసుకున్న మీకన్న వాళ్లంటేనే ముచ్చట నాకు. నాకు తెలిసిన భగవంతుడు తప్పకుండా ఇక్కడలేడు. వాళ్ల ప్రయత్నాలలోనూ, అన్వేషణలోనూ, తెలుసుకునే జ్ఞానంలోనూ ఉన్నాయి" ఆయన గొంతులో ఆవేశం పదునుతేలింది.

నాకు అంతా అయోమయం అయిపోయింది.ఏమిటిదంతా ? ఈయనేమిటి? ఈయన వాదనేమిటి ? ఎటు ఈడుస్తున్నాడు నన్ను? అయినా, ఉమ గోలంతా వదిలి ఇదేమిటి?

"అరిషడ్వర్గాలను అరికట్టుకోడానికి, పాపాన్ని పెరగనీయకుండా ఉండటానికి, సాధించేపని మీద ఏకాగ్రత కుదరడానికి, నీలో కొంత ప్రక్షాళన కలగడానికి ఏర్పడినవి ఈ ముడుపులు, జాతర్లు, నియమాలు. ఒకసారి సర్వేశ్వరాన్వేషణలో పడ్డవ్యక్తి ఒకొక్క బంధాన్నే ఛేదించుకుంటూ పైమెట్టుకు రావడానికి ఏర్పడినవి ఈ శమదమ నియమాదులు. అంతే కానీ, ఏదో ఎగ్జిబిషన్ చూసొచ్చినట్లు

 

దేవాలయానికి వెళ్లి రావడం, ఏ అయ్యప్ప దర్శనానికో నలభైరోజులు నియమంగా ఉండి వెళ్లివచ్చి విస్కీ బాటిల్స్ ఓపెన్ చెయ్యడం, తద్వారా ఇన్ని ఔన్సుల పుణ్యం మూటకట్టుకున్నామనుకుని ఆత్మ వంచన చేసుకోవడం – ఇదంతా ఏమిటంటే... భగవద్గీత తలకింద పెట్టుకుని నిద్రపోయి మోక్షాన్ని కోరుకోడం లాంటిది. ఇదంతా అహం సంతృప్తి పడటానికి. అంతే"

"ఇంతకీ ఏమంటారు మీరు?" నాకు మాడున కపీకపిల్లని నూనె అంటినట్లుంది.

"నేనేమంటాను అన్నదికాదు ముఖ్యం నేనెప్పుడూ ఒకటే అంటాను. మీరేమంటారు అన్నది ముఖ్యం. ఆలోచించుకోండి బాగా. ఆలోచిస్తే–మీరు ఆచరించే ఆచారాలు, మీరు మొక్కుకునే మొక్కుబళ్లు, మీరెక్కుమాలిన ఊహల్లో రూపొందించే భయంకర మూర్తి – ఇవన్నీ మీకే అర్థమౌతాయి. వస్తాను. టైంఅయింది" మెల్లిగా లేచి పై ఉత్తరీయం దులుపుకుని వెళ్ళిపోయారు ఆయన. అటే చూస్తూ కూర్చున్నాను నేను.




ఆ తరువాత వారం పదిరోజులు నేను ఆలోచిస్తూనే గడిపాను. నాకు ఏదో తెలిసీ తెలియని స్థితి. రామేశంగారు మొత్తానికి నాలో ఏవో మూసివున్న తలుపును బలవంతంగా తోసి తెరిచి వెళ్ళిపోయారు.

ఒక మధ్యాహ్నం ఎవరో తలుపు కొడుతున్నారు. నాకు తెలియకుండానే అంతర్గతంగా రామేశంగారి రాక కోరుకుంటున్నాను. అందుకే గభాలున లేచి తలుపు తీశాను.

ఉప్పెనగాలిలా ఒకామె, ఆమె వెనక ఎవరో వ్యక్తి లోపలికి వచ్చారు.

ఆమె చేతిలో ఉమ ఫొటో ముఖపత్రంగా ఉన్న 'ఈతరం' తెలుగు వీక్లీ ఉంది.

ఆవిడే చొరవగా లోపలికి వచ్చి కుర్చీలో కూర్చుని పరిచయాలు ప్రారంభించేసింది.

అతను 'ఈతరం' పత్రిక సంపాదకుడు. పేరెన్నికగన్న రచయిత, జర్నలిస్ట్... పేరు రాఘవట. ఆమె శ్రీమతి సుధా రాఘవ. మాట్లాడ్డానికి ఏం లేనట్లు అతను పొడిపొడిగా మాట్లాడుతున్నాడు.

కానీ ఆమెమాత్రం చాలా గట్టిది.

నమస్కారాలు, పరిచయాలు అవగానే ఆవిడ అసలువిషయానికివచ్చేసింది.

ఉమ కథలను, కవితలను ఎక్కువగా ఎంకరేజ్ చేసేది అతని పత్రికేనట. ఆమె కథలకు ఎక్కువగా బొమ్మలు అవీ వేసిన ఆర్టిస్టు విరించిట. అతను, రాఘవ ప్రాణస్నేహితులు. ఇంతవరకు బాగానే ఉంది. కానీ ఉమ చనిపోయిన పదిహేనురోజుల తరవాత ఉమ రాసిన ఆఖరి ఉత్తరం... అదీ విరించికి రాసింది తీసుకుని అతను రాఘవ దగ్గరకు వచ్చాడట.

"ఏమిటీ? ఉమకు, అతనికి కొంపదీసి ప్రేమైనా...?" అడగలేక అడిగాను ఆ



ప్రశ్న.

"అలా అయినా బావుండిపోను. వాళ్ళిద్దరు కలిసి ఏమయ్యేవారో... బ్రహ్మచారి...అతనిదేముంది? అదికాదు విషయం" గబగబా అంది ఆమె.

"మరి?" అనుమానంగా అడిగాను.

కాస్సేపు మాట్లాడలేదామె. ఏదో చెప్పలేకపోతోంది. నేను రాఘవ వంక



చూశాను. అతను చటుక్కున లేచి వెళ్ళి కిటికీ దగ్గర నిలబడి బైటకు చూడటం మొదలుపెట్టాడు.

నాకు ఒళ్లు మండింది. ఇదుగో ఈ భావుకుల ముఠా అంటే నాకందుకే కోపం. విషయం ఎంత పెద్దది? చర్చ ఏమిటో ఇంకా తెలియదు. ఎదటివాళ్ళ భావాలు వాళ్ళకనవసరం-వాళ్ళ భావుకత బాధ తప్ప. ఆ కిటికీలోంచి ఏమీ కన బడదు-ఎండిపోయిన చెట్టు, మబ్బులేని ఆకాశం తప్ప. అయినా అతన్నేమీ అనే పరిస్థితికాదు కాబట్టి.

"మీరు చెప్పండి రాఘవా.." నేనింకా మాట పూర్తిచెయ్యనేలేదు.

"నేనే చెబుదామనుకుంటున్నాను శంకరంగారూ! ఆ ఉత్తరాన్నిబట్టి..."

"ఊ...!"

"ఆమె నన్ను గాఢంగా ప్రేమించారనీ, నన్ను దూరంచేసుకుని బతకలేక చనిపోయారనీ పిల్లు అర్థంచేసుకుని రభస చేస్తున్నారు"

ఒక్క క్షణం నాకు నోట మాట రాలేదు.

ఏమిటీ కొత్త ట్విస్ట్? అతనివంక పరీక్షగా చూశాను. ఈ ముప్పావుగంటనించీ అతను నాకు సుధారాఘవగారి భర్తగా దర్శనమిస్తున్నాడేకానీ ఒక ప్రత్యేక వ్యక్తిగా, అందులో మా ఉమ ప్రేమించదగ్గ వ్యక్తిగా కనిపించడంలేదు. అయినా ఈ ప్రేమ అనేది పైత్యప్రకోపం లాంటిది. దానికి అర్థంలేదు. సరే... ఈ గందరగోళమేమిటసలు?

"మీకు, ఉమకు అంత పరిచయం ఉందా?" సూటిగా అడిగాను తేరుకుని.

అతను ఏదో మాట్లాడబోయాడు.

"ఆ విషయం నేను మొదటే అడిగానండీ. ఆయన ఒక ఎడిటర్. ఆమె పత్రికకు వచ్చి కథలూ అవీ ఇచ్చేవారట. అప్పుడప్పుడు ఏదో రచయితల మీటింగ్స్‌లో కలుసుకునేవారట. సహజంగా పరిచయమవుతుందికదా! పైగా ఆవిడ కథలు, భావాలు అవీ బావుంటాయని ఈయన మెచ్చుకుని ఎంకరేజ్ చేసేవారట. పత్రికలవాళ్ళకు సహజమేనండీ మాత్రం చేత ఆ పిల్ల ఇలా పైత్యాన పడితే ఎలా?" ఓరగా అతణ్ణే చూస్తూ అంది ఆమె.

అతని వంక చూశాను. జవాబు చెప్పే స్థితిలో లేడు.

ఉమ ఇంత బలహీనురాలా? ఇదే నిజమైతే, ఈ కాలం పిల్లలకు చదువు గట్రా ఇవన్నీ మాన్పించి అంట్లు తోమించడం రైటు. పనిమనిషి ఖర్చన్నా తప్పుతుంది. సుధారాఘవగారి చెప్పు చేతల్లో ఉన్నట్లు కనబడుతున్న ఈ వ్యక్తిని ప్రేమించి ఉమ అంత డ్రమటిక్‌గా ఆత్మహత్య చేసుకున్నదంటే, నాకు ఒక్కసారిగా ఆడజాతి మీదే సానుభూతి పోయింది. పైగా అతను తెలియదు మొర్రో అంటుంటే.

"అసలు ఈ విరించి ఎవరు?"

"ఈయనా, అతనూ ప్రాణ స్నేహితులు లెండి. ఇదుగో ఈయనకు ఆఫీసు, ఆ తరువాత అతని గది – ఇవ్వే జీవితం. మా ఆయనే అతనికి ఉద్యోగం ఇప్పించింది కూడా! కూరలు తేవాలన్నా, సరుకులు తేవాలన్నా అదుగో అతను తోడు. ఆ పెద్దమనిషి నిన్న సాయంత్రం మా ఇంటికి వచ్చి 'నువ్వే కారణం ఆమె చావుకు' అంటూ ఈ ఉత్తరం చూపిస్తే ఏమనాలి చెప్పండి?"

కొంగుతో విసుకుంటూ అంది సుధారాఘవ. ఆమెది కొంచెం స్థూలకాయ మేమో ఫాన్‌గాలి సరిపోవటం లేదు.

హతోస్మి. మరీ పెళ్లాం మాటలు విని కూరల సంచీ మడిచి, సరుకులూ అవీ మోసుకొచ్చే మనిషిని సుకుమారంగా, నాజూగ్గా అమెరికాన్ జార్జెట్టు చీరలు అవీ కట్టుకుని ఉండే మా ఉమ ప్రేమించిందా?

ఏం...ప్రేమికుడు కూరలు తేకూడదని ఉందా? తెలుగు సినిమా హీరోలా చొక్కా నలక్కుండా కూలీ చేసినట్లు కనబడాలని ఉందా? అతనికి మాత్రం ఆకలి, అవసరాలు ఉండవా? నా మనస్సు ఎదురు తిరిగింది.

ఏదైనా ఈ ప్రేమ గురించి నాకు తెలియదు. ఇంక ఇప్పుడు తెలుసుకోవాలని కూడా లేదు.

"ఇప్పుడేమిటంటారు?" ఆలోచిస్తూ అడిగాను.

"అయిందేదో అయిపోయింది. మీ పిల్ల మీకు తిరిగి రానేరాదు. జరిగిన దానికి ఆమె మొండితనం తప్ప తగిన




కారణం కనిపించడం లేదు. ప్రేమించడానికి ఆవిడ ఇష్టమేనా? అయినా, ప్రేమించేటప్పుడు తెలియదా ఆయనకు పెళ్ళైందని?! మా పెళ్ళై పదిహేనేళ్లు బాబుగారూ... ఈ పత్రికలో ఉద్యోగం రాకముందు ఈ మనిషితోనూ, ఈయన ఊహాలోకాల్తోనూ నేను పడిన యాతన అంతా ఇంతా కాదు. ఊహలు అన్నం పెట్టవు కదండీ! మా పుట్టింటినించి డబ్బు తెప్పించుకుని ఇల్లు ఎంత గుట్టుగా గడిపానో ఆ పరాత్పరుడికి ఎరుక. ఏదో ఇప్పుడు కాస్త పచ్చగా ఉన్నాము. ఈ మనిషి కాస్త నిలకడగా ఉద్యోగం చేసుకుంటున్నారు. ఇప్పుడీ అనవసరమైన దుమారం రేగిందంటే ఈ కాస్త ఉద్యోగం కూడా..."

ఏదో చప్పుడైంది.

తలుపు సున్నితంగా మూసుకుంది. పత్రిక పట్టుకుని బైటకు అడుగుపెట్టాడు రాఘవ.

"ఎక్కడికి?" దీర్ఘంతీస్తూ అడిగింది.

"సిగరెట్టుకు" వెళ్లిపోయాడు.

మిగిలిన ఇద్దరం కొంచెంసేపు మాట్లాడుకోలేదు.

"ఊఁ! చెప్పండి..." అన్నాను నేను. ఇదేదో తేలిపోతే బావుండునని ఉంది నాకూ!

"అసలు మా ఆయనకు ఈ ప్రేమలూ వగైరాలు తెలుసని నేననుకోను. అందుకని ఇప్పుడు మళ్లీ ఈ విషయం తీగ లాగితే డొంక కదిలినట్లు బైటకు పొక్కకుండా ఉంటే మీకూ మంచిది, మాకూ మంచిది" తేల్చి చెప్పేసింది.

అంత టెన్షన్‌లోనూ నాకా మనిషిని ఏడిపించాలనిపించింది.

"అదేమిటండీ! ఆంధ్ర దేశం అంతా అలజడి కలిగించిన వార్త మీరూ, నేనూ కాదంటే ఆగుతుందా! బైటకు రాక తప్పదు"

కానీ ఆవిడేం భయపడలేదు.

"అందుకనే విరించిని పట్టుకుని ఆ ఉత్తరం తీసేసుకోండి. దానితో అకాస్త ఆధారం పోతుంది"

ఒక్కసారి ఆవిడను సూటిగా చూశాను - ఈ ఆడవాళ్లలో లౌక్యం ఎంత ఉంటుందా అని. ఈ మనిషికి సమాధానం చెప్పుకుంటూ, సంసారం చేస్తూ, సినిమాలకు తీసుకువెళ్తూ జీవితం గడపడం అంటే ఏ బిజినెస్‌లైన్‌లో ఉన్నవాడికో తీరుసు కానీ, భావనా జగత్తులో ఉండేవాళ్లకు బాధే పాపం. ఈవిడకూ బాధే ఒక రకంగా.

"నాకు విరించి తెలియదే!"

"సాయంత్రం మీ ఇంటికి వస్తాడట. అందుకే ఈ లోపల నేను ఈయనను తీసుకుని విషయం మీకు చెప్పిపోదామని వచ్చాను...వస్తాను"

"అదేమిటి? మీ ఆయన వచ్చేదాకా ఉండండి"

"ఆఁ! ఏ పార్కులోనో కూర్చుని కూర్చుని ఇంటికి వస్తారులెండి నేను వెళ్లొస్తాను...నమస్కారం..."

వెళ్లిపోయింది ఆవిడ. పెద్ద తుఫాను తేలిపోయినట్లైంది. గట్టిగా ఊపిరి పీల్చుకున్నాను.

ఆలోచిస్తూంటే, కొన్ని చిక్కుముడులు విడివడటం లేదు. నేనింకా ఒప్పుకోలేని విషయం ఏమిటంటే, ఉమకు, రాఘవకు మధ్య సున్నితమైన అనుబంధం ఏదో ఉందని. సానుభూతో, గౌరవమో అయితే వేరు. కానీ సలక్షణమైన జీవితాన్ని కాలదన్నుకుని, చచ్చి

పోయేటంత ఆవేశం తెచ్చిన ఆ బాధ పేరేమిటి? ఇదే ప్రేమా? ఇంత బాధపెట్టే ఆ దిక్కుమాలిన ప్రేమ ఎవ్వరికీ ఒద్దు గాక ఒద్దు. ప్రేమించడానికి కొంచెం అమాయకత్వం ఉండాలి. మనుషుల మీద నమ్మకముండాలి. అసలు మొదటి నించీ నాకు ఎదటివాళ్ల మీద నమ్మకం తక్కువ. అందుకని ఈ సబ్జెక్టు గురించి నేను మాట్లాడలేను.

ఏమైనా శ్రీమతి సుధారాఘవ చెప్పింది కొంచెం జాణతనంగా ఉన్నా నిజం. ఆవిడ సంసారం రట్టుకాకుండా ఆవిడ ప్రయత్నించడంలో తప్పులేదు. ఇప్పుడు ఈ అనవసరపు ప్రేమకథలు ఏమైనా బయటపడ్డా, అవి నాబోటివాడికి సిల్లీగా ఉన్నా, బంధు జనానికి విందు భోజనం. అందులో వాస్తవానికి ఒకటే రూపం–వూహకు బోలెడు రూపాలు....ఆమె చెప్పింది ఒప్పుకోక తప్పదు. అసలు ఆటువంటి భార్య లేకపోతే ఈ రాఘవ లాంటివాళ్లు ఏమౌతారు?

వెంటనే చెప్పులేసుకుని వెళ్లి దగ్గరున్న పుస్తకాల షాపులో రాఘవ రాసిన కథల సంపుటిలు, పాతపత్రికలు కొన్ని, నవల ఒకటి తీసుకు వచ్చాను.

సాయంత్రం వస్తానన్న విరించి రాలేదు. కానీ, ఆరాత్రి అఖరు ఝామురోపల రాఘవ నాకు చాలావిధాల అర్థమయ్యాడు. అతని కవిత్వంలో గుప్పెటతో గుండెను అదిమివేసే శక్తి ఏదోఉంది....

కవిత్వంవేరు – జీవితంవేరు అన్న వాళ్లెవరోకానీ, వాళ్లంటే నాకు చాలా ఇష్టం. కానీ, ఈ గందరగోళం వల్ల కవిత్వం రాసేవాడి జీవితం ఏమిటి అని ఆలోచించాల్సివచ్చింది.

రాఘవ కవిత్వంలో వేడి, బాధ చాలా ఉంది. అతని జీవితం, అతని కవిత్వం సమాంతర రేఖలు... ఒప్పుకోక తప్పదు ఇప్పుడు.

"ఇతని కవిత్వంలో సౌకుమార్యం, హృదయ తంత్రులను అతి సున్నితంగా మీటి ఆ శరశ్చంద్రికా స్నానాభినివేశాన్ని గొప్ప రేఖా చిత్రంగా మలుస్తుంది. ఆ సౌందర్య భావనా చిత్రంలో అక్షర లక్ష్మిని పట్టమహిషిగా నిలబెట్టిన ఈతను ధన్యుడు" అన్నారు ఒక పుస్తకపు ఆశీర్వచనంలో ఒక పేరెన్నికగన్న కవి.

సమకాలీకులు మెచ్చరు కవిత్వాన్ని అన్న కవి సాంప్రదాయంలో, ఒక మహాకవి తన వయసులో సహం వయసు లేనివాడికి ఇంతటి ఆశీర్వచనాసీస్సులు ఇచ్చాడంటే ఈ రచయితల జాతంతా చాలా ఉన్నతులైనవారై ఉండాలి.

మరి ఉమ సంగతేమిటి?! ఆ పిల్ల రాస్తుందని తెలుసు కానీ పాపం చదవమని నన్నేనాడూ బలవంతపెట్టి ఎరగదు. వెతుకుదామంటే పాత పత్రికలు కూడా లేవు ఇంట్లో.

* * *

ఆ సాయంత్రం వచ్చాడు విరించి. లేతగా, తమలపాకు తీగలా ఉన్నాడు. ఇంకా ప్రపంచపు దారుణాలు అతని జీవితం మీద ముద్రలు వేయలేదు కాబోలు గబగబా మాట్లాడుతున్నాడు. ఆలోచన కన్న ముందు దాన్ని మాటగా మార్చేద్దామని ప్రయత్నించే ఆవేశం ఉంది అతనికి. ప్రపంచంలో ఏమూలో మునిగిపోతూంటే తను తప్ప రక్షించే వాళ్లెవరూ లేరన్నంత స్పీడ్‌గా పరిగెత్తే లక్షణం ఉన్న మనిషి. అతడు తనను తాను పరిచయం చేసుకున్న పదినిమిషాలలో అతను అమాయకంగా కనబడు




తున్నా, అవసరం వచ్చినప్పుడు ఉద్రేకం, కోపం వచ్చినప్పుడు మధ్యాహ్న మార్తాండునిలా మారిపోతాడనిపించింది.

ఇతని చేతుల్లో ఉమ జీవిత రహస్య ముందంటే బాధ అనిపించింది నాకు.

"ఏమైనా సార్... ఈ విషయం ప్రపంచానికి తెలియవలసిందే. ఆ ఉత్తరం ఒక గొప్ప చరిత్ర సార్. దీనికోసరం నా జీవితం, నా కెరియర్ పణంగా ఒడ్డమన్నా ఒడ్డుతాను" అనవసరంగా చేతులు ఎక్కువ చాచి మాట్లాడుతాడు ఆవేశం వస్తే.

నవ్వొచ్చింది నాకు. ఆరిసీ అఘా యిత్యం. ఇరవైఏళ్ల నిండని ఇతనికి పణంగా ఒడ్డేందుకు ఏముందనో?! ఈ కళాకారులంతా తమ జీవితాలకు తాము చాలా ప్రాముఖ్యత ఇచ్చుకుంటారు పాపం.

"ఇంతకీ ఆ ఉత్తరం ఏది?" అతి మెల్లిగా అడిగాను.

"ఇదుగో సార్....తీసుకోండి"

"పన్లోపని మా ఉమ రాసినవేమన్నా ఉన్నాయా నీదగ్గర?"

"ఉన్నాయిసార్. ఇదిగో. నా దగ్గర ఆవిడ రాసిన కటింగ్స్ కొన్ని ఉన్నాయి. నేనొక రకంగా ఆవిడ ఫాన్‌ను సార్. మీరు చదువుతూ ఉండండి. నాకు పక్క స్ట్రీట్‌లో కొద్దిగా పనుంది. ఇప్పుడే వస్తాను. ఆ ఉత్తరం జాగ్రత్తండీ" సుడిగాలిలా బైటకు పోబోయాడు. నాకు నవ్వొచ్చింది...

"విరించీ!"

"ఏమిటి సార్?" గుమ్మం పట్టుకు వేలాడుతూ లోపలికి వంగి అడిగాడు.

"నేనెవరో తెలియదు. నామీద మాత్రం నీకు నమ్మకమేమిటి ఇది మాయం చెయ్యననీ?"

"ఎందుకు సార్? దానికి జిరాక్స్ కాపీలు తీయించి ఉంచాను. అయినా మీరు అలా చెయ్యరులెండిసార్. మీమీద నాకా నమ్మకముంది" వెళ్లిపోయాడు.

ఆరిసీ. అతను తెలివితక్కువవాడను కోవడం ఎంత అమాయకత్వం?! అయినా అతనిలో ద్వంద ప్రకృతి ఉన్నది. నా లాయర్ బుర్ర పనిచెయ్యడం ప్రారం భించింది.

మొదట ఆ ఉత్తరం విప్పగానే చెయ్యి ఒణికింది. ముందు సంబోధనా, తరవాత సంతకం చూశాను. ఆ తరవాత చదవడం ప్రారంభించాను.

డియర్ విరించీ!

ఈ ఉత్తరం నీకు చేరేటప్పటికి ఉమ లోకంలో ఉండదు.

స్వప్న ప్రపంచాల సౌగంధికాస్వా దనంలో ఉంటుంది. కలగా మిగిలిపోయిన నా అనుభూతులన్నీ తిరగబడిన దేవతల్లా నా ప్రాణాల్ని దిగంతాలవైపుకు తరుము తున్నాయి.

అసలు మృత్యువు అంటే ఏమిటి విరించీ! నీ జీవితం, అనుభవమూ కూడా చాలా చిన్నది. ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేదు. జీవి ఈదేహాన్ని వదిలి, అదృష్టవంతులైతే అమృతత్వంలోకి వెళ్ళి పోవడమే కదూ! మరి చావు ఏమిటంటావు? ఎందుకు ఏడుపు? ఈ చేదునిజాలు, బాధానుభవాలు ఈ కష్టైవి; స్వప్నసౌంద ర్యాలు, నిర్హేతుక జాయమానమాధు ర్యాలు ఆత్మవే అయితే, ఈ పీడ కల లాంటి శరీరాన్ని వదిలి నేను తప్పు చేస్తున్నానంటావా?! నాకు తెలుసు నువ్వు ఏడుస్తావు. కానీ అర్థం చేసుకోడానికి ప్రయత్నించు.

బతకలేక వెళ్ళిపోతున్నాను. విసుగే మృత్యువైతే నాకు ఇరవైఏడేళ్ళకే విసుగు వచ్చేసింది తమ్ముడూ. చాలు జీవితం అని పించింది. ఇది నైరాశ్యం విజృంభించి సరసరాలా పాకి, ఏ బలహీన క్షణాన్నో నా ప్రాణాల్ని లాక్కుపోతున్న అపస్మారక దశ కాదు. ఆలోచించి ఆలోచించి రాజీపడలేక, మిధ్యాప్రపంచికత కోసరం ఆత్మను తాకట్టుపెట్టుకుని జీవచ్ఛవంలా బతకలేక వెళ్ళిపోతున్నాను.

నువ్వు, నేను, రాఘవ.... మరి కొందరు...మనలా ప్రపంచాన్ని ఎదగలేని ఎత్తుల్లోకి హృదయాన్ని సంధించి ఆత్మావలోకనం చెయ్యగలిగిన వ్యక్తితో మనకొక సంబంధం ఏర్పడుతుంది. ఒక వేవ్‌లెన్త్‌లో ఆలోచించే ప్రతి వ్యక్తి మనకు ఆత్మబంధువే. ఈ స్నేహంలో నైత్యం, కోరిక, పతనం, పసితనం ఉండవు తమ్ముడూ... అనుభవమే ఉంటుంది. తద్వారా ఆనందముంటుంది. ఇది నా అనుభవమేకాదు — చాలామంది భావం కూడా.

నీకు తెలుసు 'రాఘవ' నాకే సొంతం కాలేదని... కాదని. హృదయం సంధించి విడిచిన బాణం గమ్యంచేరాలని రూలులేదు తమ్ముడూ. ఒక్కొక్కసారి లక్ష్యం తప్పుతుంది. అతను చెప్పక పోయినా అతని బాధానురాగాలకు ఆరాధ్య దేవతను నేనని, అతని సౌందర్యస్వప్నాల రంగవల్లులలో అధిష్టించిన అనురాగ దీపాన్ని నేనని అతని అక్షరాల్లో, అలంకారాల్లో, ఆవేదనలో అతను నాకు చెబుతూనే ఉన్నాడు.

కానీ అతన్ని పోగొట్టుకున్న దుఃఖంతో చచ్చిపోతున్నాననుకోకు. అంత అమాయకురాల్ని కాను. అతన్ని ఏనాడు పొందానని? అతని చేరువలో లేనని వెళ్ళిపోతున్నాననుకోకు—ఏనాడు దూరమయ్యానని?

ఈ చేరువలు, దూరాలు, పొందడాలు, పోగొట్టుకోవడాలు— అన్నీ ఒక పరిధిదాకనే. ఆ తరవాత అంతా శూన్యం. అందులో తేజస్సు... అది అణువణువు పునీతం చేస్తుంది తమ్ముడూ! కవిత్వాలకు, ఆనందాలకు, దుఃఖాలకు, విభిన్నత్వాలకు, సౌందర్యాలకు, స్వప్నాలకు అది పతాకానుభవం.

'ఎపుడో కల్పాంతాల క్రితం విడిపోయాం. అయినా క్షణం కూడా దూరంగాలేము. నిత్యం పరస్పరం ఎదురవుతూనే ఉన్నా ఏనాడూ కలువనే లేదు'

అనే సూక్తి ఎంత నిజం. అంతలో ఎంత ఊహ?

కానీ ఈ రాఘవ,ఈ ఉమ—వీటన్నింటి కన్నా అతీతమైన జగత్తు...ఈ నామ రూపాలు పరిధులు విధించలేని పునీతమైనది ఉన్నది తమ్ముడూ. అది తెలిస్తే ఈ లోకం, ఈ స్వార్థం, ఈ కచ్చ, ఈ కోపం, సంకెళ్లు, శిక్షలు చాలా అర్థం లేనివిగా ఉంటాయి.

రాఘవ వ్యక్తిగా నాకు మామూలు మనిషే కాని అతని ఊహ, కవిత్వం, ఆరాధన—ఇవే నాలో రాగరాగిణత్వాన్ని నిద్ర లేపాయి....

'చీకటి చిరుదారుల్లో, చుక్కల దీవుల్లో దిక్కుతోచని పయనంలో చిక్కుకున్న చిన్నారి మనసుకు అనుభవాల సంకెళ్ళు వేసి వాస్తవంలోకి లాగనా? అనుభూతుల ఆర్ద్ర పవనాలతో అవతలి ఒడ్డుకు పంపనా? ప్రపంచం నన్ను రమ్మంటోంది చెలీ, నీ ఊహ నన్ను




పొమ్మంటోంది' అని కాప్షన్ రాసి అతను పంపిన బర్త్‌డే కార్డు గుర్తుంది నాకు. నా మదిలో, హరిచందనాల పెట్టెలో, కర్పూర మాలలతో, పొగడ పూవుల జాడలతో దాచుకున్నాను తమ్ముడూ...అది నా జ్ఞాపకాల పేటిక.

అక్షరాలు, కాగితాలు – అవి మనుషులకు దొరికితే మాలిన్యాలు అంటగడతారు. అందుకే నా హృదయాంతరాళాల్లో కర్పూర సుమాల మధ్య దాచుకున్నాను.

కాబట్టి అతను వద్దు నాకు. అతని ఆత్మావలోకనంలో ఎప్పుడూ నేనుంటాను.

రాఘవలా లౌకిక ప్రపంచపు పరిధుల్లో మామూలుగా బతకడానికి నాకభ్యంతరం లేదు. ఒప్పుకున్నాను. ఆత్మకు, ఊహకు అందమైన అనుభూతి చాలు...కాని శరీరానికి కాదే?

ఏదో కొంత ఇవ్వగలిగితే కాని రవ్వంత పొందలేని లౌకిక ప్రపంచం ఇది.కానీ, నా కాలి పారాణి ఆరలేదింకా!

'నాకు ఈ ఆచారాలు, ఈ అలంకారాలు అంటే అసహ్యం' అన్నారు నా భర్త. అవును మరి. అతనుండేది నాగరికతల ఒయాసిస్సులో. అక్కడ గంగావతరణమేమిటి?

'కవిత్వమంటే అసహ్యం నాకు. వేదాంతమంటే మంట. జీవితాన్ని అనుభవించకుండా ముడుపుకట్టే ఈ ట్రెడిషన్స్ మారాలి' అంటూ విసిరి పుచ్చుకుని నా చేతిలోనుంచి రవీంద్రుడి కవిత్వాన్ని విసిరేశారు. చిరిగిపోయిన కాగితాలను, విరిగిపోయిన ఆలోచనలను దాచుకున్నాను.

సౌకుమార్యం, సౌందర్యం, భావుకత ఇవన్నీ ఆడపిల్లలో ఎంత ఉండాలో అంతే ఉండాలేమో! నా కన్నె జీవితపు మొదటి రాత్రి.. భౌతిక శరీరమనే వీణను శృతి చేయించకుండానే రుద్రవీణగా చేసి వాయించారు నా భర్త. బాధ చెప్పుకో గూడదు తమ్ముడూ! ఇది సంసారం.

ఆ నాలుగు రోజుల్లో నాకు నానా రకాల బహూమతులు కురిపించారు. నేనిస్తున్న దేనికో తవి పణంగా కనిపించా యేమో కానీ 'నావి' అనిపించలేదు.

అతడు ఉండే చోటున ఆడది పరదాల్లో ఉంటుంది. మొగవాడి భోగవస్తువు. తనువు తప్ప ఆత్మలే ఉండకూడని ఆ నిశ్శబ్ద ప్రపంచంలో, నిరూహతో, నిస్తేజంతో, నిద్రబుచ్చుతున్న మనసు నిద్రలేస్తుందేమోనన్న భయంతో అతనింటికి అలంకారంగా, అతని సుఖానికి శయ్యగా, అతని అలంకారానికి హరిచందనగా, అతని అనుభవాల గదిలో అగరువత్తిగా బతకాలట తమ్ముడూ .... అర్థమైంది జీవితం నాకు.

అతను కొన్న చీరలను, పెట్టిన నగలను, అతని కళ్ళల్లో మాదకతను 'ప్రేమ'గా అర్థం చేసుకున్న ఈ మనుషులకు నా పరిస్థితి అర్థం కాదు. దీనికి తోడు అతని పొసెసివ్‌నెస్ ఒకటి. అది ఆరాధనతో కూడినదైతే అద్భుతంగా ఉంటుందేమో కానీ, అధికారంతో వచ్చింది. నా అస్తిత్వం మీద అతనికి అపనమ్మకం. నామీద మరొకరి నీడను కూడా భరించలేడతను. అతను వినే సంగీతంలో మృగత్వం, అతని మనసులో అనుభవాల కోసం పరితపించే కాళ నాట్యం, అతని శారీరక అనుభవాలు, అతని గర్ల్ ఫ్రెండ్స్-అవన్నీ వింటున్న కొద్దీ నా శరీరం వణికింది తమ్ముడూ! మనస్సు కరిగి, చుక్కలు చుక్కలుగా కంటినించి వచ్చే నీరు కన్నీరు తమ్ముడూ... మనసే



కరిగితే దాని పేరేమిటి?

అతనితో జీవితం పంచుకోవడమే వరం అనుకునేవారు చాలా మంది ఉన్నారు. కానీ దానికి 'ఉమ' అక్కర్లేదు.

అతని ఊహల్లో తప్పలేదు. అనుభ వాలో తప్పలేదు. మా ఇద్దరి కలయిక లోనే ఉంది తప్పంతా. సుస్వరమైన రాగంలో కూడని అక్షరం కలిస్తే అప స్వరమౌతుంది. మహామంత్రానికి చేర, కూడని బీజాక్షరం కలిస్తే భయంకర మౌతుంది. అందుకే తప్పుకుంటున్నాను తమ్ముడూ! అతణ్ని ద్వేషించలేను. అందుకే దూరమౌతున్నాను.

అమ్మా నాన్నా ఈ నా నిష్క్రమణకు

తట్టుకోలేరు. వారికి కూతురుగా తప్ప, 'ఉమ'గా ఏనాడూ నేను తెలియను. అతని దగ్గర ఉండగా ఈ నా మృత్యువు సంభవిస్తే నింద అతని మీద పడుతుం దేమో!

అతనున్న అరబ్బు దేశానికి తీసుకు పోవడానికి మార్గ మధ్యంలో కలుసు కుంటానన్నారు నా భర్త. అందుకే కదులు తున్న ప్రకృతి అశాశ్వతమనుకుంటూ, నాతోపాటు వచ్చే చంద్రుడికి నా నిర్వేదం చెప్పుకుంటూ ఈ లౌకిక ప్రపంచం నుంచి శలవు తీసుకుంటున్నాను.

నా ఈ మృత్యువుకు కారణాలు వెతుకుతుంది ప్రపంచం. ఏమర్థం చేసు కుంటుంది? వీరందరిలో నువ్వు పడే

తపన నాకు తెలుసు. రాఘవలా కన్నీళ్లు దాచుకుని కలంతో వర్ణించడం చేతకాదు నీకు. నీపట్ల నాకుండే ఇష్టం నా చేత ఈ ఉత్తరం రాయిస్తోంది. జీవి 84 లక్షల జన్మలు ఎత్తాలట ముక్తి పొందడానికి. ఈ నా గమ్యానికి నేనెంత దూరంలో ఉన్నానో తెలియదు నాకు.

చచ్చిపోయేముందు స్నేహితురాలు 'ఉమ'గా ఒక్కటి కోరుకుంటున్నాను విరించీ!

నేను చదివిన కవిత్వం, వేదాంతం ఈ మిథ్యా ప్రపంచపు వాదాల్ని దాటి చీకటి చిట్టడవుల్లో నీరెండను వెతుక్కునేటట్లు చేసింది. ఈ జన్మకు నేను నేర్చుకున్న జీవన సారాంశం ఇదే.

ఏ పని వెనకాలైనా దేముడో, కాస్మిక్ ఎనర్జియో, మరొకటో ఏదో తెలియని స్ఫూర్తి ఒకటే 'థాట్!' సర్వ భౌతిక ప్రపంచపు సృష్టికి కారణం మన ఆలోచన. కన్నుమూస్తే మరుగయ్యే ఈ ప్రపంచం, కన్ను తెరుస్తే రూపు కట్టుకునేది కేవలం 'ఈ థాట్ పవర్'తోనే. దానికి రకరకాల ద్వేషాలు, అసురాగాల బట్టలు కట్టి, స్వరూపాన్నిచ్చి, ప్రపంచాన్ని మన కోణంలోనించి ఆలోచించి అనుభూతుల్ని అలికి స్వరూపమే మార్చేసంకంటే, దేన్నిదానిగా చూడటం, నెగటివ్ థింకింగ్‌తో 'థాట్'ను మలినపరచకుండా ఉండటం జరిగితే ప్రపంచం ఇంత ఇరుకుగా కనిపించదేమో! మన స్వార్థం, అసూయ, క్రౌర్యం మన థాట్‌ను అపవిత్రం చెయ్యగానే తద్వారా మాటా చేతా కూడా మరింత మలినమై పోతున్నాయి. దయచేసి ఈ అద్భుత అవలోక నా జ్ఞానాన్ని నురుగుపరచకండి. చేసే ప్రతి పని వెనకాలా ఈ జ్ఞానం వర్థిల్లి మాటతో జతగూడితే ఇప్పుడున్న మామూలు మానవత్వపు వైతరిణి దాటి సుస్వాతకతతో అవతలిఒడ్డు చేరుకోగల మనిపిస్తుంది.

రాఘవతో చెప్పు విరించీ... ఉమ నీ అవలోకిక జ్ఞాన ఊహాసింహాసనంలో రాణిలా దర్శనమిస్తుందని, అతని కర్తవ్యం వెనకాల నిజాయితీ నీడలో ఉంటుందని.

ప్రపంచపు అజ్ఞానపు చిరునీడల వెనకాల నిలిచే నిశ్శబ్దపు తేజస్సు జ్ఞానావలోకమే తమ్ముడూ!

నా బతుకొక చెదిరిపోయిన ముత్యాల దండ తమ్ముడూ. అన్నీ మంచివికావేమో! ఏరుకున్న ఏ కొద్దివాటిలోనో జీవన సత్యాలు ప్రతిఫలించవా?

కనబడని మౌక్తికాలను కలల ప్రపంచాన్నించి ఏరి మీకు కానుకగా ఇచ్చి వెళ్ళిపోతున్నా.

మీ

ఉమ.

ఈ ఉత్తరం చదవగానే నాకే తెలియకుండా కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. గుండెలు చిక్కపట్టినట్లై ఒక్కసారిగా భళ్లున బద్దలౌతుందేమోననిపించింది.

కళ్ళు మూసుకుని పడక కుర్చీలో వెనక్కు వాలాను. నా ఊహల్లో, నా దుఃఖంలో, నా గుండెల్లో ఉమ రూపం. 'మామయ్యా ! నన్నెరుగుదువు కదూ ఇప్పుడూ ?' అని అడుగుతున్నట్లే అనిపించింది.

నా కళ్ళ ముందు గౌన్లు వేసుకుని తిరిగే పాప, పెళ్ళిలో బుద్ధిగా వంగి కాళ్ళకు దణ్ణం పెట్టిన ఉమ-ఈలోపలి మనిషి ఇదా? నిజంగా ఈ ప్రపంచంలో ఈ పాంటు షర్టు వెనకాల, పట్టు చీరల




వెనకాల, చర్మం, అస్థిపంజరాల వెనకాల అసలు మనుషులు ఏమిటట! వాళ్ళెవరు? ఎలా ఉంటారు?

రమణమహర్షి 'నిన్ను నువ్వు తెలుసుకో' అన్నారంటే అదే నా అర్థం?

నాలో ఏదో తెలియని బాధ, గుండెల్లో ఏదో రొద... ఇదెలా తీరుతుంది? అటూ ఇటూ కాస్సేపు తిరిగాను. పనివాడిచేత కాఫీ కలిపించుకుని తాగాను. ఈ పరిస్థితి ఏనాడూ ఎరుగను. నా ఆలోచనలు, పరిస్థితులు నా అదుపుదాటి ఏనాడూ వెళ్ళలేదు. నా భార్య చితికి నిప్పు పెడుతూ కూడా నేను రాబోయే ఎల్. ఐ. సి. పాలసీ తాలూకు డబ్బు గురించే ఆలోచించాను. అది అర్థంలేనిదిగా, అసహ్యకరంగా మీకు అనిపించవచ్చు. నేను బయటకు చెప్పాను కానీ, చాలా మంది ఆలోచనలు అప్పటికప్పుడు టీవీలోలా బహిర్గతం అయితే, ఈ ప్రపంచంలో ఒక్క క్షణం నిలబడలేము ఎవరమూ కూడా!




"ఏమిటి సార్ చదివేశారా?" హడావిడిగా లోపలికి వస్తూ అన్నాడు విరించి.

ఉలిక్కిపడ్డాను.

అతనివంకే చూశాను కన్నార్పకుండా! ఎవరీ కుర్రాడు? ప్రశ్నార్థకంతో వచ్చాడు. ఏం చెప్పాలి ఇప్పుడు?!

"కూర్చో విరించీ!" అంటూ కాఫీ తెమ్మని కుర్రాడికి చెప్పాను.

"సార్! అసలు ఆవిడ రచనలు.... చూశారా ఎంత సున్నితత్వం! సార్.... ఎలాగయినా ఇది ఒక గొప్ప నవలకు ప్రాతిపదిక సార్"

"నేను ఆవిడ ఉత్తరం మాత్రమే చదివాను విరించీ!"

"అదేమిటండీ?!" నీరసంగా అన్నాడు.

"అది చాలు...చాలా కథ చెప్పింది. అదుగో కాఫీ వచ్చింది తీసుకో"

మొహమాటం లేకుండా తీసుకున్నాడు.

"సార్! అసలు...."

"విరించీ!''

"ఏమిటండీ?"

"అసలు నీకూ, మా ఉమకు, రాఘవకు ఎలా పరిచయం!''

"అదా సార్! చాలా పెద్ద కథ సార్" గభాల్న కప్పు అడుగున ఉన్న కాఫీ నోట్లో పోసేసుకుని కప్పు కింద పెట్టేస్తూ అన్నాడు.

నేను మళ్ళీ అడగక్కరలేకుండానే చెపుతాడని నాకు తెలుసు.

* * *

శంకరంగారు వింటున్నారు...విరించి మాటలు పేరుస్తున్నాడు. అసలు జరిగిందేమిటంటే....

"జీవితంలో అవ్యాజమయిన కరుణావాహిని అంతర్వాహినిగా ప్రవహిస్తూనే ఉంటుంది. కానీ, మనిషి దాన్ని గుర్తించకుండా నీహారికలవెంట పరుగులు తీస్తాడు. కష్టాల ఎడార్లలో మెటీరియలిస్టిక్ అస్తిత్వం కోసరం అర్థం తెలియని ప్రయాణం. టాల్‌స్టాయ్ రాసిన సూర్యాస్తమయం లోపల దొరికే భూమికోసం పరు

గెడుతూ ప్రాణాలు బలిఇచ్చిన వ్యక్తి కథ గుర్తుకు వస్తుంది."

ఈ మాటలు ఎవరో చదివి "మీ ఎడిటోరియల్ చాలా అద్భుతంగా ఉంది రాఘవా!" అంటున్నారు.

అది ఒక జర్నలిస్ట్ కం ఆర్టిస్టు ఇంట్లో చిన్న గెట్ టుగెదర్. ఒక ప్రముఖ పత్రికలో పనిచేస్తున్న అతనికి కథకుల్ని, రచయితల్ని, అందమయిన వాళ్ళను, బాగా మాట్లాడేవాళ్ళను ఒకచోటచేర్చి కాస్త టీలాంటిది పోసి మాట్లాడించడం మహా సరదా. కానీ కోరికలోఉన్న బలం తీరడంలో లేదు. అతనికెప్పుడూ ఈ సమావేశాలు పూర్తిఅయిన తరవాత, తల కాయ నెప్పి మిగిలి 'మళ్ళీ పిలవకూడదురా బాబూ' అనిపించేట్లు చేస్తాయి. అయినా మానడు. ఆ మీటింగ్స్‌కు "మానస వీణ" అని పేరు పెట్టాడు.

"ఇది మోగించడానికి ఇక్కడికి రానక్కరలేదు..." అని వెకిలినవ్వు నవ్వే గొప్ప రచయితల దగ్గరనుంచి "నా గుండెల్లో రుధిరాగ్ని నీ వేలుకొసల వెలుతురా ప్రేయసీ" అని గాలిబ్ కాపీ అయినా కవిత్వంగా కూర్చుకువచ్చి చదివేద్దామనుకునే క్షుద్రకారుల వరకు అందరూ అతనికి పరిచయస్థులే.

ఆజర్నలిస్ట్‌పేరు విరించి. అతనిఅసలు పేరేమోకానీ, ప్రపంచానికి అతని పేరు అదే. ఏమాత్రం జర్నలిజం ఒంట బట్టకపోయినా, మేధస్సు జ్వలించక పోయినా, తెలివితేటలుండి పలుకు బడిలేని సబ్ ఎడిటర్ల మధ్య తలకాయ దూర్చి, బొప్పిలు కట్టించుకుని, దుఃఖపడి ఓదార్చుకుని "నాకు ఈ పేరే సరి! బ్రహ్మలా నాలుగు తలకాయలు చాలవసలుఈదిక్కుమాలినఉద్యోగానికి" అని తిట్టుకుని, సిగరెట్టు కాల్చేసి రిజిగ్నే షన్ లెటర్ రాసి, పొద్దున్నే లేచి చించేసి ఆఫీసుకు పోతూ ఉంటాడతను.

ఆంధ్రదేశపు ఓ పల్లెటూళ్ళో పుట్టి పెరిగిన అతనికి సౌందర్యారాధన ఎక్కువే కానీ, బతకడానికి అది ఒక్కటే పనికిరాదు.

కాలవలో నీరెండ దరహాసాలు చూస్తూ, చింత చెట్టు కింద కూర్చుని వెదురుతో వేణువు చేద్దామని ప్రయత్ని స్తూంటే, ముసలి తాతమ్మగారి ముని మనుమ రాలు విసిరేసిన జామకాయ తగిలి తలెత్తి చూశాడు.

అంతలావు శరీరంతో పిట్టగోడ మీదుగా ఒంగి చూస్తూ కన్ను కొట్టింది ఆ పిల్ల.

ఒళ్ళంతా జలదరించి పారిపోయి ఇంటికి వచ్చేశాడు. కానీ ఆ తరవాత ఆ పిల్లే విరించి తననేదో చెయ్యబోయా డని కావాలని యాగీ చేసుకుంది. విస్తు పోయాడతను ఆ పిల్లకు ఈ నిందలో ఉన్న ఈగో శాటిస్‌ఫాక్షన్‌కు.

"ఆదేమిటి వదినా!ఆ పిల్ల అసలు..." వదినగారి వెనకాలే ఆపకుండా మాట్లాడు తూనే వంట ఇంట్లోకి వెళ్ళాడు విరించి.

"సర్లేవయ్యా కూర్చో భోజనానికి" అంది సుభద్ర నవ్వుతూ.

"ఎండలో చెడ తిరిగి ఇప్పుడొచ్చాడా అన్నానికి? వెధవ..." గొణుగుతోంది అతని తల్లి దుర్గమ్మ గదిలోనించి.

కానీ, సుభద్రకు ఈ అల్లరి మరిదంటే విపరీతమైన సానుభూతి. ఆమె పెళ్ళికి అతను అద్దాల్లో బిడ్డ.

అసలు మన సాంఘిక వ్యవస్థలోనే ఒక విచిత్రమున్నది. సున్నితము, సుకు మారము. నిరంతర చైతన్య స్ఫూర్తితో




స్పందించే స్త్రీత్వం ఒక్కసారి ఒళ్ళు విరుచుకుంటే ఏమౌతుందో గ్రహించి సంఘం ఉలిక్కిపడి ఉంటుంది. సృష్టికర్త అంతర్ముఖుడైనప్పుడు ప్రకృతి శివత్వాన్ని పొందితే, విలయము, ప్రళయము నిద్రలేస్తుందేమో! అందులో కూడా భయద సౌందర్యం ఉంటుంది చూసే కళ్ళకు. కానీ, యోగి, నిశ్చలాత్ముడు అయిన వ్యక్తికితప్ప, ఆ సంపూర్ణ స్త్రీత్వం అర్థం కాదు. మిగతా ప్రపంచం ఆ విలాసతీహాసానికి మూర్ఛిల్లుతుందేమోనని, సౌందర్యానికి సౌకుమార్యము స్త్రీత్వానికి మాతృత్వము, ఉగ్రనరసింహుడికి చందనపు పూతలా, తిక్క కాళికి మంచినూనె, కుంకుమాభిషేకంలా ఏర్పడి పోయి ఉంటుంది.

పసుపు రాసిన పాదాలు, శుక్రవారం అని కాబోలు కాశీపోసి కట్టుకున్న రేషన్ పట్టు చీర, పాంజేబులు, ఎర్రటి కుంకుమ, కంటి ఆర్ద్రతతో తడిసి కరిగిందాఅనిపించే కాటుక, ఒంటి రాయిముక్కు పుడక

"ఏమిటయ్యా అలా చూస్తున్నావు? మంచినీళ్ళు ఇవిగో..." అన్నది సుభద్ర.

వదిన దేవత. ఆవిడ కళ్లలో ఎప్పుడూ ఆప్యాయతా సౌందర్యాలు ... వదిన అన్నయ్యవంక ఎలా చూస్తుందో గమనించాల్సిందే!

ఛీ...అవి తన చిలిపి ఆలోచనకు మనసులోనే లెంపలేసుకుంటూ భోజనం ముగించి చెయ్యి కడుక్కొని లేచాడు.

అసలు ఆడది పుడుతూనే మహానటి. "ఈ ప్రపంచమే ఒక రంగస్థలి. మనం అందరం మన పాత్రలు నటించి పోవడానికి వచ్చామన్న" షేక్స్పియర్ చాలా కరెక్ట్‌గా చెప్పాడు. అది ఆడవాళ్ళ విషయంలో మరీ కరెక్ట్!

స్త్రీ చూసే చూపులోనే ఆమె అంతర్యం ప్రతిబింబిస్తుంది. స్వచ్ఛమైన నీటిపై వెన్నెలలా స్పష్టంగా తనకు తోచింది చెప్పేస్తుంది చూపులతో. కానీ, ఆమెభర్తను ఒక రకంగా, బిడ్డను మరొకరకంగా, పరాయి వారిని ఇంకొక రకంగా - ఇలా క్షణక్షణం చూసే చూపుతో తన జీవన నాటకంలో యవనికలు వేసుకునే స్త్రీమూర్తి కన్న మహానటి ఎవరు?

"అసలు ఈ స్త్రీహృదయం అనేది నాకు పెద్ద ప్రశ్నార్థకం అనిపిస్తుంది" గబుక్కున ఆలోచిస్తూ బయటకు అనేశాడు విరించి.

నవ్వేసింది వదిన. "ఆఁ! ప్రతివాడికీ ఈ ప్రశ్న ఉదయిస్తే బోలెడు కాలక్షేపం. ఈ ఆలోచనలు సరేకానీ, ఆ పిల్ల సంగతి ఎక్కడా బయట పెట్టకు. అసలే అల్లరై పోయింది ఆ కుటుంబం." వక్కపొడి పెడుతూ మందలింపుగా అని అక్కడే స్థంభానికానుకుని కూర్చుంది ఆమె.

అలా ఆమె స్థిమితంగా కూర్చోవడం సాధారణంగా చూడడు విరించి. అలా కూర్చుందంటే ఏదో చెప్పాలనే!

"ఏమిటి వదినా?"

"ఏదైనా ఉద్యోగం చూసుకోరాదూ! అన్నయ్యగారు కేకలేస్తున్నారు" ఎటో చూస్తూ అన్నది. చేతినుండే ఎర్రగాజుల మీద తలుపు సందునుంచి ఎండ దూసుకు వచ్చి పడుతోంది.

తలెత్తి చూశాడు. వదిన.. సుభద్ర.. ఆమెకు చాలా కథ ఉన్నది. నిండు గంగానదిలా తొణకనట్లు ఉండే ఆమె అంతర్యంలో అనాటి ప్రతివ్రతల అభిజాత్యం, అభాగినుల ఆవేదన, ఋషిపత్నుల వైరాగ్యం ఉన్నాయి. ఆతరవాత జీవితంలో ఎక్కడా అలాంటి దృశ్యం మద్రాసులో

ఈ దిక్కుమాలిన ఇరుకు వీధుల్లో ఒంటి రాయి మేడమీద పాకలో అద్దెకుంటున్నప్పుడు తారసపడ్డ అరవ ఆడబడుచుల్లో కానీ, సాయంత్రాలు సముద్రపు ఒడ్డున కనపడే నార్త్ ఇండియన్ ఆడపిల్లల్లో కానీ, సినిమా ప్రపంచపు మేకప్ సౌందర్య రాశుల మధ్యకానీ–ఎంతమందిని చూసినా వదినలాంటి పరిపూర్ణ స్త్రీ మూర్తి తారస పడలేదు.

చెప్పవలసిన మాటేదో అనేసి మాట్లాడకుండా కొంగుపరచుకుని స్థంభం వారగా తలక్రింద చెయ్యి పెట్టుకుని పడుకుంది ఆమె.

వదిన అలిసి పోయింది. ఎందుకో అతనికి దుఃఖం వచ్చింది. వదినలాంటి వాళ్లు ఈ దేశంలో ఎంతమందో? ఈ నాలుగు నిట్టాళ్ళ పురాతన ధర్మమనే గ్రహానికి నిజమైన ప్రాతిపదికలు ఈ స్త్రీ మూర్తులు. కానీ, వీళ్ళను చాలా తేలిగ్గా, సులభంగా వీరి అంతర్యాన్ని, అనుభవాలను అణిచేసి కేవలం ఒక పసుపు తాడుతో కట్టెయ్యగలదు ఈ సంఘం. వారు తిరగబడరు. ఇదేమిటని అడగరు. దీనికి, వాళ్ళలో జీవన్మరణ రేఖల మధ్య సున్నితంగా కదిలే ఆత్మార్పణే కారణం.

సుభద్ర పెద్దగా ఉన్న వాళ్ళింటి పిల్లేమీకాదు. రెండు వేల కట్నం, లాంఛనాలతో సహాఇచ్చిచెయ్యికడుక్కున్నాడు ఆమెతరవాత ఐదుగుర్ని కన్న ఆ తండ్రి.

దివాణంలాంటి ఇంట్లో పెద్ద కోడలుగా అడుగుపెట్టిన సుభద్రకు ఈ ఐశ్వర్యం, అది ఆ మనుషులకిచ్చిన అర్థంలేని అహంకారం చూసేటప్పటికి ఆ పదిహేనేళ్ళ పిల్లకి తమ ఊరి ఏటి ఒడ్డున బంతి పూల చెట్లమధ్యనున్న వేణుగోపాలస్వామి ఆలయానికి పారి పోవాలనిపించింది. ఇక్కడ అందరికీ తెలిసింది డబ్బు, అది ఇచ్చే అహం. వాళ్ళకు తెలియనిది ఆప్యాయత ఆదరణ. ఎవరితో మాట్లాడినా వాళ్ళ తాలూకు ఆస్తిని, మెళ్ళో నగలను బేరీజు వేస్తూ బతికేవారు వాళ్లు. వాళ్ళందరికీ సరి అయిన ప్రతినిధి తన అత్తగారు. కుండ ఓటిదని తెలిసీ కోడలిచేత కడిగించి విరిగిందని తిట్టే మనస్థత్వం ఆమెది. తెలియనిది తెలుసుకుందామనే ప్రయత్నంలో ఉంటారు జిజ్ఞాసువులు. తెలిసింది లౌకిక జీవితానికి అడ్డంపడ కూడదని అనుకుంటాడు అజ్ఞాని. ఆమె చాలా మందిలా రెండవ కోవకు చెందిన మనిషి. ఆమె అహంతృప్తికి కోడలు ఒక ఆటబొమ్మ.

"శుక్రవారం తులసికి పసుపు పుయ్యాలని తెలియదూ। ఆడదానివి కాదూ?" అంటూ పొద్దున్నే భయంకరంగా రంకెలు వేస్తూన్న అత్తగార్ని చూసి ఆశ్చర్యపోలేదు సుభద్ర. అది అలవాటైపోయింది ఆమెకు. అంతకు ముందువారం తులసి కోటకు పసుపు రాస్తూంటే "అంత చేటూపాటూ తెలియని సంసారమైతే ఎలా? దరిద్రురాలికి ఐశ్వర్యం పడితే ఇంతేమరి. కట్టతెగినట్లే. తులసి చెట్టుకు కాస్త పసుపు కుంకుమ పెడితే సరిపోతుంది. ప్రతివారం మెత్తక్కర్లేదు" అంటూ ఆవిడ చేతులూ కాళ్ళూ తిప్పుతూ చేసిన అభినయం ఇంకా గుర్తుంది సుభద్రకు. మళ్ళీ ఈ వారం ఇలా...

ఆవిడకు కావలసింది మాట చెల్లడం. ఆ మాటల వెనకాల ఔచిత్యం లేదు. శుక్రవారం పూటా ముత్తైమువై ఉండీ భర్తను




శాపనార్థాలు పెట్టి శోకాలు తీయడం, ఇంటి మధ్యలో కూర్చుని పేలు తీసుకోవడం ఇవన్నీ ఏ కులస్త్రీ లక్షణాలు అని ఆవిడను అడిగేవారు లేరు. వయస్సుతో గౌరవాన్ని తెచ్చుకున్న వాళ్ళతో సమాజం పడేబాధలు కోకొల్లలు. ఆ పల్లెటూరిలో మెడనిండా కాసులపేర్లతో చారెడు పసుపు, చారెడు కుంకుమతో మెరిసిపోయే దుర్గమ్మ అదృష్టవంతురాలు, పెద్ద ముత్తైదువఅందరికి. అక్కడి అమాయకులకు, అక్షరం రానివాళ్ళకు ఆమె ప్రైమరీస్కూలు చదువు ఎక్కువ. కర్మ సిద్ధాంతం నమ్మే మనుషులు ఆమె ఎంత పుణ్యాత్మురాలు కాకపోతే అంత అదృష్ట వంతురాలౌతుంది అని ఆమెను అందలం ఎక్కించడానికి అలవాటైంది. కానీ, అదే నిజమయితే, వచ్చే జన్మకు ఏందాచు కుంటున్నావని ఆమెను అడిగేవారు లేరు మరి. ఆమె భర్త ఈ భార్య గద్దరితనంతో ఏనాడోవేదాంతిలా అయిపోయి ఉంటాడు ఏమన్నా ఏం మాట్లాడడు.

సర్వశోభాయమానంగా ఉండే ఇళ్ళల్లో ఈ దౌర్భాగ్యపు అహంకార పూరితులైన ఆడవారి వల్ల, వారి అజ్ఞానం వల్ల కొన్ని తరాలు తీరని శాపాలకు గురిఅవుతున్నాయి. పైగా వీరి అజ్ఞానం, అహంకారం కేవలం ఇల్లాలితనంచాటున దాక్కుని దిక్కులేని వాళ్ళందరికీ అక్రమ సంబంధాలు, దరిద్రులందరికీ దొంగతనాలు అంటగట్టగలవు. దేముడు, వేదాంతం, పురాణాలు, కర్మసిద్ధాంతం – ఇవన్నీ వీళ్ళకు ఉపోషాలకు, పిండి వంటలకు, పదిమందిలో మేము అధికులమని పించుకునే భయంకరదాంభికత్వానికి ఉపయోగపడతాయి కానీ, తమలో నిరంతరం జ్వలించే ఆత్మజ్యోతి దర్శనానికి ఎంత మాత్రం ఉపయోగించడం లేదు. 'దేవుడు లేడు' అనుకోవడం భయమేమో కానీ ఉన్నాడు అనుకోవడం అడ్డం వాళ్ళకు.

ఈ అజ్ఞానాంధకారాలమధ్య మరీ అయోమయంగా కనిపించేవాడు భర్త ఆమెకు. ఆ తల్లి ఎన్నితిట్టినా మాట్లాడడు. తనకు తోచింది చాతనైనది అయిన పని చేసేవాడు. అతడు చేసే కరిణీకపు పనీ అదేమంత కష్టమైనది కాదు.

"నువ్వు నోరు మూస్తావా లేదా?" ఒకరోజు అసుర సంధ్యవేళ తెగ తిట్టి పోస్తున్న దుర్గమ్మను చూసి నేరుగా ఇంట్లోకి వస్తూ ఒక్క అరుపు అరిచాడు రఘు. ఉలిక్కిపడింది సుభద్ర దేముడికి దీపం పెడుతూ. ఇంటిల్లి పాదీ అదురుకున్నారు.

"ఏమన్నావురా?" మీది మీదికి వస్తూ అడిగింది దుర్గమ్మ కళ్ళు ఎర్రన జేస్తూ అంతటి మనిషి అలా అరిచేటప్పటికి ఒణికిపోయింది సుభద్ర.

"సిగ్గులేదూ ? ఆడదానివి కాదూ ? రోడ్డుమీదికి వినిపించేటట్లు ఆ అరుపు లేమిటి? ఛీ..." ఒక్క విదిలింపు విదిలించి, దొడ్లోకి కాళ్ళు కడుక్కోడానికి వెళ్ళిపోయాడు సుభద్ర పెద్ద మరిది రఘు.

ఇంటిల్లిపాదీ అవాక్కైపోయారు. పటిక బెల్లం కోసరం దేముడి గూడు దగ్గరకొచ్చిన విరించి వదినగారి కొంగు ముఖం చుట్టూ కప్పేసుకున్నాడు, భయంతో కుచించుకుపోతున్న అతణ్ణి దగ్గరగా తీసుకున్నది సుభద్ర.

నేరుగా వచ్చి పీట వేసుకుని, మూత పెట్టిన దిబ్బరొట్టె కంచంలో పెట్టుకుని, "వదినా! ఆవకాయ వెయ్యి" అని అరిచి అది తిని వెళ్ళిపోయాడు రఘు.

కాని, ఆరోజు మొట్టమొదటిసారిగా




ఆ ఇంట్లో విప్లవం తలెత్తిందనీ, దానికి పరోక్షంగా సుభద్ర బలైపోతుందనీ కల్లోకూడా అనుకోలేదు ఎవరూ.

ఆ రాత్రి దుర్గమ్మగారి పెడబొబ్బలు, శాపనార్థాలు, మామగారి మౌనం, ఆడ బిడ్డల సతాయింపు – వీటన్నింటి నుంచీ పారిపోయి ఇంటి పెరట్లో కాస్త దూరంగా ఉన్న వేపచెట్టు దగ్గర మంచం వేసుకుని చీకట్లో కూర్చుంది సుభద్ర. ఆమె మనస్సు తడిసి ఉబ్బిన దేవదారు చెక్కలా బరువుగా ఉంది.

"ఇదుగో తీసుకో..." ఆ చీకట్లో ఒక చెయ్యి ఆమె మంచం మీదికి వంగింది.

భయపడి ఒక్క అరుపు అరవ బోయింది.

"నేనే వదినా! రఘుని...తీసుకో... నీకు నేరేడు పళ్లు ఇష్టమని తెచ్చాను"

అవాక్కయి అలాగే చీకట్లో అప్పుడే రూపుదిద్దుకుంటున్న ఆ పదహారేళ్ల పిల్లాడిని చూస్తూ కూర్చుండిపోయింది.

ఎక్కడినించో నెగడు చుట్టూ లంబాడీలు నృత్యం చేస్తున్న సంగీతం...పసిబిడ్డ ఏడుపు,... కాపుల ఇంట్లోనుంచి పొగ... చవితి చంద్రుడు.

"సుభద్రా!" భర్త పొలంనించి వచ్చినట్లున్నాడు. గబుక్కున లేచి వెళ్లిపోయింది లోపలికి. ఆ రాత్రి రఘు భోజనానికి రాలేదు.

"ఎక్కడ తిరుగుతున్నాడో వెధవ.

రానీ..." అత్తగారి ఆరుపులకు సమాధానం చెప్పలేదు సుభద్ర. అంతకు ముందే తను చూశానంటే ఏం ముప్పో నని మాట్లాడకుండా వంటిల్లు కడిగి ముగ్గు పెట్టి బయటపడింది.

# 6



పుట్టిన మూడు నెలలకే తల్లికి మళ్లీ నెల తప్పితే, తలచెడిన మేనత్త తీసుకువెళ్లింది రఘును పెంచడానికి.

కృష్ణాజిల్లా పల్లెటూర్లో మోదుగచెట్టు నానుకుని ఉన్న పెంకుటింట్లో, సాయం సంధ్య వేళ దీపపుబుడ్డి వెలిగించుకుని, తాటాకు విసనకర్రతో విసురుకుంటూ తత్వాలు పాడే ఆ మేనత్త అంటే చాలా ఇష్టం రఘుకు. ఆమె మహా సౌందర్యవతి. ఆమె కంటి రెప్పలపైన తెలుపు, గులాబీరంగు కలిసిన వర్ణం, కాటుక పెట్టినట్లుండే కళ్లు, గులాబీ పెదవులు, తీర్చిదిద్దినట్లుండే పలువరుస...మరొకసారి చూడాలనిపించే మనిషి ఆమె. పొట్టు పొయ్యిలో పంట, కాలవనించి తెచ్చే నీళ్లూ – ఈ కష్టాలేవీ ఆమెను కదిలించలేదు. ఎందుకో ఆమె భర్త పోయిన తరవాత మనోవర్తి నాలుగెకరాలతో విడిగా వేరే ఊర్లో ఉండేది. అంతేకానీ, అన్నగారింటిని ఆశ్రయించలేదు. ఆమె దగ్గర మతిభ్రష్టుడైన ఒక వ్యక్తి ఉండేవాడు. వయస్సులో ఆమె కన్న ఇరవై ఏండ్లు పెద్దయిన ఆయన ఆమె భర్తకు సవితి అన్నగారట. అత్తగారి ఆస్తికి మిగిలిన ఏకైక వారసుడు అతని పిచ్చి ఏమంత ప్రమాదకరమైనది కాదు. ఎవర్నీ బాధించేదీ కాదు. పొలాల గట్టున తిరుగుతూ, సైకతలింగాలు చేస్తూ, స్నానాలు, జపాలు చేస్తూ తిరిగేవాడు. అమెకు, ఆయనకు ఏమిటి అనుబంధం అంటే సమాధానం లేదు. ఆయన లోకంలో ఆయనుంటే, ఆమె ఆయనను చూస్తూ కూర్చునేది.

"ఆఁ పిచ్చీ లేదు ఏం లేదు ఆ ముదనష్టపోడికి...దాని రంకు మొగుడు.. మాకు తెలియదా ఏమిటి ! హాయిగా ఆ నాల్గుగెకరాల కొంపమీద ఐవేజుతో ఇక్కడ మా దగ్గరుండచ్చుగా... రంకు నేర్చినమ్మ బొంకు నేర్వదా అని" దుర్గమ్మగారు చేతులు రెండు గాలిలో తిప్పుతూ దుమ్మెత్తిపోసేది – ఆడబడుచు గుర్తుకు వచ్చినప్పుడల్లా.

కొంచెం పెద్దవాడైన తరవాత రఘు, "అత్తయ్యా! ఆయన ఎవరూ?" అని అడిగితే ఆకాశం, కొండా కలిసే చోటు చూస్తూ నవ్వి ఊరుకునేది ఆవిడ. పసిబిడ్డగా ఉన్నప్పటినుంచీ రఘును ప్రాణంగా పెంచేది ఆవిడ.

వెచ్చటి ఆవిడ స్పర్శలో తత్వాలు వింటూ హాయిగా నిద్రపోయేవాడు రఘు. ఆమె మంచితనం, సౌందర్యం, స్వాతంత్ర్యం అతని వ్యక్తిత్వంపై చెరగని ముద్రవేశాయి.

ఎప్పుడైనా ఆవిడతో తల్లిగారి ఊరుకు వచ్చినా, తల్లి ఏదో ఒక రకంగా ఆవిడతో తగూవేసుకోడం చూసి చిరాకు పుట్టేదతనికి. కానీ, మేనత్త




మాత్రం దుర్గమ్మగారిని చూసి మూర్ఖపు పసిబిడ్డమీద జాలిపడుతున్నట్లు నవ్వేది. ఆవిడ మరింత రెచ్చిపోయేది. తల్లి మీద అంతర్లీనంగా పరమ భయం కరమైన జుగుప్స పెరిగిపోయింది రఘుకు. కారణం ఇది అని చెప్పలేక పోయేవాడు. ఏ ఆడదీ తల్లిలామాత్రం ఉండకూడదనిపించేదతనికి.

హాయిగా సాగిపోతున్న రఘు జీవితంలో అత్తయ్య పిచ్చిబావగారి మరణం చెరగని ముద్ర వేసింది.

వాళ్లు ముగ్గురు దాయమాడేవారు. ఆ పెద్దాయన పక్షాన పందాలు కూడా తానే వేసి న్యాయంగా ఆడేది అత్తయ్య. ఓడిన వాళ్లు గెలిచినవాళ్ళకు కర్జూరపు పండు ఇచ్చుకోవాలి. అవి కూడా ఆమె అందరి తరపున తెచ్చిపెట్టేది కంచంలో.

ఆరోజు ఆట చూస్తూ ఏదో పిచ్చి నవ్వు నవ్వుకుంటున్నాడు ఆయన.

"రంగా! నువ్వే గెలిచావు" అంటూ తలెత్తిందామె. ఆమె వంక సూటిగా చూస్తూ, సన్నగా నవ్వి, పక్కకు జారి పోయాడు ఆయన. గబుక్కున ఆ మనిషిని గుండెలకు హత్తుకున్నది అత్తయ్య.

ఆయన వెర్రిచూపు, ఆమె కన్నీరు, శేషించిపోతున్న వెన్నెల, మిణుకు మిణుకు మంటున్న దీపం, దూరంగా ఎక్కడో పెళ్లి భజంత్రీలు, ఇంటి నానుకునున్న సరస్సులో కప్పల జీవన్మరణ సమీక్ష... అవన్నీ ఎప్పుడూ మర్చిపోలేకపోయాడు రఘు. ఆ తరవాత అతను చూసిన అనేక కృత్రిమ జీవన సరళులలో, విరామ సంగీతంలా ఆ రాత్రి ఎప్పుడూ గుర్తుకు వస్తుంది అతనికి.

ఆ తరవాత ఆమె ఇల్లు అమ్మేసి, పొలం రఘు పేర రాసి వెళ్లిపోయింది ఎక్కడికో. కొంత మంది "కాశీకి" అన్నారు.

దాదాపు పదిహేనేళ్ల ప్రాయంలో అపరిచితుడిలా తన సొంత ఇంటికి వచ్చాడు రఘు. కొన్ని మధ్యతరగతి జీవితాల్లో డబ్బు ఇచ్చే హోదా, అధికారం చిన్నప్పుడే తెలుస్తుంది. రఘుకు ఇపుడు అందరికన్నా నాలుగు ఎకరాలు అధికం ఉన్నది.

"వాడు నా పోలిక... ఎప్పుడూ అదృష్టవంతుడే...." అడబడుచు పొడ గిట్టకపోయినా, ఆవిడ ఆస్థిమీద ఏ మాత్రం అసహ్యం లేని దుర్గమ్మగారు రఘురాగానే మిగతా బిడ్డలకన్నా అతనికి ప్రత్యేకత ఇచ్చి, గారాబం చేసి నెత్తికెక్కించుకుంది. ఆ ధోరణితో మరింత బెట్టుగా ఉండేవాడు రఘు. ఆ పిల్లాడంటే ఒక రకమైన భయం ఉండేది సుభద్రకు. చూపుల్లో ఎర్రజీర, మిత భాషిత్వం— ఆమెను మరీ భయపెట్టేవి.

ఒకనాడు సాయంత్రం దొడ్లో మల్లె పందిరి దగ్గర నీళ్లు పోసుకుని, ఇంట్లో ఎవరూ లేరుకదా అని గభాల్న చీర చుట్టుకు వచ్చేసింది సుభద్ర. గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాడు రఘు. ఆమె ప్రాణం చచ్చిపోయింది. 'ఎప్పటి నుంచి అక్కడున్నాడో?! అయినా తన భర్త ఉన్నా, పాలేర్లు ఉన్నా, విరించి ఉన్నా రాని బెరుకు ఈ అబ్బాయిని చూస్తే కలుగుతుందేం?!' అనుకుని లోపలికి పారి పోయింది. ఒక రోజంతా తప్పించుకు తిరిగింది. మర్నాడు భర్తకు చెప్పి పాలేరు చేత తడికల్తో స్నానాలదొడ్డి కట్టించుకున్నది.

"ఏనాడైనా ఎరుగుదుమా ఇట్లా మాట

సాగించుకోవడం?" అని నవ్వుతూనే చెప్పింది ఆఖరి ఆడబడుచు జడవేయించుకుంటూ.

శుక్రవారమని తులసి దగ్గర దీపారాధన చేస్తోంది ఒంగి. వెలిగించిన దీపం ఆమె ముఖం మీద వింత కాంతి వలయం ఏర్పరుస్తోంది.

"వెంకన్నా! పెద్దమ్మగార్నడిగి కర్పూరంపట్టా..మర్చిపోయివచ్చాను..." అంది సుభద్ర కరివేపాకు చెట్టు నీడలో ఉన్న మనిషిని చూడకుండానే.

మరునిమిషం మెల్లిగా, అరచేతిలో కర్పూరంతో నిలబడి సూటిగా చూస్తున్నాడు రఘు. ఉలిక్కిపడింది సుభద్ర. ఆ చూపుల వెనకాల అర్థాలు?! ఆమె ఆలోచించడానికి కూడా భయపడింది. ఆమె పెద్ద చదువులు చదువుకున్నది కాదు. కాఫ్‌లవ్, ఆడాల్సెంట్ ప్రేమలు ఆమెకు తెలియవు. కానీ, వాటన్నింటిని మించిన జ్ఞానం ఉన్నది. ఆమె స్త్రీ... తరతరాల నారీ హృదయాల్లో స్పందించే రాగ రంజితత్వానికి ఎక్కడ తెర దించాలో ఆమెకెవరూ చెప్పక్ఖర్లేదు. అందుకే చటుక్కున లోపలికి వెళ్లిపోయింది.

అతణ్ణి తప్పించుకుని తిరిగేది. పలకరిస్తే ముక్తసరిగా మాట్లాడేది. కానీ, దూరం ఆ వయసులో మరింత దగ్గర తనాన్ని పెంచుతుందని ఆమెకు తెలియదు.

"వరసగా మూడు రోజులుగా అన్నానికి రావడంలా! ఈ చచ్చినాడికేమైందో?!" తిడుతూనే బాధపడుతోంది అత్తగారి మాతృహృదయం.

పరీక్ష కోసరం ఆ రాత్రి వద్దనకు రోజూలా తప్పించుకోకుండా తాను వచ్చింది. ఎక్కడో తిరిగి వచ్చి, కాళ్లూ చేతులు కడుక్కొని లోపలికి పోబోతున్న అతన్ని చూస్తూ, "అన్నానికిరా రఘూ! నీ కిష్టమని కందిపచ్చడి చేశాను," అన్నది.

సూటిగా చూసి, మాట్లాడకుండా కంచం దగ్గర కూర్చున్నాడు అతను... అర్థమైపోయింది సుభద్రకు. తనెంత జాగ్రత్తగా ఉండాలో కూడా అర్థమైంది.

"రేపు శ్రావణ శుక్రవారం....చెర్లో తామర పువ్వులు తెమ్మనండత్తయ్యా! పూజ చేసుకుందాం..." చెప్పింది అత్తగారికి.

"ఆఁ! ఎవరు తెస్తారే.... పాలేరు పక్కూరు తిరణాళ్లకు పోయాడు. చూద్దాంలే" అంది దుర్గమ్మ మజ్జిగ చేస్తూ.

మర్నాటి పొద్దునకల్లా తామర పూవులతో వచ్చాడు పాలేరు. బోలెడంత సంబరపడిపోయింది సుభద్ర. అమ్మవారే కరుణించింది అనిపించింది. లేకపోతే, వాడికి ఈ ఆలోచన వచ్చి తీసుకురావడమేమిటి?

పూజ, భోజనాలు అయి పాలేరుకు అన్నం పెడుతూంటే, "ఆ తామర పూలకోసరం పోయి రఘుబాబు ముళ్ళకంచమీద పడ్డారమ్మా! బాగా గీసుకుపోయింది. మీకెవరికీ చెప్పవద్దన్నారు" అన్నవాడి మాటలకు అవాక్కైపోయింది సుభద్ర.

పనంతా అయిన తరవాత, ఇల్లంతా వెదికి కొంచెం దూది, టించరు పట్టుకెళ్లింది.

వడ్లకొట్లో తలమీద చెయ్యి పట్టుకుని పడుకున్నాడతను. జాలేసింది సుభద్రకు.

"ఇదుగో ఇక్కడ పెడుతున్నాను. మందువేసుకో" అంది గుమ్మం దగ్గర





నిలబడి.

చటుక్కున కళ్ళకు చెయ్యి అడ్డం తీశాడు.

తలంటిపోసుకుని జారవిడిచిన జుట్టు, తాంబూలంతో పండిన ఎర్రటి పెదవులు, మామిడి చిగురుకుంకుమ, మెళ్లో చంద్ర హారం, చేతికి ఆకుపచ్చగాజులు కలసి అతని కళ్ళ మెరుపులో కనబడ్డ ప్రశంసలో ఏదో ప్రలోభం.

చటుక్కున వెనుదిరిగింది సుభద్ర. ఆమె గుండెల్లో ఏదోదడ, రక్తంలో ఏదో ఝరి.

"చిన్నమ్మగారు ఇయ్యాల చాలా బావున్నారు. కొత్తచీరేంటి?" పలకరించింది చాకలి రత్తి ఆ తర్వాత. ఆడదాన్లో నిద్రిస్తున్న సౌందర్యం మెరుపై అంబరమై, మహార్ణవమై ప్రజ్వరిల్లి తటిల్లతా సౌందర్యదీప్తిగా వెలగడానికి కేవలం కొత్తచీర సరిపోదని తెలియదు పాపం దానికి.

ఆరోజునుంచీ జీవితంలో కొత్త మలుపులు ఎక్కువైనాయి సుభద్రకు. ఆమె పూజకు అడక్కుండానే పూవులు వచ్చేవి. ఆమె ఇంటిపని చేసుకుని నడుం వాల్చే సమయానికి తాటిముంజలు ఆమె గదిగుమ్మం ముందు ఒలిచిపెట్టి ఉండేవి ప్లేట్లో. తోటలోని మల్లెపూవులు సాయంత్రానికల్లా అరిటాకులో ఆమెకు అంద జెయ్యబడేవి. వీటన్నింటి వెనకాల ఉన్న అదృశ్య హృదయం ఆమెకు అర్థమయ్యేది కానీ, అదిచ్చే గర్వంకన్నా, రానున్న పరిణామాల భయం ఆమెకు ఎక్కువై పోయింది. భర్తలోని అమాయకత్వం, నిశ్చింతా ఆమె బాధ్యతను మరింత ఎక్కువ చేసేవి.

"నేను ఈ ఇంటి పెద్దకోడలిని. దుఃఖమైనా, సుఖమైనా, కష్టమైనా, నిష్ఠూరమైనా ఈ కుటుంబ సుఖశాంతులు, మిగతావారి నైతిక విలువలు నామీద ఆధారపడిఉంటాయి' అమ్మా !అన్నపూర్ణా! నాకు ఆత్మశక్తి ప్రసాదించు...ఏ ప్రలోభాలకూ లొంగకుండా నీలో కలిసి పోయే అనుభూతి నాకు ప్రసాదించు' అని వెండికుందుల్లో దీపాలు వెలిగించి, ఎర్ర మందారాలతో దేవిని అలంకరించి ప్రార్థించేది సుభద్ర.

"ఏమిటి నీ పిండాకూడు ఛాదస్తం... ఎంతకీ తెమలదేం ఆ పూజ? ఛస్తున్నాం. పిల్లలు అన్నాలకని కదబట్టిపోతున్నారు" అని అరచింది అత్తగారు ఓరోజు.

ఎక్కడినించి వచ్చాడో మరొకసారి. తగూపెట్టుకున్నాడు రఘు. సుభద్రకు తెలుసు – తనను ఎవరేమన్నా అతను ఊరుకోడని. కానీ ఎలా అతన్ని ఆపడం? ఆమె చిన్నబుర్రకు ఈ సమస్యకు పరిష్కారం తెలియలేదు ఇది మరొకరకం ఆడదాని సమస్య అయితే, పరిష్కారం ఎలా ఉండేదోకానీ, ఆ వ్యక్తి సుభద్ర అవడంవల్ల సమస్య.

రఘుకు పద్దెనిమిదిఏళ్లు దాటాయి. యవ్వనం అతనిలో మరింత విప్లవాన్ని రేపుతోంది. ఎక్కడెక్కడి తగాదాల్లోనూ తలదూర్చేవాడు. ఏ పని చేసినా అతిగా చేసేవాడు. పొద్దున్నే చెర్లోదూకితే సాయంత్రందాకా ఈదేవాడు. పట్నానికి సినిమాలకుపోతే మూడాటలు చూసి కానీ వచ్చేవాడు కాదు. తగాదాలకు దిగితే, ఎదటిమనిషికి స్పృహ తప్పేదాకా కొట్టే వాడు.

ఎన్ని విషయాలు విన్నా ఏమనేది కాదు సుభద్ర. ఆమె వినాలనీ, ఏదో అనాలనీ మరీ చేసేవాడు.

"చిన్నబాబును కాస్త కేకలెయ్యం డమ్మా! ఆ సుబ్బారాయుడిగారి కోడలితో ఏటిఒడ్డున కనబడ్డాడట. ఆవిడ చెయ్యి పట్టుకోవడం చూశారట ఎవరో. అసలే ఆ మనిషి నీతీ జాతీ లేని మనిషి" కబురు అందించి చల్లపోసి వెళ్ళిపోయింది రంగి. స్థాణువులా నిలబడిపోయింది సుభద్ర. అత్తగారు శాపనార్థాలు ప్రారంభించింది. రఘును, అతణ్ని పెంచిన అత్తయ్యను అందర్నీ తిట్టింది. సుబ్బారాయుడిగారి కోడల్ని, ఆవిడ వంశాన్ని గుంటలో పెట్టి లేవనెత్తింది.

ఆవిడ బాధలో అర్థముందనిపించింది సుభద్రకు. రఘు వస్తాడేమోనని భయ పడుతూండగా రానేవచ్చాడతను. తల్లి తిట్లన్నీ విన్నాడు. కానీ, చాలా విచి త్రంగా నోరు మెదపలేదు. సుభద్రను ఒక్కచూపు చూసి లోపలికి వెళ్ళి పోయాడు. ఆ కళ్ళల్లో వెటకారానికి ఒళ్లు మండిపోయింది సుభద్రకు. ఒళ్లు మర్చి పోయేటంత కోపమొచ్చింది. నేరుగా అతనితోపాటు గదిలోకి వెళ్ళి నిలబడి, "ఏమిటి నీ ఉద్దేశం? ఆ మనిషి ఎట్లాంటిదో తెలుసా?" గట్టిగా అడిగింది.

ఒక్కసారి ఆమెవంకచూసి, గడ్డం మీద చెయ్యి పెట్టుకుని రాసుకుంటూ ఎటో చూస్తున్నాడు అతడు. వచ్చే నవ్వు అణుచుకుంటున్నాడు. అది అసలు భరించలేనివిషయం.భగ్గుమంది సుభద్రకు.

"మాట్లాడవేం?" సన్నటి ఆమె గొంతులో చాలా పదునుంది.

"ఊఁ! అందరూ సుభద్రలు కారుగా! తప్పుకో వదినా! స్నానానికి వెళ్ళాలి..."

అంత మెత్తగాచెప్పి అవాక్కయి నిలబడ్డ ఆమెను తప్పించుకుని స్నానానికి వెళ్ళిపోయాడు.

ఇలా ఈజీవన్నాటకం ముగిస్తే ఎలా ఉండేదో కానీ, సుభద్ర అంత అదృష్ట వంతురాలేం కాదు.

"పూర్ణం బూరెలు మీ ముఖంలా ఉన్నాయి. ఏమిటివి?" మామగారు కేక లేస్తున్నారు. అవిచేసింది చిన్నాదబడుచు. ఆ విషయం తెలియదు పాపం ఆయనకు. విస్తట్లోనుంచి దూరంగా పెట్టాడు రఘు.

"సుభద్రే చేసిందే. పాపం పాకం కుదిరిఉండదు" చిన్నాదబడుచు చటుక్కున అన్నది.

అప్పటిదాకా విడిగా తీసిపెట్టినవి నెయ్యి వేయించుకుని తింటున్నాడు రఘు.

"ఏం... వదిన పేరు చెప్పగానే ఎక్కు తున్నాయేం రఘూ?"

అవాక్కైపోయింది సుభద్ర. ఆవిడ మాటల్లో వెటకారం, మరేవేవో అర్థాలు.

బర్మాముడి, ఆర్టిఫిషియల్ దిద్దులు, తెల్లటి ఛాయ, మొహానికి రాసే రోజా రంగు పౌడరు-ఇవన్నీ బస్తీలో ఉండి వచ్చే ఆవిడలక్షణాలు. ఆవిడకు యావత్తు ప్రపంచం మీదా ఎందుకో తెలియని అసూయ. ఎప్పుడూ ముక్కు చిట్లించి కళ్ళద్దాలలోనించి చూస్తూ తప్పులు వెదక డానికి ప్రయత్నిస్తూనే ఉంటుంది. ముగ్గురు పిల్లలు, మంచి భర్త ఉన్నా ఆవిడ ఎప్పుడూ ఎవరిమీదో ఒకరి మీద తన అసూయ గుమ్మరిస్తూనే ఉంటుంది. ఒక దీపావళి పంచక్కి పులిహోర కలిపితే, చాటుగా ఆవిడ అందులో గుప్పెడు ఉప్పు కలపడం చూసింది సుభద్ర. ఎవరికిచెపుతుంది? దాని వెనుక వస్తువు పాడవడం కన్నా, మరో ఆడదానికి పేరు రాకూడదనే అసూయ ఉంది. ఆవిడ పుట్టింటికి వచ్చినప్పుడల్లా ఆమె పట్ల





బహు జాగ్రత్తగానే ఉంటుంది సుభద్ర. ఆమె ఉన్నన్నాళ్లూ ఆమెకన్న నదురుగా ఎక్కడ కనిపిస్తానోనని వేలిముడిలోనూ, జిడ్డు ముఖంతోనూ ఉంటుంది. "ఏమిటా మడ్డి స్వరూపం? నా కూతురు చూడు" అని అత్తగారు కేకలేసినా లక్ష్యపెట్టదు. ఈ మాటల కన్నా ఆడబడుచు అసూయ సహించలేనిది. అటువంటి మనిషి ఇవ్వాళ భళ్ళున ఒక మాట అన్నది. ఆ మాట అప్పుడు ఎవరూ పట్టించుకోనట్లున్నా అనుమానబీజాలు మాత్రం నాటబడ్డాయి.

"నీతీ జాతీ లేని ఆడవాళ్ళ వల్ల కొంపలుకూలుతాయమ్మా!" అని దీర్ఘాలు తీస్తూ మాట్లాడేది అత్తగారు.

"రఘు భోజనానికి రావడం లేదు. పిలువమ్మా!" అతి వంకరగా అనేది ఆడబడుచు.

అది గ్రహించింది సుభద్ర. ఎవరూ బైటపడకపోయినా ఆ గాలిలో, ఆ గుసగుసల్లో తన చుట్టూ ఏదో కథ అల్లుతున్నారని చెప్పకుండానే అర్థమయ్యేది సుభద్రకు.

అందుకే, వాళ్ళుండగా అతనితో జనాంతికంగా మాట్లాడేది. వాళ్ళు లేనప్పుడు అసలు పట్టించుకునేది కాదు. అది తెలివితక్కువ నిర్ణయమని ఆమెకు అప్పుడు తెలియదు. మనుషులు నింద వెయ్యడానికిఆధారమక్కర్లేదని,రఘులో ఎందుకో పుట్టిన ఈ కార్చిచ్చు తను నిర్లక్షం చెయ్యడం వల్ల మరింత భగ్గుమంటోందని ఆమెకు అర్థం కావడానికి కొద్ది రోజులు పట్టింది.

కార్తీకమాస స్నానాలతో, మనసుకు, శరీరానికి కూడా అలుపుతో జ్వరమొచ్చింది సుభద్రకు. ఆమెను పెద్దగా పట్టించుకున్నవారెవ్వరూ లేరు. జ్వరం ఉన్నన్నాళ్ళూ లంఖణాలు, ఆ తరవాత చింతకాయ పచ్చడితో పథ్యం—ఇది మామూలే. ఆ రాత్రి ఆమెకు విపరీతమైన జ్వరం. భర్త పనిమీద బైటకు వెళ్లాడు.

ఆమె చెయ్యిని ఎవరో ముట్టుకున్నట్లయింది. చటుక్కున లేచింది కాళిలా... రఘు..ఆమెజ్వరంచెయ్యినికళ్ళకుఆనించుకున్నాడు. ఒక్కసారి గుండె గుభేలుమంది...'ఇంటినిండా జనం. ఈ రాత్రి వేళ ఇతన్ని ఎవరైనా చూస్తే!? అయినా ఈ అబ్బాయికి నా గురించి పట్టదా?' అనుకున్నది. ఒక్కసారిగా చెయ్యి గుంజుకున్నది. దుఃఖం, రోషం—ఆమె ఏం చేస్తోందో ఆమెకే తెలియదు. కుంపటి మీదనుంచి పాలు దించి, అట్లకాడ కాల్చి ఆ చేతిమీద వాత పెట్టుకున్నది. ఆ చెయ్యి కోసేయాలన్నంత కచ్చ. వెనకాలే వచ్చినట్లున్నాడతను "వదినా!" అని ఒక్క అరుపు అరిచి చటుక్కున అట్లకాడ లాక్కున్నాడు.

లైటు వెలిగింది.

"ఏవమ్మా? ఏమిటి రాసక్రీడలూ... అసలే జ్వరం కదా ?!" ఆడబడుచు కళ్ళల్లో రాక్షసానందం, ఏదో కూడని పని చూశానన్న శాడిస్టిక్ తృప్తి. ఏమైందో తెలియకుండానే సుభద్ర కళ్ళు తిరిగి పడిపోయింది. ఆమెకు మామూలు తెలివి తెలిసేటప్పటికి రెండు రోజులైంది. ఇంటిల్లిపాదీ ఆమెను దోషిని చూస్తున్నట్లు చూస్తున్నారు.

తులసికోటకు తలవాల్చి, జుట్టు విరబోసుకుని ఆకాశంలోకి చూస్తూ కూర్చుంది సుభద్ర. 'భగవంతుడా... ఏమిటీ పరీక్ష నాకు ?' ఆమె గుండెలు మండిపోతున్నాయి.

అప్పటికి పది రోజులుగా భర్త

పొలం వెళ్ళిపోతున్నాడు రాత్రిళ్ళు. పొడి పొడిగా మాట్లాడుతున్నాడు.

ఆ రాత్రి చెప్పులు వేసుకుని వెళు తున్నవాడిని మెల్లిగా ఆపింది.

కలంకారీ చీరలో కళ్ళకాటుకతో దేవతలా ఉన్నది ఆమె. కానీ, అతనికి పెద్ద చెల్లెలు, తల్లి చెప్పిన మాటలు వంట బట్టాయి. వాళ్ళు కాలక్షేపానికి అన్నట్లుగా రాద్ధాంతం చేసినా, ఆమె జీవితాన్ని ఆ మాటలు కాలనాగుల్లా కాటు వేశాయి.

"నువ్వేమనుకోకు ... వాళ్ళు ఏవేవో అన్నారు. అయినా నేను నీకేం లోపం



చేశాను? ఏమైనా, నా మనసు సమాధాన పరచుకునేదాకా నిన్ను ముట్టుకోలేను..." గోడ పట్టుకుని ఎటో చూస్తూ నాలుగు మాటలు మాట్లాడి, చీకట్లో బేటరీలైటు తీసుకుని వెళ్ళిపోతున్న అతన్ని చూస్తూ గోడకు అలాగే చేరగిలపడిపోయింది

ఆమె.

"దేవుడా! నేనేపాపం చేశానని నాకీ శిక్ష?" అని గుండెలు అవిసేలా ఏడిచింది. చచ్చిపోదామనుకున్నది. చచ్చిపోతే తన నేరం మరింత ఎక్కువగా చిత్రీకరిస్తారేమో అని ఆగింది.

అంత దుఃఖంలో కూడా 'పాపం రఘు ఈ విషయం వింటే చచ్చిపోతాడు...' అనుకున్నది.

'బావనీ...నాకేం ... అసలు ఇదంతా అతని మూర్ఖత్వం మూలంగా కాదూ!' ఆలోచిస్తూ దుఃఖపడుతూ నరకం

అనుభవిస్తోంది ఆమె. నేను ఏ తప్పూ, ఏ పాపం ఎరుగనని భర్తకు ఎలా చెప్పాలి? దేముడిలాంటి ఆ మనిషిని బాధపెట్టి నేనేం బావుకుంటానని?! భగవంతుడా! నాకే దన్నా శిక్షవెయ్యి....ఇలా ఆలోచిస్తోందామె.

అదే ఈ గడ్డమీద పుట్టిన స్త్రీలోని విచిత్రం. ఆమెలో నీతి ఎంత మత్తులా పని చేస్తుందంటే, చెయ్యని తప్పుని ఆపాదించుకుని శిక్ష విధించుకోగల శక్తి ఆమెకు ఉంటుంది. మరి ఇది చూసిన సర్వేశ్వరి గుళ్లో దీపం వెలుగుతూనే ఉన్నది. నదీ నదాలు ప్రవహిస్తూనే ఉన్నాయి. పువ్వులు, వెన్నెల వికశిస్తూ వెలుగుతూ నేఉన్నాయి. వీటన్నింటి అంతర్యం రంగరించుకుని, పవిత్రత కోసరం చందనపు కట్టెలలో సజీవ దహనమయ్యే స్త్రీమూర్తి ఆత్మాహుతి ఏ ధూళిగా మారి ఆ ఈశ్వరత్వాన్ని చేరుతుందో?!

అంతర్యం నిద్రలేచిందంటే అది కార్చిచ్చు. తనను తాను చెయ్యని తప్పుకు హారతిగా అర్పణ చేసుకుంటున్న ఆమెకు, అమాయకుడైన తన భర్తను రక్షించమని ప్రార్థించి ఉపవాసాలు చేస్తున్న ఆమెకు, ఒకరోజు మధ్యాహ్నం వడ్లగది పక్కన పాలేరు పెళ్లాం రంగితో తప్పుచేస్తూ కన పడిన భర్తను చూడగానే, చరాచర ప్రపంచం వణికి ముక్కలైపోయినట్లని పించింది. ఆమెలో రక్తం గడ్డ కట్టుకుపోయింది.గిరుక్కున వెనుదిరిగి గదిలో కుప్ప కూలిపోయింది. "ఆడదే కట్టు దాటుతున్నప్పుడు, ఉప్పూకారంతినే మొగవాడు చస్తాడా" అత్తగారికి తెలుసుకాబోలు ఆమె వినేట్లు అంటోంది. పొయ్యి కట్టెల మంటలో ఎసరులా కుతకుతలాడుతోంది

మెదడు కాలిపోతున్నట్లనిపిస్తోంది. గడ్డం మోకాలు కానించి అలాగే కూర్చుండి పోయింది.

"రఘు నీకేమన్నా చెప్పాడే అమ్మాయీ ?"

మెల్లిగా తలెత్తి చూసింది. అత్తగారి మాటల్లో ఎన్నో అర్థాలు.

"ఊరెళ్ళాడు. కాలేజీలో చేరతాడట. ఇప్పుడప్పుడే రాను. నా పొలం డబ్బు పంపించమని రాశాడు" చెప్తోంది ఆవిడ. విని ఊరుకున్నది సుభద్ర.ఎంత హాయిగా వెళ్ళిపోయాడు?! కానీ ఆలోచిస్తున్నకొద్దీ అతనిమీద కోపం రావడం లేదామెకు. శరీరాన్ని, మనసును అప్పగించిన భర్త, చాకిరి పొందుతున్న అత్తగారి కుటుంబం- వీళ్ళలో ఎవరికి నిజాయితీ ఉందని? ఎవరు తన దుఃఖాన్ని పంచుకుంటున్నారని?!

ఆ వెలుతురులేని తాటాకు వంటవసారాలో ఆమె కన్నీళ్లు అలికిన నేలకు, ఆ అగ్ని దేముడికి అంకితమైపోయాయి.

ఎన్నో రాత్రులు అలా శూన్యంలోకి చూస్తూ పడుకున్నది. కళ్లు నెప్పులు పుట్టేదాకా నక్షత్రాలు లెఖ్ఖపెట్టేది. మనసు నిద్రపోయేదాకా పంచాక్షరీ మంత్రం చదివేది. ఎక్కడో ఈ అండాండంలోని పవిత్ర భారతదేశంలో, ఆంధ్ర రాష్ట్రంలో మారుమూల పల్లెటూళ్లో దురదృష్టవంతురాలైన ఒక స్త్రీమూర్తి దుఃఖంలో చేసే ఆ పంచాక్షరీ జపం ఆ పరమ శివుడికి వినబడిందో లేదో కానీ అర్ధరాత్రివేళ ఆమె భుజంమీద పడ్డ బరువైన చేతి స్పర్శకు ఉలిక్కిపడి లేచింది. భర్త...

నా పవిత్రత మీద నమ్మకం మొచ్చిందా? నాకన్నా పవిత్రులైన ఎంత మందిని ముట్టుకున్న తరవాత ఈ నమ్మకమొచ్చింది ? నేను నీ భార్యనా ? వాళ్లలో ఒకదాన్నా?! నేనేరకంగా నీకు

ఎక్కువ?!'

ఇన్ని మాటలు ఒక్కసారిగా సంధించిన బాణాల్లా ఆమెలో ఎక్కుపెట్టి నిలబడ్డాయి. పరా, పశ్యంతీ మధ్యమా- ఇవి దాటిన ఆమాటలు మంత్రాక్షరాలై వైఖరీ రూపం ధరించలేదు. కారణం అవి సంఘ స్వరూపాన్ని కూకటివేళ్లతో కదిలించి, యాసిడ్‌తో కాలుస్తాయి. అంతపని ఆమెలో క్షమ కలిగిన నారీత్వం చెయ్యనివ్వదు. సంఘం పూజించే నైరాస్య దేవతలు, కర్మమూర్తులు ఎప్పటికప్పుడు స్త్రీలోని భావాను అణిచి, ఆత్మాభిమానాన్ని జోకొట్టి, సాంప్రదాయాల పొరలమధ్య సమాధికట్టి పూజచేసిగౌరవించాం పొమ్మంటారు. అందుకే ఆరాత్రి సుభద్ర నిర్లిప్తంగా లొంగిపోయింది. కానీ తన చేతుల్లో నలుగుతున్నది చిలిపిగా, సౌందర్యదీప్తితో ఆత్మసౌందర్యంతో వెలిగే స్వర్ణమూర్తి సుభద్ర కాదనీ, సర్వస్వాన్ని ఈశ్వరార్పణం చేసి, కేవలం పాంచభౌతిక శరీరాన్ని కోరికలు తీర్చే సమిధగా మారిన సుభద్ర అని అతనికి తెలియదు. కనీసం ఆ ఆలోచన కూడా రాలేదు.

కామం శ్మశానాగ్ని లాంటిది. దానికి చందనపుకట్టెలా, పన్నీటిపువ్వులా, తుమ్మచెక్కలా అని ఆలోచన ఉండదు. కాల్చడం ఒక్కటే తెలుసు. సగటు మగవాడి కోరికకూ అంతే తెలుసుమరి.

సుభద్రలో అన్నీ చచ్చిపోయినా, ఆప్యాయత అణిగిపోలేదు. ప్రతి ఒక్కరినీ అదే ఆప్యాయతతోఆదరించేది.

ఇంతకథకూ ఎదుగుతున్న విరించి ప్రత్యక్షసాక్షి. అతనికి ఈ కథలో చాలావంతు తెలుసు. అందుకే వదిన దేవత అతనికి. ప్రతి స్త్రీమూర్తిలోనూ ఆవిడను దర్శించడానికి ప్రయత్నించేవాడు.

అప్పుడప్పుడు రఘు డబ్బుకోసరం వచ్చి రెండు రోజులు ఉండిపోయేవాడు. కాలగర్భంలో అనుమానాలు, కావేషాలు కలిసిపోయినా, సుభద్రలో వెనకటి ఆ సజీవమూర్తి లేదు. రఘు ఆమెతో మాట్లాడేవాడు కాదు.

పట్నంలో చదువు పూర్తిచేసుకోగానే అక్కడే ఎవరో అమ్మాయిని పెళ్ళి చేసుకున్నానని ఇంటికి పిడుగులాంటి ఉత్తరం రాశాడు రఘు.

ఇంట్లో అందరూ ఏకమై చాలా సేపు చర్చించుకున్నారు. కానీ ఆర్థికంగా స్వతంత్రుడూ, మొండివాడు అయిన అతన్ని ఇదేమిటి అని ఎవరూ అడగలేరు. ఆకోపం ఆ పెళ్ళికూతురు మీదికి తిప్పుకుని 'ఎలాంటిదో, ఏ మత్తు పెట్టి వల్లో వేసుకుందో. సినిమా పిల్లేమో' అంటూ రకరకాల వ్యాఖ్యానాలు చేసి తృప్తిపడ్డారు. సుభద్ర ఏవిషయంలోనూ కల్పించుకోలేదు.

రఘు పెళ్లైందని తెలియగానే పనిగట్టుకుని చూడ్డానికి వెళ్లాడు విరించి. తెల్లగా, నాజూగ్గా, ఒంకుల జుట్టుతో— చాలా బావుంది చిన్న వదిన లక్ష్మి. రెండు రోజుల్లోనే ఆమె చాలా అర్థమైపోయింది అతనికి. ఆమెకు కోపం ఎక్కువ. మెటీరియలిష్టిక్‌వర్ల్డ్ మీద విపరీతమైన కోరిక, డబ్బున్న అహం, అనాగరికత అంటే అసహ్యం – ఇవన్నీ నచ్చలేదు విరించికి. ఆమాట అనలేదుకానీ రఘుతో "ఇంట్లో ఎవరికీ చెప్పకుండా ఇంత తొందరపడ్డావేమిటిరా?" అని మాత్రం అన్నాడు.

"ఏమని చెప్పాలి? అయినా ఎందుకు చెప్పాలిరా? చాలు...ముందు కారు, ఇల్లు బ్యాంకు బాలన్సు ఉన్న పిల్ల కావాలను

కున్నాను. దొరికింది. అంతే. తండ్రితప్ప ఎవడూ లేదు. ఆయన రిజిస్టర్ మారేజీకి ఒప్పుకున్నారు. జరిగిపోయింది."

"నీకు మేం అందరం ఉన్నాం కదరా!" కొంచెం బాధ అనిపించింది విరించికి రఘు మాటలకు.

"ఒరేయ్...ఒక విషయం చెప్పనా విరించీ? ఈ పదేళ్లు ఇంటికి దూరంగా ఈ మహాపట్నంలో ఉండి చాలా నేర్చుకున్నాను నేను. అన్నీ బావుంటే అందరూ ఉంటారు. కానీ మనకేం కావాలో ఎవరికీ అక్కర్లేదు. ఎంతసేపూ వాళ్ళ లెక్కల ప్రకారం మనం ఉండాలనుకుంటారు. ఆరకంగా మనని వాళ్ళ చట్రాల్లో బిగించి సుఖపెడదామనుకుంటారు. మనం దొరక్క తప్పించుకుంటే, ఎదురుతిరిగామని ఏడుస్తారు. ఈ బంధుత్వాలు, ఆప్యాయతలు, ఈ వ్యవస్థ..." అతని ఆవేశానికి నవ్వుకున్నాడు విరించి.

"చిన్నక్కయ్య నువ్వు తన పెళ్ళికి లాంఛనాలివ్వలేదని గోలచేస్తోందిరా!" నవ్వుతూ అన్నాడు.

"ఆవిడకా! ఆఁ! ఇస్తాను లాంఛనాలు రమ్మనమను. ఒరేయ్... ఒక విషయం. వీళ్ళెవరూ నాకు కనబడకుండా ఉంటే ఆరోగ్యం." అతని మాటల వాడి వెనకాల కాలే అతని ఆంతర్యముంది. సుభద్రకు జరిగిన అన్యాయమున్నది. విరించికి అర్థమైంది.ఎవరేం చెయ్యగలరు? రఘు మగవాడు కాబట్టి తప్పించుకున్నాడు. వదిన ఎలా తప్పించుకోగలదు? కనబడ్డప్పుడల్లా మాట్లాడుకోవడాలు, ఆడపడుచుగా, ముత్తైదువులుగా కూర్చుని వాయినాలు అందుకోవడాలు అన్నీ మామూలే. ఇప్పటికీ వదిన చిన్నక్క కాళ్ళకు దణ్ణం పెడుతుంది. పండగనాడు భర్త కాళ్ళకు దణ్ణం పెడుతుంది.

తనలో జీవిని అంతర్ముఖం చేసుకుని తనకు జీవితేచ్ఛను చంపేసిన ఈ మనుషులకు తనువు వంచి నమస్కరింపచేసే ఈ వ్యవస్థలో ఏదో గొప్ప ఔన్నత్యమన్నా ఉండాలి, పర్వర్టిజం అన్నా ఉండాలి. మా ఇంటి మరో కోడలు లక్ష్మి. ఆమెకు ఏ సెంటిమెంటూ పెద్దగా లేదు. అందుకే వదినలా ఏ బాధ్యతా, ఏ నిందా కూడా మొయ్యదేమో! కానీ, సుభద్ర అంటే ఆరాధించిన రఘు మరి లక్ష్మిలాంటి సరిగ్గా వ్యతిరేకమైన అమ్మాయిని ఎలా ఇష్టపడ్డాడో!

"చిన్నవదిన ఎలా దొరికిందన్నయ్యా?" గబుక్కున అడిగేశాడు ఆలోచనలలోనుంచి.

"సింపుల్. అందరికీ సుభద్రలు దొరకరుకాబట్టి" నోట్లో సిగరెట్టు పెట్టుకుంటూ, ఒకచేత్తో కారు డ్రైవ్‌చేస్తూ అన్నాడు.

అవాక్కైపోయాడు విరించి. ఏమిటి వీడి ఉద్దేశ్యం? అంటే, వదిన చెయ్యని నేరానికి శిక్ష అనుభవించింది తనవల్లే కాబట్టి, తనచుట్టూ అభేద్యమైన కోట కట్టుకుని, అందులో ఎవర్నీ అడుగుపెట్టనీయకుండా ఒంటరిగా అందులో కుమిలిపోతున్నాడా వీడు ? అందుకే భార్యగా అధికారాలు చెలాయించే అమ్మాయి, తన మనసు గురించి ఆలోచించని అమ్మాయిని చేసుకుని తనకు తను శిక్ష విధించుకున్నాడా?! తలతిరిగిపోయింది విరించికి ఏదో అడుగుదామనుకునేలోపల.

"దిగు...స్టేషన్ వచ్చింది. అందర్నీ అడిగానని చెప్పు" కారు రివర్స్ చేస్తూ వెళ్లిపోతున్న అన్నగార్ని చూస్తూ నిలబడి




పోయాడు విరించి.



ఈ కథంతా గుర్తుకువచ్చింది విరించికి. అలా పడుకున్న సుభద్రవంక కన్నార్పకుండా చూశాడు. కళ్ళకింద చారలు, తలలో అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలు, నీతితాలూకు కోటలో నిద్రపోతున్న ఆత్మ...పిల్లలులేని ఆ మాతృమూర్తికి అందరిమీదా ఆప్యాయతే. ఇప్పటికీ ఆమె మారలేదు... సహనంపోలేదు. పక్షవాతం వచ్చిన అత్తగారికి, కీళ్లవాతం వచ్చిన మామగారికి సేవచేస్తూనే ఉన్నది. చేస్తున్న ప్రతిపనీ పూజలా చేస్తోంది. ఈ అనంత జీవనయాత్రలో ఇది ఒక మజిలీ అని ఆమె అనుకోవడం లేదేమోకానీ, ఆమె జీవన విధానం మాత్రం అదే.

"నువ్వు ఏదన్నా ఉద్యోగం చెయ్యరాదూ?" అని వదిన కేకలెయ్యగానే, ఎవరో స్నేహితుడి రికమండేషన్ మీద ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా జీవితం ప్రారంభించి, ఒక పేరెన్నికగన్న పత్రికలో స్థిరపడ్డాడు.

• • •

"విరించీ! కాఫీ తాగుదాం రా!" అని పిలిచాడు రాఘవ. అతను సబ్ ఎడిటర్ అయినా దాదాపు 'ఈతరం' పత్రికకు జీవనాడిలాంటివాడు. అతనంటే మహా ఆకర్షణ విరించికి. అతనిలోని మేధావి అంటే కొంచెం భయం కూడా. ఏదోరాసి, నాలుగు డబ్బులు జేబులో వేసుకుని పోకుండా చాలా విషయాలు చర్చనీయాంశాలుగా చేసి పాఠకుల ముందు పెట్టి ఒక్కొక్కసారి చిక్కుల్లో ఇరుక్కుంటాడు కూడా అతను. కానీ, దేనికీ భయపడడు. మేరుసమానధీరుడు. తక్కువ మాట్లాడి, ఎక్కువ చెబుతాడు.

కాఫీతాగుతూ రాఘవ టేబిల్ మీదకు ఒంగిచూశాడు. ఆత్మలు ఉన్నాయా లేవా అని వచ్చేవారానికి చర్చనీయాంశం కాబోలు తయారు చేస్తున్నాడు.

"ఏమిటిసార్ ఈగోల? దిక్కుమాలిన ఆత్మలు ఉంటేమనకేల? పోతే మనకేల?" అన్నాడు సాగదీస్తూ విరించి.

నవ్వేశాడు రాఘవ.

"అందుకే నువ్వంటే నాకిష్టం"

"దేనికి? దిక్కుమాలిన ఆత్మలు అన్నందుకా?"

"కాదు! నువ్వు ఏది చెబుదామనుకుంటావో, సరిగ్గా దానికి రివర్స్‌లో మాట్లాడతావు"

"అదేం గొప్పకాదు. అసలు ఏది ఆలోచిస్తున్నామో దానికి వ్యతిరేకంగా మాట్లాడేవాళ్ళు, మనకు గురుతుల్యులు, హిపోక్రసీలో డాక్టరేట్ ఉన్నవాళ్ల చాలా మంది ఉన్నారు"

సన్నగా నవ్వేశాడు రాఘవ. ఇంతలో ఎవరో యువకవి వచ్చాడు.

రావడమే చాలా దూకుడుగావచ్చాడు. కుర్చీ బర్రున లాగి కూర్చున్నాడు. అతన్ని చూడగానే ఫైలులోనించి ఏదో కాగితాలు తీసి ఇస్తున్నాడు రాఘవ.

విరించి చుట్టూ చూశాడు. మామూలు చెక్కబల్లలు, కొన్ని గ్రాద్రేజ్ కుర్చీలు, వాటిమీద ఏమాత్రం కళాత్మకంగా లేని

రబ్బరుస్టాంపులు, జీవంలేని ఫైళ్ళు, వాటి ఎదకు వంగి నిరాసక్తిగా పనిచేస్తున్న మనుషులు-కానీ వీళ్లందరి సమ్మేళన శక్తి నుంచి ఒక గొప్ప పత్రిక వెలువడు తోంది. దాని వెనకాల మేధస్సు రాఘవ లాంటివారిది.

"మేం అచ్చేసుకోం అంటే ఎలా సార్ ?! నేను నా కవిత్వాన్ని శ్రీశ్రీకి అంకితం చేశాను. ఆయన పోయిన సంవత్సరమిది...." అరుస్తున్నాడతను గట్టిగా.

"సారీ! దానికీ, దీనికీ సంబంధం లేదు..."

"ఎందుకు బాగా లేదసలు?" మొహం నిండా కండలు చింపుకుంటూ అడిగాడు. అతన్ని పరీక్షగా చూశాడు విరించి. మంచి ఖరీదైన పాంటు షర్ట్,వేలికి రవ్వల ఉంగరం, కారాకిళ్లీ, షోగ్గా కనిపించాలనే ప్రయత్నం... చేతిలో ఆకలి కవిత్వం.

రాఘవ ఏం చెబుతాడో చూద్దామని అతని వంక చూశాడు.

"అది పబ్లిష్ చెయ్యడానికి అనువుగా లేదు"

"ఆ విషయం చెప్పడానికి మీరెవరు? అసలు ఏమిటి లోపం?!" సంస్కారం మరిచి, అది పత్రికా ఆఫీసు అనిగూడా తెలియకుండా అరుస్తున్నాడతను.

రాఘవలో అణుచుకున్న కోపం తీక్షణమై పోయింది. "మీరు రాసినది కవిత్వం కాదు. మాటల్ని పేర్చడం. మొదటి లైనుకూ, తరవాతి లైనుకు అసలు సంబంధం లేదు. అందులో హృదయ ముంటే కవిత్వమౌతుంది. కానీ, మీరు రాయాలని రాసినట్లుంది. పేరు కోసరం కలాన్ని రుధిరాగ్ని, పతురక్తం, ఎర్ర సూర్యుడు - లాంటి పదాలతో భ్రష్టం చెయ్యొద్దు. మాదే కాదు ఏ పత్రికా వేసుకోదు..."

"ఆ విషయం చెప్పడానికి మీరెవరు?! ఎవరూ వేసుకోకపోతే నేను స్వంతంగా అచ్చేసుకుంటాను. ఎవరు కాదంటారు? అయినా, శ్రీశ్రీకి అంకితమిచ్చిన కవితను మీరు కాదన్నారని అల్లరి రేపగలను నేను..." ఉద్రేకంతో చేతులు బారలు చాపుతూ అంటున్నాడతను.

ఒళ్లు మండిపోయింది విరించికి.

"శ్రీశ్రీ మీకు తెలుసా?"

"ఆఁ!"

"ఎలా?"

"ప్రతి విప్లవ కవికీ ఆయన ఆదర్శ పురుషుడు..."

"విప్లవం అంటే ఏమిటి?"

"అన్యాయానికి ఎదురు తిరగడం. ఏం చిన్న పిల్లాడిని అడుగుతున్నట్లు అడుగు తున్నారు?" గట్టిగా అన్నాడు.

ఆ హాల్లో అందరూ అవాక్కై వింటు న్నారు... గుండుసూది పడితే వినబడే టంత నిశ్శబ్దమైపోయింది.

"ఇంతవరకు మీరు ఏ అన్యాయాలకు ఎదురు తిరిగారు?"

"అంటే?"

"పోనీ, శ్రీశ్రీ రాసిన కవిత్వం ఎంత వచ్చు? ఏ పతితలకు, బాధాసర్పద్రష్ట లకు సహాయం చేశారు మీరు? ఎవరి కన్నీళ్లు పంచుకున్నారు?! ఏ మానసిక దుఃఖాన్ని ఓదార్చారు?! ఆచరించిన పని చెప్తే మంత్రంలా పనిచేస్తుంది. దానికి అక్షరం సౌందర్యాన్ని ఇస్తుంది. అప్పు డది కవిత్వమౌతుంది. కనీసం ఆయన కవితను అందంగా కాపీ కొట్టడం కూడా రాదే మీకు..." ఉద్రేకంతో ఊగి పోతున్నాడు విరించి.




మెల్లిగా అతని భుజం మీద చెయ్యి పడింది. రాఘవ నవ్వుతూ అతన్ని చూశాడు. అందులో ప్రశంస ఉంది... ఉద్రేకం తగ్గించుకోమనే అర్థింపుఉంది... ఇది బాధ్యతాయుతమైన ఆఫీసు అన్న మందలింపు ఉంది.

తగ్గిపోయాడు విరించి.

"మీ పత్రిక కాబోతే మరొకటి" విసురుగా ఫైలు తీసుకుని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడాకవి.

విరించి దగ్గరకు వచ్చి నిలబడ్డాడు విశ్వనాథం. ఆయన ఆ పత్రిక మూల గ్రస్తుల్లో ఒకడు. ఆయన కళ్ళల్లో తెలియని ఆనందం. ఆయనా, శ్రీశ్రీ మంచి స్నేహితులు. ఆయన పోయిన దుఃఖం ఆ కవిమిత్రుడి హృదయంలో ఆరని మంటగా మిగిలిపోయి ఒక గొప్ప ఎడిటోరియల్ రాయించింది.

"విరించీ! కృష్ణుడు గోవర్ధన గిరి ఎత్తినప్పుడు దాని కిందికి గోవులూ చేరాయి, పాములూ చేరాయి అంటారే... అలాగే వీళ్ల సంగతీనూ" అన్నాడాయన. మెల్లిగా వెళ్లి సీటులో కూర్చున్నాడు.

వాతావరణంలో ఇంకాబిరుసు తగ్గలేదు. ముఖ్యంగా రాఘవ ఉద్రేకం అణుచుకోవడం వల్ల మరింతగంభీరమైపోయాడు. అదేనేమో అతనిఅందం...మనిషి నిజమైన స్థిరమైన సౌందర్యానికి కారణం జ్వలించే మేధస్సు. విశాలమైన ఫాల భాగం, మత్తుగా ఉండే కళ్లు, సన్నటి పెదవులు— అతను ఇలా ఉంటాడు అని చెప్పలేం. ఏ వేషం వేస్తే ఆ వేషానికి సరిపోయే గొప్ప మోల్డింగ్ ఉన్నముఖం అతనిది. అతను మరి అంతేనో, నటిస్తాడో కానీ చాలా సింపుల్‌గా కనబడతాడు.

అలాచూస్తూ గబుక్కున నవ్వేశాడు విరించి. ఆశ్చర్యంగా తలెత్తాడు రాఘవ.

"గురువుగారూ! మీకొక విషయం తెలుసా? ఇవ్వాళ మిమ్మల్ని వెతుక్కుంటూ ఒక అమ్మాయి వచ్చింది"

వాతావరణం చల్లబడింది.

"నన్నా? ఎందుకు?"

"ఆ....ప్రేమిద్దామని''

మొదట అర్థంకాక, తరవాత చటుక్కున నవ్వేశాడు రాఘవ.

"తీరికలేదని చెప్పండి...''

"గొప్ప అపరాధం సార్...వనిత తనంతతావలచి వచ్చిన...''

"ఇంతకీ ఏమిటి విషయం?"

"నిజంగానండీ!"

"రేపు మళ్ళీ వస్తుందిగా – నువ్వేం అన్నావని చెపుతాలే"

''సార్..సార్! చీరెయ్యగలదు. అదేం లేదు.మీ ఎడిటోరియల్స్ అవీ చదివిందిట. మిమ్మల్ని చూడాలని వచ్చింది పాపం" రాగయుక్తంగా అన్నాడు.

"చేతిలో ఏదన్నా ఫైలు...''

"ఉందండి ...పర్సు, ఫైలు''

"అయితే ఎవరో అభ్యుదయ రచయిత్రి"

"ధా పాపం..." చాలా జాలిగా అన్నాడు.

"ఎవరికట?" తలెత్తి నవ్వుతూ అన్నాడు రాఘవ.

"పొండి గురువుగారూ! ఏదో గొప్ప థ్రిల్ క్రియేట్ చేద్దామనుకుంటే..."

"నాకా...థ్రిల్ ఉన్నవాళ్ళం పత్రికలకు సబ్ ఎడిటర్లమేమిటయ్యా! ఈ సీటుకుంది విలువ. మాకు కాదు. అదంతే. ఊఁ! ఇంకా ఏమిటి విశేషాలు?''

విరించి ఏదో ఒకటి చెపుతాడు. లేక



పోతే విరించే కాడు.

"సార్! 'లేచిపోవుట' మీద మీ అభిప్రాయం ఏమిటి సార్!" చాలా సిన్సియర్‌గా అడిగాడు.

అప్పుడే టైం అయిందని చాలా మంది సీట్లు ఖాళీచేసి వెళ్ళిపోతున్నారు.

"ఎందుకుట? ఎవరు ఇప్పుడు నీతో ఆ పని చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు?"

"మా పక్కింటి సుమైతాంగి"

"అదేం పాపం?!"

"మంచి ఉద్యోగం. షిఫాన్ చీరలు, సెటిల్‌మెంటు ఉన్న ఉద్యోగం... థ్రిల్ లేదుట పాపం. ప్రేమిద్దామని ప్రయత్నించింది. నేను కొరుకుడు పడలేదు.

పోనీ పెళ్ళి చేసుకుందామని ప్రయత్నం"

"ఏది...నిన్నే?"

"ఆ! నాకన్నా ఏడేళ్ళ పెద్దది సార్. అయినా షేక్స్‌పియర్ చేసుకోలే"

"మధ్యలో ఆయనెందుకు కానీ, మరి లేచిపోవడం అంటావేమిటి?"

"అదా ?! సుమైతాంగినికి మనం లొంగుతే మా ఇంట్లో టాప్ లేచిపోవడం సార్"

పెదవి నొక్కిపట్టి నవ్వుతున్నాడు కళ్ళతో రాఘవ. అతని కళ్ళల్లో విరించి అంటే ఉండే ఆప్యాయత వెలుగుతోంది.

"అదీ సరే సార్... ఆదివారం మా ఇంట్లో రచయితల మహాసభ. రూం చిన్నది. కాబట్టి అర్హమైనవారిని తీసుకు



"రావద్దని ప్రార్థన" చెప్పిపోబోయాడు విరించి.

* * *

"విరించీ! ఇవ్వాళ నీకొక వింత వ్యక్తిని చూపిస్తాను. ఆశ్చర్యపోతావు"

తన గదిలో ఉన్న రెండు కుర్చీలూ ఇంటిగల బామ్మగారిని కాపాడమని అప్పజెప్పి, ఆవిడనే వేడుకుని రెండు చాపలు అడిగి తీసుకుని, ఎదురుపడ్డ సుమైతాంగి కళ్ళజోడులోనించి ఇచ్చే సందేశాల్ని తప్పించుకోడానికి భరత నాట్యం చేసినంత పనిచేసి గదిలో పడ్డ విరించి, ఎదురుగా కూర్చునివున్న రాఘవ మాటలకు ఉలిక్కిపడ్డాడు.

"మీకూ, నాకూ కూడా వింతగా కనిపించే వ్యక్తా సార్?మనిషే....?" తల మీద దుమ్ము దులుపుకుంటూ ఆశ్చర్యంగా అన్నాడు విరించి.

ఆకాశం అప్పుడప్పుడే చల్లబడదామని ప్రయత్నిస్తోంది. అరవ మామి వాళ్ళింట్లో సందె ముగ్గు వేస్తున్నారు. దాహం తీరిన నేలలో ఏదో మాదకత.

"ఎవరు సార్ ఇంతకీ?" చాపలు సర్దేసి, మంచి నీళ్ళు తెచ్చేసి, అప్పు అడిగిన ఫ్లాస్కు నిండా కాఫీ పోసేసి మెల్లిగా అడిగాడు విరించి.

"చూద్దువుగానిగా...బైదిబై. నీ పర్మిషన్ లేకుండా ఈ నీ సభకు ఆహ్వానించేశాను మరి..నిన్నే చెప్పావు కూడా"

"దానేముంది సార్..పుష్పక విమానం ఈ గది. ఇంతకీ ఎవరు సార్?"

"నమస్కారం..." రెండు చేతులు జోడించి నమస్కారం చేస్తున్నదామె గుమ్మం దగ్గర నిలబడి.

"సార్... ఈవిడే..."

"రండి...ఈమె ఉమ. ఈమధ్యే కొంచెం పేరు తెచ్చుకుంటున్న రచయిత్రి. ఇతను విరించి. జర్నలిస్టు. నా ఫ్రెండ్. ఈ రూం ఇతనిదే..." పరిచయం చేశాడు రాఘవ.

అటే చూస్తున్నాడు విరించి. ఈవిడనే నిన్న చూసి రాఘవకు చెప్పింది. 'బతికిపోయాను ... తెలియక ఏమైనా కూశాను కాదు...' అనుకున్నాడు.

ఆ తరవాత మరొక ఎనిమిది మంది రచయితలు ప్రవేశించారు. అందులో యాభై ఏళ్ళపైబడ్డ ఒకామె తప్ప మిగతా వాళ్ళంతా రచయితలే. ఆవిడకు ఆభేదం లేనట్లుంది. హాయిగా ఉంది. ఎటొచ్చీ ఉమ సమక్షంలో బోలెడంత ఇబ్బంది పడ్డారు మిగతావాళ్లు. ఏమాత్రం ఇబ్బందిగా ఉన్నా, బైటకు చూపెట్టకుండా హాయిగా ఉన్నది ఉమ.

భలే పిల్ల అనుకున్నాడు విరించి.

ఏవో గేయాలు, మాటల గాయాలు, మధ్య మధ్య రాజకీయపార్టీ గోలలు, టీలు, కేకలు, ఒక కుర్రరచయిత కవితాగానం-అది చాలా బావున్నా ఆ విషయం చెప్పేవారు లేరు. "నేటి స్త్రీలు-పురుషుల దురహంకారం" అనే టాపిక్ మీద రెండు పేజీలు చదివారు ఆ పెద్దవయసు రచయిత్రి. అక్కడున్న మిగతా పురుషులంతా నోరు మెదపకుండా విన్నారు. ఈ ఫార్స్ అంతా ఇంతింత కళ్ళతో చూస్తూ కూర్చున్న ఉమ ఒక్కమాట మాట్లాడలేదు. ఈవిడ ఏమిటసలు? అని అలా చూసేస్తున్నాడు విరించి.

మెల్లిగా అందరూ శలవు తీసుకుని కదిలారు. "మీరు చలంగారి జీవితం మీద ఏదో సమీక్షలాంటిది రాశారు. అందులో రమణ మహర్షితో వారి అనుబంధం వివరించడం అంత అవసరమా అన్నట్లు





రాశారు. నాకేం నచ్చలేదది..." సూటిగా రాఘవను చూస్తూ అన్నది ఉమ.

ఉలిక్కిపడ్డాడు విరించి. ఆశ్చర్యంగా ఆవిడను చూశాడు. చెవులకేవో రాళ్ళు పెట్టుకున్నట్లుంది — మెరుస్తున్నాయి. గుండ్రటి బొట్టు, కాటుక కళ్ళు, పెద్ద జుట్టు ముక్కుపుడక పెట్టుకుంటే ఎందుకో వదిన గుర్తుకు వచ్చిందతనికి.

రాఘవ మామూలు తెల్లబట్టల్లో అతి సాధారణంగా కనబడుతున్నాడు. కానీ, దాని వెనకాల ఏదో కనబడని కాంతి. ఇంటలెక్చువల్ అంటే ఇతనేనా?! అతని చూపుల్లో అల్లరి ఉంది. ఎందుకింత మోకరీ ప్రపంచం అంటే ఇతనికి? అర్థం కాలేదు. అతన్ని అర్థం చేసుకుందామని చాలాసార్లు ప్రయత్నించాడు. కానీ ఒక పట్టాన కొరుకుడు పడడతను.

"మాట్లాడరేం?" మళ్ళీ అడిగింది ఆమె.

"తప్పంటారా?" నవ్వుతూ అడిగాడు.

"తప్పు, ఒప్పు సమస్య అక్షరాలకు లేదు. అవి స్వేచ్ఛావిహంగాలు. సర్వేశ్వరుడికి రూపమే ఉంటే అక్షరాలు ఆయన అంతర్ బహిరరూపాలు!"

"మరి?"

"చలం జీవితాంతంలో నమ్మిన ఒక గొప్ప తాత్వికదర్శనానికి, భగవాన్‌తో అనుభవాల పరంపరకు అసలు అస్తిత్వం లేనట్లు మీరు ... ముఖ్యంగా మీరు రాయడమేమిటి అని?"

గదిలో ఒక్కక్షణం నిశ్శబ్దం మృదువుగా మోగింది. ఏమాత్రం డిసిప్లిన్‌లేని ఈ బ్రహ్మచారి గదిలో ఈమె పాచి గోడమీద వెన్నెల్లా ఉంది అనుకున్నాడు విరించి.

"నాకు తెలిసిన చలం — నా తెలుగు దేశానికి తెలిసిన చలానికి మొదట్లో ఈ గందరగోళం అక్కరలేదు. కానీ, ఆ తరవాత ఆయనలో ఈ అన్వేషణ ఒక మలుపులో ప్రారంభమయింది. ఈ పాంచభౌతిక శరీరం, దాన్లో శాశ్వతాత్మ వగయిరా మెటాఫిజికల్ కబుర్లు చెప్పడానికి చలమే అక్కరలేదు, చాలామంది ఉన్నారు. దేశాన్ని తన అద్భుతమయిన భాషతోనూ, తాత్కాలికమయినప్పటికీ సౌందర్యపూరిత భావనతోనూ కదిలించిన చలం, అన్నేళ్ళు రమణాశ్రమంలో ఉండి. తనుగా ఏం కనిపెట్టాడు? ఏమిటి ఆయనను కదిలించింది?! కానీ విశ్వేశ్వయ్యణ్ని మ్లేచ్ఛుడొకరకంగా, శంకరులు ఒకరకంగా, సామాన్యుడు ఒకరకంగా చూశారు. విశ్వేశ్వయుడొక్కడే..చూసింది, బతికింది చలం కాబట్టి, చలంగా భగవాన్‌ను సమీక్షించి మనకేం మిగల్చలేదే అని నా బాధ. మిగతా అందరిలా మతం మత్తులో, తత్వమసిలో మునిగిపోయి మిగతావారి మాటలతో తన ఆలోచనలు రూపుదిద్దుకున్న ఆయనకన్నా, తెలిసిన అనుభవాలతోనో, ప్రతిరోజుకొక మార్పుతో ఎదుగుతున్న జ్ఞానంతోనో, దేశంలో ఒక వర్గంవారి రక్తంలో వెచ్చని ఆవిరి, గుండెల్లో గాడ్పులు తెచ్చిన 'చలం' కావాలి నాకు" సూటిగా స్పష్టంగా చెపుతున్నాడు రాఘవ.

గదిలో ఏదో నిశ్శబ్దం మళ్ళీ ఆవహించింది. విరించికి తెలిసీ రాఘవ ఇన్ని మాటలు మాట్లాడ్డం ఇదే మొదటిసారి.

"మీరు భగవంతుణ్ణి నమ్మరా?" పొడుగాటి జడ ముందుకువేసుకుని, మడిగాళ్ళమీద కూర్చుని అడుగుతున్న ఆ అమ్మాయినిచూసి "బాబోయ్" అనుకున్నాడు విరించి. అతని దృష్టిలో సాధారణంగా అలా ఉండే ఆడపిల్ల 'మీకు

ఏ సినిమాహీరో అంటే ఇష్టం? మీ ఫేవరేట్ క్రికెటర్ ఎవరు?' అని అడగాలి మరి.

"అసలు భగవంతుడు అంటే ఏమిటి? మీరు ఏర్పరచుకున్న ఈ భావాల రమ్య హర్మ్యాలనుంచి కొంచెం బయటపడితే, ఆలోచించే అవకాశం ఉంటుందేమో"

"పోనీ మీరు చెప్పండి"

"ఎక్కడున్నాడని ఈ భగవంతుణ్ణి మీరంతా ఇంత పాపాలభైరవుణ్ణి చేసేస్తున్నారు? అహం బ్రహ్మోస్మి అనేమాట నమ్మదలచుకుంటే అంతా భగవత్స్వరూపులే. మరి ఈ అసహ్యతంతా ఏమిటి?! సర్వవ్యాపితత్వం, సనాతనత్వం, కనబడుతూకూడా కనబడనట్లుండడం వగైరా ఊహలన్నీ భగవంతుడైతే, ప్రస్తుతం విద్యుచ్ఛక్తి భగవంతుడవ్వాలి. ఈ గుణాలన్నీ దానికి ఉన్నాయిమరి. భగవంతుడి చుట్టూ ఏవో చీల్చలేని పొరలుకప్పి, జనాన్ని భయపెట్టడం కన్న నా దృష్టిలో భగవంతుడు ప్రతి గొప్పకళలోనూ, ఉన్నతాత్ముడైన వ్యక్తిలోనూ, సౌందర్య పూరితమైన భావనలోనూ రూపుకట్టుకుంటాడు. ఐన్‌స్టీన్ క్వాంటమ్ థియరీ తరవాత, సైన్సు మిస్టిజమ్ దగ్గరైన తరవాత కూడా మనుషులు మా దేముడు, మీ దేముడు అని నరకాల్ని సృష్టించుకుంటున్నారంటే, ఈ మూఢత్వం నించి విడిపోవడం వాళ్ళ కిష్టమైనా లేకుండా ఉండాలి లేదా సాహసమైనా లేకుండా ఉండాలి. విశ్వ వ్యాప్తమైనదాన్లో తన సజీవతను ప్రతిబింబింపచేసుకుని, తనలో సర్వ ప్రపంచాన్నీ పునర్జీవింపచేసుకునే ప్రతిభావంతమైన థియరీ ఉన్నదని ఎవరికి తెలుసు?!

అవన్నీ చదవండి. ఆ తరవాత భగవంతుడి గురించి మాట్లాడండి" చిన్న పిల్లలకు హోంవర్క్ ఇచ్చి, పుస్తకం మూసేసే టీచర్‌లా ఆపేశాడు రాఘవ.

"ఇన్ని తెలిసిన మీరు, ఇవన్నీ ఎందుకు చెప్పకూడదు?"

"ఎవరికి? వినేవారు ఎవరు? ఎవరికి కావాలి అసలూ. ఇంత మెటీరియల్ ప్రపంచంలో ఏ అనుబంధం మీరు చెప్పే మనుషులకు సంధీకృతం అవుతుందని అడుగుతున్నారీ ప్రశ్న? ఈ నా థియరీ నేను చదివిన చదువు, సర్వం మా ఆఫీసులో చెక్కబల్లలకి అంకితమై, ఎంతవరకు వినోదాన్ని కళాత్మకంగా సృష్టించి పేపర్ సర్క్యులేషన్ పెంచగలమో తెలుసుకుని తద్వారా నా జీతం పెంచుకోడానికి ఉపయోగపడుతోంది. ఎంతవరకూ నా కుటుంబస్థాయిని ఆర్థిక పరంగా సంఘంలో పెంచగలమో అనే దాన్నిబట్టి నా మనుష్యులు నాకు ఖరీదు కడుతున్నారు. ఆలోచింపచేసేది. అదేదైనా చాలా తక్కువ మందికి కావాలి. తమ జీవన సుఖాలను గమ్యంలేని ప్రయాణాలుగా నిర్వీర్యపరిచి ఎదురు నిలబడ యుద్ధం చెయ్యనిది, కాలక్షేపానికి నాలుగు కొటేషన్స్ వాడుకోగలిగినది అయిన సూడో ఇంటలెక్చువాలిటీ ప్రతిఫలించే సాహిత్యంకావాలి కానీ, ఆలోచింపచేసి, తన అస్తిత్వాన్ని మహా భయంకర సంచలిత జ్ఞానసాగరాల్లో ముంచితేల్చే ఏ తత్వం, ఏ శాస్త్రం, కళా, కావ్యమూ ఎవరికీ అక్కర్లేదు. కావాలి అనుకునేవారు ఉంటారేమో కానీ వాళ్ళను వేళ్ళమీద లెఖ్ఖవెయ్యవచ్చు. సర్వేశ్వరుడి అస్తిత్వాన్ని గురించి మాట్లాడక, ప్రతి వ్యక్తి సర్వేశ్వరత్వాన్ని పొందే మార్గం చూపెట్టిన బుద్ధుణ్ణి దేముణ్ణిచేసి, ఆయన చెప్పింది




కాలగర్భంలో కలిపేసిన తెలివిగలవారు ఈ జనం. సోక్రటీస్ బతికుంటే ఆలోచింప జేస్తాడేమోనని భయపడి బలవంతంగా చంపేసింది ఈ జనం. శంకరుల అన్న పూర్ణాష్టకం చదివి కోరికలు తీరుతాయని దీపంపెట్టే ఈజనం, ఆయన చెప్పిన మిగతావి ఏవి అనుసరిస్తున్నారని?! ఆయన మాయావాదాన్ని ఖండించే ఈ తెలిసీ తెలియనివారు జగత్తు మిథ్య భగవంతుడు సత్యం. భగవంతుడే జగత్తు అన్న వాదంలో మూడోమాట మర్చిపోయి భంగపడుతున్నారు. అందుకని, ఈ జనాన్ని తట్టి లేపడంకన్నా జోకొట్టడం సులభం. అది అంతే''

గోడకు చారగిలబడి రెండుకాళ్లూ చాపి అవాక్కై వింటున్నాడు విరించి. ఏదో సరదాకి, కాలక్షేపానికి, రచయితల్లో మనష్యుల్ని చూసి నవ్వుకుందామనే దిక్కుమాలిన కోరికతోటి పెట్టిన ఈ మీటింగ్ ఇవ్వాళ చాలా గొప్పమలుపు తిరుగుతోంది. అందులో ఒకవ్యక్తి స్త్రీ అవడం మరీ తమాషాగా ఉంది. కానీ పర్యవసానం?

"రాఘవగారూ! మనుషులందరూ ఒక లెవల్లో ఉండరు. సృష్టిలో మానవత్వం అనేది కేవలం మిథ్యావాదం. ఎక్కడుందది? ఔన్నత్యం ఉన్న ఏ వ్యక్తీ తన కిందిమెట్టు మీద ఉన్నవాడిని చూసి నవ్వుకోడు. నవ్వునని హేళన చేసేవాడెప్పుడూ ఉన్నతుడవడు. జాలిపడతాడు, చేయూత నివ్వడానికి ప్రయత్నిస్తాడు. జెక్ ఫిలాస ఫీలు, అణువును విచ్ఛేదన చేస్తే ఏర్పడే పరమాణువుల సముదాయం, వాటి మధ్య ఆకర్షణ, వికర్షణల స్వరూపం హిందూ మిథాలజీలో కాస్మిక్ ఎనర్జీకి ప్రతి పాదితమైన నటరాజనృత్యం అని తెలిసీ నటరాజును పూజ చెయ్యక్కరలేదు. కేవలం ఏదో నమ్మకంతోనో, ఆ రీతోనో ప్రారంభం అయ్యే ప్రతిపనీ తరవాత సత్యాన్వేషణకు దారితీయవచ్చుగా! అటు వంటివారికి మీబోటి మేధావి వర్గం చేయూత ఇవ్వచ్చుగా."

ఖంగుమంటోంది ఉమ కంఠం. ఆమె గొంతులో మృదుత్వం పదును వున్నది.

రెండు చేతులూ కట్టుకుని ఆమె వంకే చూస్తున్నాడు రాఘవ. ఏమిటీమె ? ఏం చెబుదామని ప్రయత్ని స్తోంది?! అతని ఆలోచనా తరంగాలు ఆమెను తాకినట్లున్నాయి.

"సారీ! మిమ్మల్ని ఇంప్రెస్ చేద్దామని మాట్లాడ్డం లేదు. చాలాసార్లు మీ సమీ క్షలు, పుస్తకాలు చదివాను. మీరు చాలా గొప్పగా చదువుకున్నవారు. కానీ ఏదో సినిసిజమ్‌తో కొట్టుకు పోతున్నారని పించింది. ఈ వాదన కూడా కరెక్ట్ కాదేమో! నేనే వేటినో కొన్ని సిద్ధాంతా లను, హేతువాదాలకు అందని వాటిని నమ్మి ప్రపంచాన్ని తిరగబోర్ల చూస్తున్నా నేమోనని అనుమాన మొచ్చింది. కొన్ని వందల పుస్తకాలు చదవడం కన్నా ఒక సజీవమైన వ్యక్తితో, నా సబ్జెక్ట్ అర్థ మైన వ్యక్తితో వాదించి చాలా నేర్చుకో వచ్చనిపించింది. అందుకే, మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను..."

మాట్లాడలేదు రాఘవ. గాలిలోనించి పక్కింటి అరవమామి పోట్లాట విని పిస్తోంది. దూరంగా ఎక్కడో. రైలుకూత, కారు గిన చప్పుడు... వీటన్నింటి మధ్యా విరామ సంగీతంలా అప్పుడప్పుడు కోయిల కూస్తోంది.

కానీ, ఇదంతా నేపథ్యమే... విరించికి ఊపిరి అందడం లేదు... మహాసరదాగా

ఉన్నది... కాస్త భయంగానూ ఉన్నది. వాతావరణం ఏదో తెలియని కొత్తకాంతితో ఎలక్ట్రిఫై అయిందనిపించింది... తెలియని తెగింపు వచ్చింది.

"ఉమగారూ! మీరేం చదువుకున్నారు?"

"ప్రైవేట్‌గా ఎమ్.ఏ. చేస్తున్నాను"

"సబ్జెక్ట్"

"లిటరేచర్"

"మీరు రచయిత్రులు కదా...వెంటనే తప్పుగా అర్థం చేసుకోకండి అడిగితే..."

"అడగండి!"

"మీకు పెళ్ళైందా?"

'ఎందుకిప్పుడా ప్రశ్న?' అని అడగ లేదు ఉమ. తలెత్తి సూటిగా ఆతని కళ్లల్లోకి చూసింది...ఆ చూపులో ఏముందో తెలియదు కానీ, రాఘవకు వెన్నెముకలో ఏదో తెలియని చల్లదనం.

చేతిలో ఏమన్నా ఉంటే వేసి మొహం పగల గొడుతుందేమోనని పక్కకు తప్పుకోవాలనిపించింది విరించికి.

వెంటనే ఒక్కసారి నవ్వేసి "లేదు... సరే...వస్తాను ... మరొకసారి కలుసుకుందాం....నమస్తే..." మెల్లిగా లేచి, కుచ్చెళ్లు సుతారంగా దులుపుకుని వెళ్లిపోయింది. గాలిలో తేలే ఆమె అందెల సవ్వడి వింటూ స్థబ్దులై కూచుండిపోయారు ఇద్దరూ.

ఉన్నట్లుండి ఒక్కసారి గట్టిగా నవ్వేశాడు రాఘవ.

"ఎందుకు గురువుగారూ నవ్వుతున్నారు?" అంటూ తనూ నవ్వాడు విరించి.

"మనిద్దరం ఒక మహాప్రమాదం నుంచి తప్పుకోడానికి ప్రయోగించిన చాలా మామూలు ట్రిక్‌ను తలుచుకుని..."

"సార్! ఇంతకీ ఆవిడ ఎవరన్నారు?"

"ఏమో... నాకూ తెలియదు... ఇల్లాగే ఒక మీటింగ్‌లో పరిచయమైంది. ఆవిడ నవల ఒకటి మన పత్రికలో వేశాంలే..."

"సార్... ఆ నవల ఎలా ఉంది?"

"ఏమో....చాలా సెంటిమెంటల్ అనుకున్నాను అప్పుడు. మరొకసారి చదవాలి... చాలా ఇండిపెండెంట్ టైప్‌లా ఉన్నది. ఎక్కడైనా ఉద్యోగం చేస్తోందేమో! పదా....అలా బైటికి వెళ్దాం..." చాలా మాములుగా అని బైటకు వెళ్లారు ఇద్దరు.

కానీ, ఇద్దరూ దారిలో ఏమాత్రం తర్కించనిది, నిమిషం మర్చిపోనిది ఒకటే... 'ఉమ!'

ఇంటికి వెళ్దామని బయలు దేరాడు రాఘవ. అతను ఆఫీసు ముందునుంచే వెళ్లాలి. వాకిట్లో గూర్ఖా. చీకట్లో రేపు ప్రసవించబోయే సాహిత్యాన్ని, రాజకీయాల్ని కడుపులో దాచుకుని నిద్రపోతున్న ఏదో ఊహాకందని రూపంలా ఉన్నది 'ఈ తరం' ఆఫీసు ఒక్క క్షణం తారట్లాడాడు.

"కౌన్?" అరిచాడు గూర్ఖా.

సమాధానం చెప్పి లోపలికి వెళ్లాడు. లైట్లు లేసి ఏదో ఫైల్ వెతికాడు.

అందులో ఒక కటింగ్ దొరికింది.

ఉమాదేవి... 22 ఏళ్లు . . . వీణ వాయిస్తారు... వగైరా వివరాలున్నాయి... "సాహిత్యంలో స్పందన ఉండాలని నమ్ముతారు..." ఈ ఒక్క విషయం తప్ప, ఆ నీరవ నిశీథిలో ఆ జీవంలేని నల్లటి అక్షరాలు మరేం మాట్లాడలేక పోయాయి.

ఆలోచిస్తూ బయటికి అడుగు వేశాడతను.

* * *




"ప్రతి పరిచయం స్నేహం అవ్వాలని, ప్రతి స్నేహం చాలా గొప్పదవ్వాలని ఎక్కడున్నది సార్? స్నేహం గొప్పదే...కాదనను... 'ఇందుకు' అని తెలియని స్నేహం మటుకు చాలా ప్రమాదకరమైంది" అన్నాడు విరించి.

రాఘవ, విరించి రామకృష్ణా లంచ్ హోంలో కాఫీ తాగుతున్నారు. చాలా పురాతనమైన ఆహోటల్‌కు చాలా గొప్ప చరిత్ర ఉన్నది. బైటనించి వచ్చే కదంబ వాసనలు, లోపలినించి వచ్చే మాసాలా దోశల వాసనలూ కలగాపులగం అయిపోయి వింత మాదకత ఉంటుంది గాలిలో. అక్కడ కాఫీ చాలా ప్రసిద్ధి.

వారిద్దరి సబ్జెక్ట్ 'ఉమ'. ఆ మొదటి పరిచయం తరవాత నాలుగుసార్లు కలిశారు. ప్రతి కలయికలోనూ రాఘవలోని మేధావిని చూసి ఉమ చూపే ఆరాధన చాలా నిష్కల్మషంగా ఉండేది. అన్ని పొరలు విడదీసి అతనికి అలా దగ్గరైనవారు ఎవరూ లేరు. అందుకని అతని దృష్టిలో ఉమ కేవలం అడ్మైరర్‌గా ఆగిపోలేదు.

గొప్ప రచయిత, ఒక గొప్ప పత్రికకు ఎడిటర్ అయిన రాఘవ లోపల ఒక మొగవాడు... జీవితం పట్ల ఉదాసీన భావం ఉన్న వ్యక్తి ఉన్నాడు. అందుకే అతని అలౌకిక తార్కిక జ్ఞానం అతడి జీవితానికి ఉపయోగించలేదేమో. ఉమ ఏదో తెలుసుకోవాలి అని ప్రశ్నించినప్పుడల్లా, అతను ఆమెను వాదనతో నోరు కట్టించేవాడు. అందులో అతనికి ఏదో ఎగో శాటిస్‌ఫాక్షన్.

"దెయ్యాలు ఉన్నాయా అనే శీర్షిక నిర్వహించినంత మాత్రం చేత మా ఆఫీసులో కుర్చీలూ, బెంచీలూ కూడా దెయ్యాలేనని నమ్మాలనే సిద్ధాంతం ఏం లేదు. ఏదో పొట్టకూటికి ఉద్యోగం చేస్తున్నాం కానీ, ఇదంతా ట్రాష్ అనే వాళ్లు మా మధ్యే ఉన్నారు. మనుషుల్ని కొనగలరేమోకానీ, వాళ్ళ ఆలోచనలను కొనలేరుగా !" అన్నాడు రాఘవ ఉమ ఆ సబ్జెక్ట్ ఎత్తినప్పుడు.

"నాకు మాత్రం హనుమంతుడి దండకం వచ్చు. నేను విపరీతంగా నమ్ముతాను" నిజాయితీగా ఒప్పుకున్నాడు విరించి. అతను పొలం గట్ల మీదఉండే మోహినీ పిశాచాల గురించి, కొరివి దెయ్యాల గురించి వినే ఉన్నాడు.

"భయం బేస్‌గా కొన్ని నమ్మకాలు పూజింపబడతాయి. అప్పుడప్పుడు పాపం భగవంతుడు కూడా ఆ కోవలోకి చేర్చబడతాడు. అది కాదు సబ్జెక్ట్. అసలు ఈ విషయం మీద ఇంత డిస్కషన్ నిర్వహించే మీరు నిజాయితీగా ఎందుకు ఆలోచించరు? మీరు నమ్మని విషయాలు, ఆలోచించడానికే వ్యతిరేకించే విషయాలు ఎదుటివాళ్ళ నెత్తి మీద రుద్దాదామని ఎందుకు ప్రయత్నం? సిన్సియారిటీ లేని ఈ పనివల్ల ప్రయోజనం ఏమిటి?"

ఆమె అడుగుతున్న ప్రశ్నకు జవాబు చెప్పదలుచుకోలేదతను. మామూలుగా అయితే 'ఒక థియరీనో, ధర్మాన్నో, న్యాయసూత్రాన్నో కేవలం కొన్ని వాక్యాలుగా మార్చి ప్రచురిస్తే ప్రజలు దాన్ని చాలా మాటరాఫ్ ఫాక్ట్‌గా తీసుకుంటారు. చర్చనీయాంశం చేస్తే ఆలోచించడం ప్రారంభించి ఒకరినుంచి ఒకరు చాలా నేర్చుకుంటారు...' అని సమాధానం చెప్పేవాడేమో కానీ కాసేపు ఆమెను ఏడిపిద్దామనిపించింది.

"ఒక నిజం అది నిజమేనని నిర్ధారింపబడినపుడు అది దాని ఔన్నత్యాన్ని



కోల్పోతుంది అన్నాడు గదా ఆస్కార్ వైల్డ్" అని తప్పించుకున్నాడు.

మాట్లాడకుండా వెళ్ళిపోయింది ఆమె. ఆ తరవాత పదిహేను రోజులు కనబడ లేదు.

రాఘవలోని గొప్ప వ్యక్తిత్వం తను అద్దెకుండే 250 రూపాయల ఇంట్లోకి

వెళ్ళగానే మారిపోతుంది. తప్పదు. తల్లికి మందులు, తెలివిగా ప్రవర్తించాలనుకునే భార్య తీసుకునే అతి జాగ్రత్తలు అలవాటైపోయాయి. కానీ ఎందుకో ఉమ 'హాంటింగ్ మెమొరీ' అయిపోయింది. అయినా, ఆడపిల్లకు అంత తెలివి ఏమిటసలు అని విసుక్కున్నాడు.

సెలవులు వచ్చాయని పిల్లల్ని స్నేక్‌పార్క్‌కు తీసుకు వెళితే అక్కడ చూపించిన నాగుపాము ఎండలో మిలమిలా మెరుస్తూ పడగ విప్పడం చూశాడు. ఉమ గుర్తుకు వచ్చింది.

అష్టలక్ష్మి గుడి పైప్రాకారం మీద నుంచి అస్తమిస్తున్న సూర్యకాంతిలో మెరుస్తున్న అమ్మవారిని చూసినప్పుడు ఉమే గుర్తుకు వచ్చింది.

కలుసుకోవడం తప్పదనిపించింది. కానీ కనీసం ఆమె ఆహ్వానించలేదు. అడ్రస్ కూడా లేదు. దాని కోసం ప్రయత్నిస్తే దొరక్కపోదేమో కానీ అభిమానం అడ్డు వచ్చింది.

“అయినా, ఆడపిల్లకు అంత ఆలోచనా, ఆ గోలా ఏమిటి విరించీ!” అన్నాడోరోజు ఆపుకోలేక.



"ఉండకూడదా గురువుగారూ! పైగా రచయిత్రి కదా?"

"నా మొహం" రకరకాల నవలా వైతరుణల్లో మునిగి విసుగెత్తి పోయిన వాడు అతను.

ఆ తరవాత ఏదో రిఫరెన్స్ కోసరం థియసాఫికల్ లైబ్రరీలోకి వెళితే కనబడింది ఆమె.

ఆ చల్లటి చెట్లనీడలో ఆధ్యాత్మికత స్పందించే పాలరాతి గోడల నీడల్లో, కొన్ని వేల మందికి జ్ఞానప్రదానం చేసి అంతర్ముఖుల్ని చేసిన ఆ నిశ్శబ్ద సంగీతంలో మళ్ళీ వారి స్నేహానికి లయ కుదిరింది.

"ఇక్కడ బౌద్ధారామం చూశారా? చాలా బావుంటుంది" లోపలికి వెళుతూ, నడిపించింది.

అక్కడి అలౌకిక సౌందర్యం, ఆ కొలను, వెదురుపొదలు అతనిలో కవిని, సౌందర్యారాధకుడిని నిద్రలేపాయి. మాట్లాడుతున్న ప్రతి మాటలో స్వవిష యాలు రాకుండా జాగ్రత్తపడ్డారు ఇద్దరూ. ఏమి కావాలో అవి వద్దను కోవడం ఇద్దరికీ సుఖం.

"రండి! మిమ్మల్ని డ్రాప్‌చేసి వెళ తాను" అంటూ తన ఫియట్ డ్రైవింగ్ సీటులో కూర్చునేదాకా, ఆమె అంతస్తు అతని ఆలోచనల్లోకి కూడా రాలేదు.

"ఒద్దు" అంటూ నడిచివెళ్ళిపోయా డతను. ఆ తరవాత జీవితాన్ని మొకరీగా, ప్రేమను కేవలం ఎగోఫీలింగ్‌గా చిత్రీక రించే రాఘవ "నిజం చెప్పు నేస్తం. నీకేం కానా నేను?" అని కవిత్వం రాశాడు.

"గురువుగారూ! ఏం బాగా లేదు విషయం. పెళ్లైన మీకు ఈ బాధేమిటి?" విరించి కొంచెం సీరియస్‌గానే అన్నాడు.

"పర్యవసానాలులేని స్నేహాలు సుఖం విరించీ! ఇందులో ఇచ్చుకోవడాలు, పుచ్చు కోవడాలు, దాచుకోవడాలు, పోగొట్టు కోవడాలు ఉండవు"

"నా బొంద" అని వెళ్ళిపోయా డతను.

ఆ తరవాత ఆమెను షాపింగ్ సెంటర్‌లో తల్లితండ్రులమధ్య పొందిగ్గా నడుచుకుంటూ నగల దుకాణంలోకి వెళ్ళడం చూశాడు. పలకరించలేదు. ఆమె అలంకరణ ఆమె ఎంత గొప్పదో చెప్పాయి. 'ఇల్లాంటి పిల్ల విరించి గదికి అలా వచ్చేదే ' అనుకున్నాడు.

"నా పెళ్ళండీ" అంటూ ఇన్వి టేషన్స్ తీసుకుని వచ్చి స్టాఫ్‌కంతా పంచింది. చందనం కార్డుమీద బంగారు అక్షరాలు. ఆమె తండ్రిపేరు చదవగానే ఉలిక్కిపడ్డాడు విరించి. ఆయన లైన్స్ క్లబ్ మెంబరు. ఇన్‌కంటాక్స్ ఆఫీసరు. "ఓరి నాయనో!" అని ఆశ్చర్యంగా చూశాడు ఆమె వంక. మామూలుగా నవ్వుతూ వెళ్ళిపోయింది.

"చేసుకోబోయే ఈ అభాగ్యుణ్ని తన ఇన్టలెక్చువాలిటీతో చంపుతుంది కాబోలు గురువుగారూ" అనబోయి రాఘవ మొహంలో 'ఇది' అని చెప్పలేని భావాన్ని చూసి నోరు మూసుకున్నాడు.

పెళ్ళికి వెళ్ళకూడదనుకుంటూనే ఆఖరి క్షణంలో వెళ్ళారు. "స్నేహానికి సంకేతం పుష్పగుచ్ఛమే"నని పాడు కుంటూ బొకే పట్టుకొచ్చేశాడు విరించి.

ఏం కొనాలా అని వెతికాడు రాఘవ.

"అయినా, వాళ్ళ పెళ్ళికి మనమేమిటి సార్ ఇవ్వడం? ఏమివ్వగలం అయినా? ఓ ఊదివత్తి స్టాండు కొని, ఒక రెండు రూపాయలిచ్చి పెద్ద పేకేజీ చేసి తీసుకు





వెళ్ళడమే" అని ఉచిత సలహా ఇచ్చాడు విరించి. మాట్లాడలేదు రాఘవ. సన్నటి ఉల్లిపొరలాంటి పేపర్లోనించి మిలమిలా వెండి లేసులా మెరుస్తున్న పాంజేబు పట్టాలు తీశాడు. వేలికి, పట్టాకు సన్నటి వెండి చైనుతో కలిపి, ఏదో పాతకాలపు రాజకుమార్తె నగలా ఉన్నది అది.

ఏదో అనబోయి నోరు మూసుకున్నాడు విరించి. పెళ్ళికొడుకు నల్లగా ఉన్నాడు. హుందాగా ఉన్నాడు. కానీ ఆ పెళ్ళిపందిరి, వాతావరణం...ఉక్కిరిబిక్కిరి అయిపోయారు. ఒక్కసారి హోదా, డబ్బు, నగలు, మర్యాదలు ఘల్లున మీదబడినట్లై, భోజనాలు కూడా చెయ్యకుండా పారిపోయివచ్చేశారు. అన్నింట్లోకి భరించలేనిది ఉమ అలంకరణ. ఒక లక్షరూపాయల నగలు, ఐదు వేల రూపాయల చీరతో ఉమను ఉమగా చూడలేకపోయారు. పెళ్ళి పందిరినించి బైటకురాగానే ఏదో ఉపద్రవంనించి బైటపడ్డట్టైంది.

"ఎన్ని కబుర్లన్నా చెప్పనీయండి గురువుగారూ...ఆడపిల్లలు హోదాలకు, డబ్బుకు లొంగిపోతారు. మనకు తెలిసిన స్నేహమయి ఉమకు, ఆ పెళ్ళికూతురు ఉమకు ఏమన్నా సంబంధం ఉందీ?" ఓరోజు విరించి ఆఫీసు అయిపోయిన తరవాత ఊసుపోకకు రాఘవతో అలా మాట్లాడుతూండగానే–

'ఉమ' చచ్చిపోయిందని తెలిసింది.

ముందు మామూలుగా ఉన్నా తర్వాత తలుచుకుని, తలుచుకుని ఏడ్చాడు విరించి. శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు రాఘవ. అతని దుఃఖం మానసికమైనది. అందుకే తేరుకుని విరించిని సముదాయించాడు.

ఆఖరిసారిగా ఉమ మృతదేహాన్ని చూద్దామనుకుని కూడా భరించలేమని రాలేదు ఇద్దరూ.

ఆ తరవాత రిజిస్టర్డ్ పోస్ట్‌లో ఉత్తరం అందింది విరించికి. ఒక వారం ఆలోచించి తరవాత రాఘవకు చెప్పాడు... చెప్పకూడదనుకుంటూనే చెప్పాడు. ఆ ఉత్తరం విశ్వజననీయమైంది. ఒక్క విరించికో, రాఘవకో సంబంధించిందికాదు. అందులో తను విపరీతంగా గౌరవించిన 'ఉమ' సందేశముంది. అది ప్రపంచానికి తెలియాలన్న తపన ఉంది. అందుకే అది పబ్లిష్ చెయ్యాలని పట్టుదలమీద ఉన్నాడు విరించి.




జరిగిందంతా తన భాషలో చెప్పి గటగటా గ్లాసెడు మంచినీళ్లు తాగాడు విరించి. అతనివంకే చూస్తూ జరిగినదంతా ఊహించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు శంకరం.

ఈ జరిగిన విషయం ఏదీ ప్రతిరోజూ ఉమకు దగ్గరగా ఉన్న తల్లికి, తండ్రికి, చెల్లెలికి అర్థంకాదు. చెప్పినా ప్రయోజనం ఉండదు. వాళ్ళ జీవన సరళి వేరు. ఉమ ఆలోచనా విధానం వేరు. ఈ ఉత్తరం చూస్తే సినిమాలోలాగా "అమ్మా ఉమా! నిన్ను అర్థంచేసుకోలేకపోయాం తల్లీ!" అని ఒక్క అరుపు అరిచి

వసుంధర కానీ, బావగారుకానీ, రమ కానీ విరుచుకుపడిపోరు. పైగా ఆ పిల్లను మరింత తిట్టుకుంటారు.

అయినా రిసెప్షన్‌లో చక్కటి కోటు, బటన్ హోల్‌లో రోజా పువ్వు పెట్టుకున్న రంజిత్ ఉమను ఎంత బాధ... ఊహించు కోను కూడా లేకపోయాడు శంకరం.

పొడుగాటి జడతో పొందిగ్గా, ఏ సిద్ధాంతాన్నో చర్చిస్తూ ఆ చల్లటి థియసాఫికల్ సొసైటీ నీడల్లో గడిచే వెన్నెల బొమ్మ ఉమ. దానికేం కావాలో కూడా తెలియదే ఎవరికీ ఈ ఉత్తరం చూసే దాకా?

ఏం పెళ్ళిళ్ళవి? గోబీ ఎడారిలో పశువుల మందనీ, స్త్రీలనూ కూడా ఆర్థిక స్తోయికి చిహ్నంగా, వ్యాపారానికి కేంద్రంగా చూశారంటే అనాగరిక చరిత్ర అని తిట్టే ఈ సమాజం ఇప్పటికిమాత్రం ఏం ఎదిగిందని? అయినా ఇప్పుడేం చెయ్యాలి?

"సార్! ఏమిటి ఆలోచన?" విరించి అడిగాడు. శంకరం తేరుకున్నాడు.

"చూడు విరించీ! మా అమ్మాయి ఇలా ఉంటుందని, ఇలా ఆలోచిస్తుందనీ కూడా మావాళ్ళెవరికీ తెలియదు. ఈ ఉత్తరం నీది కాబట్టి ఏం చెయ్యడానికైనా నీకు హక్కుందనుకో. నాకు ఒక్క నాలుగైదురోజులు టైం ఇవ్వకూడదూ....ఆలోచించి చెప్తాను" అన్నాడు.

ఆలోచించాడు విరించి. "సరేసార్... మీ ఇష్టం. కానీండి. కానీ దీని మట్టు పెట్టమని మాత్రం చెప్పకండి సార్. నిజంగా మీకు ఉమగారు నాకు తెలిసినంతగా తెలిసిఉంటే అలామాత్రం చెప్పరు సార్" అతని కళ్లల్లో అంతలో సీటితెర.

'ఉమా! ఏమిచ్చి ఈ ఆప్యాయత కొనుక్కున్నావమ్మా' అనుకున్నాడు శంకరం.

విరించి వెళ్లిన తరవాత బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి మెల్లిగా చెప్పులు వేసుకుని రామేశంగారింటికి వెళ్లాడు శంకరం. వెళ్లేటప్పుడు ఉత్తరం తీసుకువెళ్ళడం మర్చిపోలేదు.

* * *

"ఈ కథలో మనకెక్కడో తెలియని లింకు ఉంది. ఆమెలో కనబడని నిర్వేదనం ఉన్నది. అది ఇది అని చెప్పగల జ్ఞానం ఉన్నది. కానీ తట్టుకుని నిలబడే శక్తి కోల్పోయింది. ఎందువల్ల?" రామేశంగారు పచార్లుచేస్తూ బైటకు మాట్లాడుకుంటున్నారు. "థింకింగ్ అలౌడ్"

ఆ ఉత్తరం చూసిన తరవాత నిజానికి శంకరానికి అర్థమైంది చాలా కొద్ది విషయం. అతని లౌకికమైన బుర్రకు మిగతాదేం అర్థంకాలేదు సరికదా తికమకగా కూడా ఉంది. అందుకే మనసు వద్దంటున్నా మెదడు వెళ్ళమందనిపించి రామేశంగారి దగ్గరకు వచ్చాడు.

"ఇంతకీ ఏం చేద్దాం అంటారిప్పుడు? ఆ విరించి చూడబోతే చాలా పట్టుదలగా ఉన్నాడు"

"చూద్దాం!" ఆలోచిస్తూనే లోపలికి వెళ్లి మజ్జిగ తెచ్చి ఇచ్చారు రామేశంగారు.

"ఇప్పుడే వస్తాను" అని చెప్పి మళ్లీ లోపలికి వెళ్లారు. శంకరం చుట్టూ చూస్తూ కూర్చున్నాడు.

చిన్న రేకుల షెడ్డు అది. వెనకాలది పంట వసారా కాబోలు ముందు వెదురు తడికతో అడ్డంకట్టారు. రాధామాధవం తీగ ఇంటిమీదికి పాకుతోంది. పసుపు రాసిన తులసికోట, గన్నేరు మందారం చెట్లు,లోపలినించి అగరవత్తుల సువాసన-




వాతావరణం ప్రశాంతంగా ఉంది.

కూర్చుని కూర్చుని "ఏం చేస్తున్నా డీయన లోపల" అని లోపలికి అడుగు పెట్టాడు శంకరం.

వంట వసారాలో ఈశాన్యం మూల కాబోలు – చక్కగా ముగ్గులు వేసిఉన్న అరుగు, దానిమీద జపాకుసుమాలతో అలంకరించిన అమ్మవారు జ్యోతికాంతు లీనుతున్నాయి. అగరవత్తులు ధూప నైవేద్యం చేస్తున్నాయి. అనాలోచితం గానే చేతులు జోడించాడు శంకరం.

ఆ పీఠం ఎదురుగా పద్మాసనం వేసుకుని ధ్యానంలో ఉన్న రామేశం గారు..ఎందుకో ఆ దృశ్యం ఎంత ఇదిగా ఆలోచిద్దామనుకున్నా శంకరానికి మనస్సుకు తాకింది.

మెల్లిగా కళ్ళు తెరిచారు ఆయన. ఏదో అలౌకిక తేజస్సు.

'నేను లేనిపోని ఆలోచనలతో సత మతమౌతున్నానా ఖర్మ' అని తనను తాను తిట్టుకున్నాడు శంకరం.

"రండి. బైట కూర్చుందాం." అంటూ లేచారు.

"అర్థాంతరంగా ఈ ధ్యానం ఏమి టండీ? ఈ సమస్యకు పరిష్కారమేమిటా అని..."

మెల్లగా ఆపమని ఎడం చేత్తో సౌంజ్ఞ చేశారు. ఆయన దృష్టి ఎక్కడో ఉన్నది.

"బాబుగారూ ! ఆమె కొంత తెలుసు కుని కొంత తెలుసుకోకుండా పోయారు. ఆత్మజ్ఞానం కావలసి అల్లాడుతోంది బిడ్డ. చనిపోయినవాళ్ళకు కావలసినదేమిటో.."

"ఆ క్రతువూ అదీ చేశాచకదండీ బోలెడు ఖర్చుపెట్టి..." అన్నాడు శంకరం మధ్యలో.

తమాషాగా నవ్వారు రామేశంగారు ఏదో పసిబిడను చూసి నవ్వినట్లు.

'అర్థమైనవీ భరించడానికే వచ్చాను నేను. కానీయ్' అనుకున్నాడు మనసులో శంకరం.

"బాబుగారూ! మళ్ళీ చెబుతున్నాను. మన జ్ఞానం, పలుకు, క్రియ – మూడూ సంధీకృతమైతే కానీ ఏ క్రతువూ యజ్ఞం కాదండీ...ఉట్టి తంతే...పిల్లల బొమ్మల పెళ్ళిలాంటిది ఈ ఖర్చు, ఈ ఆడంబరం, మంత్రార్థం తెలుసుకోని ఈ మనుషులు – పిళ్ళిచ్చేవి ఆ దివ్యులకు సరిపోవండీ! వారికి కావలసినది ఇచ్ఛా శక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి సంధీకృతం బడిన ధ్యానం కానీ, మరొకటి కానీ కావాలి.

ఒక పని చెయ్యండి...మీరు మన స్ఫూర్తిగా, మరో రకమైన ఆలోచనలు రానీయకుండా మీరు దైవము అనుకుని ధ్యానించే శక్తిని తలుచుకుని ప్రార్థిం చండి. ఆవిడ తారట్లాడే ఆ లోకాల్లో దారి దొరకాలని, సత్యం తెలుసుకోవా లని మనస్ఫూర్తిగా కోరుకోండి. నేనూ ప్రార్థిస్తాను ఆ బిడ్డ కోసరం..."

గడ్డంకింద చెయ్యిపెట్టుకుని ఆయన్నే చూస్తూ కూర్చున్నాడు శంకరం. మయ సభలో దుర్యోధనుడు "రానేల..వచ్చితిని పో..." అనే డైలాగులు గుర్తుకువచ్చాయి అతనికి.

'నేను ఎంత వెర్రివెధవను కాబోతే ఈ ఛాందసపు పిచ్చివాణ్ని వెతుకుతూ వచ్చాను? అయినా ఈయన ఏం పరి ష్కారం చెపుతాడని వచ్చాను?' తనని తాను తిట్టుకుని మెల్లిగా వెళ్ళిపోదామని లేచాడు శంకరం.

"బాబుగారూ! నేను చెప్పేవన్నీ చాలా అర్థరహితంగా ఉన్నాయి కదా మీకు?

నమ్మలేక వెళ్ళిపోతున్నారు. అసలు ఈ పిచ్చివాడి దగ్గరకు ఎందుకు వచ్చానా అని ఆలోచిస్తున్నారు. అవునా?"

'థాట్ రీడింగ్ కాబోలు... గాడిద గుడ్డు అనుకుని గిర్రున వెనక్కి తిరిగి,

"అవునండీ!ఏమిటి మరి ఈ గోలంతా? ఈ ఉత్తరం, ఈ సమస్యలు - ఇవన్నీ ఎక్కడ బయట పడి మావాళ్ళ కుటుంబం ఎక్కడ అల్లరి అయిపోతుందోనని నేను బాధపడుతూ ఉంటే, చచ్చి ఉట్టెక్కిన దాన్ని గురించి ఆలోచించ మంటారేమిటి? అది పోయింది...ఆ కథ అయిపోయింది... అంతే..." అన్నాడు ఖరాఖండీగా.

"చచ్చిపోగానే ఆ కథ అంతే అని ఎందుకంటారు బాబుగారూ! జీవి, పర లోకం..."

"నా పాడె, పచ్చిబద్ధలు...ఈ శాస్త్రాలన్నీ కట్టిపెట్టండి. ఒక పక్క సైన్సు ముందుకు వెళ్ళి పెద్ద పీఠం అలంకరిస్తూంటే, ఈ శోష ఏమిటి? ఏ సైంటిస్టూ ఇంతవరకు ఆత్మల గురించి మాట్లాడలేదు మరి. గూసిన వాటితోనూ, ఉన్న వాటితోనే-ఛస్తూంటే, చూడని వాటి గోలేమిటి మళ్ళీ?"

"మీకే సైంటిస్ట్ గురించి తెలుసు?!" సూటిగా చూస్తూ అడిగారు. ఆయన కళ్ళల్లో ఏదో కాంతి వలయం.

ఆలోచించాడు శంకరం... ఏదో పేపర్లో చదివి, 'వాళ్ళు చంద్రమండలంలో దిగారు. వీళ్ళు ఏదో అణుశక్తిని ఛేదించారు' అవడమే కానీ, అతనికి ఎవరూ పెద్దగా తెలియదు. అయినా ఈ ఛాదస్తపు బ్రాహ్మడికి మాత్రం ఎవరు తెలుసని? చదువుకున్న ఇంగ్లీషంతా ఈయన ఈ

పూజలు, మంత్రాల్లో పడి ఎప్పుడో గుంట దవ్వి గంట వాయించి ఉంటాడు. అలా అనుకోగానే, ధైర్యం వచ్చి "మీకు మాత్రం ఎవరు తెలుసండీ?" అన్నాడు.

కుర్చీలో స్థిరంగా కూర్చుని, కళ్ళజోడులోంచి పరీక్షగా చూస్తూ-

"మీకు డాక్టర్ మీక్ పేరు తెలుసా? జార్జ్ డబ్ల్యు మీక్ చనిపోయినవారి గమ్యం మీద గొప్ప పరిశోధన చేసిన మహా మేధావి. మృత్యువు మామూలు మనిషి అనుకునేటంత భయంకరమైనది కాదనీ, అమృతత్వానికి తీసుకు వెళ్ళగల శక్తి దానికి ఉందనీ, ఈ జన్మలో చేసిన పాపపుణ్యాలకు పైలోకాల్లో బేరీజు ఉంటుందనీ ఒప్పుకున్న సైంటిస్టులు ఎంతమందో తెలుసా?!

"విలియమ్ బ్రాన్‌డాన్ అనే ఆయన మృత్యువు తరవాత, మరి నాలుగు పుస్తకాలు ఎడిత్ ఎల్లిస్ అనే ఆయన ద్వారా 1935-36లో రాయించాడు తెలుసా మీకు?!

"థియరిటికల్ ఫిజిక్స్‌కు, తూర్పు దేశస్థుల ఆధ్యాత్మిక తత్వాలకు మధ్య చాలా అనూహ్యమైన స్పందన ఉన్నదని నమ్మిన వెర్నర్ హైసన్‌బర్గ్ తెలుసా మీకు?"

"క్వాంటమ్ థియరీకి, మన ఆధ్యాత్మికతకు మధ్య సంబంధము బలీయమైనదని, అణువిచ్ఛేదంలో జ్వలించిన కాంతి పుంజాల బిందు రూపాల్ని రేఖారూపాలుగా దిద్దితే మన నటరాజ రూపాన్ని పొందిందని ఋజువు చేసిన ఫ్రిట్ ఆఫ్ కాప్రా తెలుసా మీకు?"

అలా మాట్లాడుతున్న రామేశంగారి మాటల్లో జ్ఞానపుంజాలు పురులు విప్పుకున్నాయి. ఆయన మేధస్సు దైవీకమైన తేజస్సుగా మారి ఒక్కసారి వాతా

వరణాన్ని ఉద్దీపింపచేసింది. ఆయనలో 'అహం' జ్ఞానాగ్నిలో మాడిపోయిందేమో మాటలో క్రియలో ఎక్కడా లఘుత్వం లేదు.

శంకరం ఏం మాట్లాడలేకపోయాడు. అతను ఇన్నాళ్లు చాలా తెలివిగా, లౌక్యంగా బతుకుతున్న జీవన విధానానికి, రామేశంగారు మాట్లాడుతున్న ఈ అలౌకికమైన పంథాకి మధ్యలో ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాడు. చీకటి గదిలోకి ఒక్కసారి ఏడు కిటికీలను తెరుచుకుని వెలుతురు వచ్చినట్లైంది. ఆలోచిస్తున్నాడు. ఈయననైతే ఛాందసుడిగా తీసెయ్యొచ్చు... వాళ్లంతా పిచ్చి వెధవలు కారుగా!!"

"సరే రామేశంగారూ! ఈ విషయాలన్నీ నాబోటివాళ్ల జీవన విధానంలో ఎక్కడా తగలవు... దేముడు, మడి ఆచారం. గుళ్లు, సంస్కృతంలో ఉండే మంత్రాలు—అన్నీ లౌకికంగా మనకెంత ఉపయోగమనే కానీ, మరొక రకమైన జ్ఞానానికి ఇవన్నీ దారులని నాకు తెలియదు. కానీ వాటి వెనకాల ఉన్న ఈ భగవంతుడేమిటసలు ?! ఇన్ని మైక్రోస్కోపులు, టెలిస్కోపుల్లో ఎక్కడా అంతు చిక్కడే ఆయన?!

గట్టిగా నవ్వేశారు రామేశంగారు.

"వెనకటికి మీలాంటివాడే 'వీణ అంతా విరక్కొట్టి చూశాను సంగీతం కనబడలేదు' అన్నాడట. అలా ఉంది బాబుగారూ ! కాస్మిక్ ఎనర్జీ మానిఫెస్ట్ అవడానికి, నామరూపాలు పొందడానికి కావలసిన వాతావరణం ఏర్పడినప్పుడు తప్పకుండా అది జరిగి తీరుతుంది. హిరణ్యకశిపుడికి స్థంభంలో కనబడ్డాడన్నా అదే... మరొకడైనా అదే. కానీ, సృష్టి శక్తి ఒక మతం పరిధుల్లో కట్టుబడదు.... మనిషి బుర్రకు అందదు... ధ్యానానికి, యోగానికి అందాలి అంతే..."

"రామేశంగారూ! మీ రెప్పడైనా దేముణ్ని చూశారా?" గబుక్కున చిన్న పిల్లాడిలా అడిగాడు శంకరం.

"ఎక్కడ లేడండీ! మీలో, నాలో, సర్వసృష్టిలో కాంతిగా, గాలిగా, తేజస్సుగా, ప్రాణశక్తిగా ఓహ్...ఎక్కడ లేదా శక్తి?"

ఆయన గుండ్రని కళ్లల్లో నీళ్లు... ఒంట్లో ఏదో పులకరింత..శంకరం ఒళ్లు ఝల్లుమన్నది.

"మరి ఎలా గుర్తించాలండీ దాన్ని?"

"బాబుగారూ! మన చుట్టూ రేడియో శబ్ద తరంగాలు, టి.వి. తాలూకు కాంతి తరంగాలునిరంతరం వ్యాపించే ఉన్నాయి. అయినా ట్రాన్స్‌మీటర్ ఆన్ చేస్తే కానీ లయ కుదిరి మీకు పాటగానో, ఛాయాచిత్రంగానో రావడం లేదు. మనలో ట్రాన్స్‌మీటర్‌ను ట్యూన్ చెయ్యగలిగిన రోజు ఈ సమస్య ఉండదు"

'రాధామాధవం పూలకొమ్మ కదులుతోంది. లోపలినుంచి రామేశంగారి భార్యగారి బరువైన మట్టెల శబ్దం...దూరంగా గాలికి కదిలే మామిడి చెట్టు హోరు.... ప్రకృతిలో ఏదో మధురిమ..చూడగలిగిన చూపు, వినగలిగిన మనసు ఉంటే...

'ఇదేమిటి? రామేశంగారి పిచ్చి నాకూ ఎక్కుతోంది ఏమిటి?' అనుకున్నాడు శంకరం.

"మనకు వచ్చే క్లయిర్ వాయిస్‌లు, క్లయిర్ ఆడియన్స్‌లు ఇవన్నీ మనకున్న చూసేశక్తి, వినేశక్తి తాలూకు ఎదుగుదలే బాబుగారూ! గుర్తింపు అంతే"

"బాబుగారూ ! మీ కాశక్తులు

ఉన్నాయా?" విస్మయంగా అడిగాడు శంకరం.

"ఉన్నాయా, లేవా అన్నది ప్రశ్నకాదు. నమ్మి నేను దీక్షతో ఆచరిస్తున్న ఈ నాయోగంలో ఆ శక్తులన్నీ కొన్ని భాగాలు. కానీ, ఎప్పుడైతే మనలో 'తనయందు, నిఖిల భూతములయందు ఒక భంగి' అనే తత్వం చచ్చిపోతుందో, ఎప్పుడు అసూయా, ద్వేషం, స్వార్థం నిద్రలేస్తాయో, ఈ వచ్చిన కొద్ది శక్తుల్నీ మన స్వార్థం కోసరం ఉపయోగించుకోవడం ప్రారంభిస్తాము. అక్కడితో ఈ సాధన గమ్యం చేరకుండానే ఆగిపోతుంది. తెలియక కొందరు బాధపడుతూంటే, తెలిసీ అజ్ఞానంలో కొందరు పడుతున్నారు. ఈ నిరంతర పాంథశాలలో మన మజిలీ శాశ్వతమనుకోవడం ఎంత పిచ్చితనం! ఈ కాస్త నిరీక్షణలో మరిన్ని పాపాలు చేసి, మరొక జీవితానికీ, కర్మకు కారకులవడం ఎంత అన్యాయం!

మన తెల్ల షర్టు మీద ఎవరైనా ఇంకు పోస్తే భరించలేం. కానీ, తెల్లకాయితంలా, శుభ్ర వస్త్రంలా ఉండే జీవితాన్ని మనమే అలికి అసహ్యం చేసుకుంటున్నాం తెలియక. ఎంత ఘోరం, ఎంత అజ్ఞానం" ఆయన గొంతులోని నిర్వేదంలో చరాచర ప్రపంచం కోసరం పడే బాధ ఉంది.... దాని అజ్ఞానం పట్ల జాలి ఉంది.

చీకటి పడుతోంది. శంకరం ఏం మాట్లాడలేదు. రామేశంగారి మాటలు అతని మీద పని చేస్తున్నాయి. కానీ, ఏదో చీల్చలేని తెర ఆలోచించనీయ



డంలేదు. ఈ గోలంతా నాకెందుకు అని దులుపుకు పోదామనిపిస్తోంది. కానీ, వద్దన్నా రామేశంగారు, ఉమ ఉత్తరం అతని మనసును, బుద్ధిని ఆలోచింపేట్లు చేస్తున్నాయి.

"నేను వెళుతున్నాను" అని లేచాడు శంకరం.

"ఇవిగో ఇవి తీసుకు వెళ్ళండి"

ఆయన చేతుల్లో ఏవో పుస్తకాలు. ఏ భగవద్గీతో, దేవీపురాణమో ఇస్తాడేమోరా భగవంతుడా అనుకుంటూ తీసుకున్నాడు అతను.

"మీకు తెలుగులో చెప్పేవాటికన్న ఇంగ్లీషులో చెప్పేవి రుచిస్తాయి. పైగా పరాయివాళ్లు చెబితే మనకు బాగుంటుంది చూడండి" చిన్నపిల్లాడిలా హాయిగా నవ్వుతూ పుస్తకాలు చూపించారు. ఏవేవో ఇంగ్లీషు పుస్తకాలు...

అవి తీసుకుని గుమ్మం దాటుతూ వెనక్కి చూశాడు శంకరం. చేతులు కట్టుకుని అతనివంకే చూస్తున్నాడు రామేశంగారు. ఆయన కళ్ళల్లో ఏదో శక్తి ఉన్నది. ఏమిటది? సూదంటురాయిలా అతన్ని ఆకర్షిస్తోంది. కొంపతీసి, హిప్నటైజ్ చెయ్యడమంటే ఇదేనా? భగవంతుడనే మత్తు కాబట్టి, ఇది "డివైన్ హిప్నటిజం" అయి ఉండాలి.

'దేముడా! నువ్వంటూ నిజంగా ఉంటే నీకు రామేశంగారిలాంటి వ్యక్తులు చాలా అవసరం' అనుకుంటూ బయటకు వచ్చాడు శంకరం.

* * *

రాగానే చదవడం ప్రారంభించిన ఆ పుస్తకాలు, చాలా వరకు శంకరం కాలాన్ని తినేశాయి. మంచో, చెడో అతని బుర్ర ఆలోచించడం ప్రారంభించింది. ఎందుకో రామేశంగారు చెప్పినట్లు ప్రతిరోజూ పది నిమిషాలు ఉమ కోసరం ప్రార్థించడం ప్రారంభించాడు. నిజానికి, ఆ ధ్యానం ఎలా చెయ్యాలోకూడా అతనికి తెలియదు. రామేశంగారినే అడగాలంటే అభిమానం అడ్డువచ్చింది.

ఈఉత్తరానికి లౌకిక పరిష్కారం ఏమిటని అడగబోతే ఇందులో ఇరికించాడాయె. పైకి చెప్పలేదుగానీ, శంకరానికి ఎంత మేనకోడలైనా, ఇలా పిలిస్తే వచ్చి తనను పట్టుకుంటుందేమోనన్న భయం చాలాఉంది. అందుకని శుభ్రంగా ఆంజనేయస్వామి పటం ముందు నిలబడి, హనుమాన్ ఛాలీసా చదివేసుకుని, ఆ తరవాత–

"అమ్మా ఉమా! ఎక్కడున్నావో కానీ, నా ప్రార్థనవల్ల నీకు ఆత్మశాంతి కలగాలమ్మా! నా దైవప్రార్థన నీకు దారి చూపాలి" అని ప్రార్థించడం ప్రారంభించాడు.

'ఆ! ఈ కాసిని మాటలకే ఆత్మశాంతా, నా మొహమా? అలాంటప్పుడు ఈ బ్రాహ్మలు, ఈ మంత్రాలు, ఈ ఖర్చు ఇవన్నీ ఎందుకట?' అని తను చేస్తున్నపనిని తనే శంకించుకుని విమర్శించుకోబోయేవాడుకానీ, "జాగ్రత్త. మనస్ఫూర్తిగా చెయ్యండి" అన్న రామేశంగారి మాటలు వినిపించేవి. ఒక రకంగా ఉమ అంటే అదివరకున్న అభిమానం, ఉమ అంటే ఏమిటో తెలిసిన తరవాత ఇప్పుడు ఏర్పడ్డ ఆప్యాయత అతని ధ్యానానికి ఏకాగ్రత ఇచ్చాయి.

ఈలోపల "ఏంచేద్దాం సార్?" అంటూ రెండుసార్లు వచ్చివెళ్ళాడు విరించి!

ఏం చెప్పాలి?

"ఆదివారం, అమావాస్య వచ్చాయి.




రండి. అమ్మాయి పేరన ఎవరైనా బీద ముత్తైదువుకు చీర, జాకెట్టు దానంచేద్దాం" అన్నారు రామేశంగారు వచ్చి ఒకరోజు.

ఈ తమాషా ఏమిటి అనుకుంటూ బయలుదేరాడు శంకరం. ఆయనే చీర, మిగిలిన సామాగ్రి ఏమిటేమిటో కొన్నారు.

"అయ్యో! ఆ ఖర్చంతా మీకెందు కండీ?" అన్నాడు శంకరం.

"బాబుగారూ! ఈ 'నీలు', 'నాలు' మన పరిధుల్లోవి. ఒక్కసారిఆబిడ్డకోసరం ప్రార్థించడం ప్రారంభించిన తరవాత చీకట్లో తారాడుతున్న ఆమెకు 'ఆ పెంజీకటి చాటు ఏకాకృతి' అర్థమయ్యే దాకా ఆమె నా బిడ్డే. పదండి..." అన్నారు.

శంకరం ఏనాడూ మేనకోడలుకు పట్టుమని పదిరూపాయల జాకెట్టు గుడ్డ పెట్టలేదు.

'మరి ఈయనేమిటి? ఈ ఆధ్యాత్మికతలోనే ఈ ఆర్ద్రత, భావన ఉంటాయా?' అనుకున్నాడు.

సముద్రపు ఒడ్డున ఏదో క్రతువుచేసి దానమిచ్చాడు ఆయన. అంత ఖర్చు ఆయనదే కాబట్టి చూస్తూ కూర్చున్నాడు శంకరం.

మరునాటి సాయంత్రం విరించి వచ్చాడు.

* * *

"సార్! ఉమగారి లెటర్ గురించి మర్చిపోదాం. పబ్లిషింగ్ వద్దు" అన్నాడు.

"అదేం?" అన్నాడు శంకరం.

"ఏంలేదుసార్" నట్టుతూ అని, "అది కలో లేక నా భ్రమో తెలియదు సార్.. ఆమె నాకు కనబడ్డారు" అన్నాడు.

"ఎప్పుడు?" కుర్చీలో నిటారుగా కూర్చుంటూ అడిగాడు శంకరం.

"సన్న కనబడి 'విరించీ! నాకిప్పుడు చాలా అర్థమౌతోంది. ఏదో కొత్తదారి అర్థమౌతోంది. భావాలు, బాధలు, ఆదేహం, గేహం వాటి తాలూకువి. తెలుసుకోవలసినది చాలావుంది. వెళ్ళిపోతున్నాను నేను. ఈ ఉత్తరంతో పనైపోయింది' అని నా పుస్తకాల టేబుల్ కు ఆనుకుని చెప్పింది సార్. ఏమిటో నాకేం అర్థం కావడం లేదు"

"నా మొహం. నీ ఊహ అయ్యుంటుంది" కొట్టిపారేస్తూఅన్నాడు శంకరం.

"సార్! నా ఊహే అయితే, నా ఆలోచనతో జతపడాలి, సరిపడాలి. వ్యతిరేకంగా ఎందుకు చెపుతుంది?"

"విరించీ! ఉమ ఆత్మకు శాంతి కలగాలని ప్రార్థించు. నీకుండే ప్రేమతో లస్తే తప్పకుండా జరుగుతుంది"

విరించి మాట్లాడలేదు కాసేపు. అతని కళ్ళల్లో నీరు.

'మీరు ఆత్మలు, ఈ తుక్కూ ముగరా నమ్ముతారా సార్?' అని ఆ కుర్ర జర్నలిస్ట్ దుమ్ము దులిపితే, తనకు తెలిసిన మిడిమిడి జ్ఞానంతో ఏంచెప్పాలా అని ఆలోచిస్తున్నాడు శంకరం.

"సార్! నిజంగా నేను ప్రార్థిస్తే ఆమెకు ఏదన్నా మేలు జరుగుతుందంటే, తప్పకుండా చేస్తాను సార్. వస్తాను" అన్నాడు.

"విరించీ!"

ఆగాడు.

"రాఘవ ఎలా ఉన్నాడు?"

"ఎలా ఉంటాడు? చాలా మారాడు సార్. ఆ సినిసిజం, ప్రపంచం అంటే ఉన్న మోకరీ తగ్గిపోయింది. తనకు తెలిసిన దానికి నిజాయితీ జోడించి చెబుదామనే ప్రయత్నంలో పడ్డాడు. ఉమ రాశారుగా – నిజాయితీ అయిన

కావలసిన సాధనసంపత్తిని సమకూర్చు కుంటాడు. టెస్ట్‌ట్యూబ్, ఆసిడ్స్ ఒక పరిశోధనకు అవసరమయితే నా మార్గానికి ఈ సాధనసంపత్తులు అవసరం. అంతే"

విప్పారిన కళ్ళతో చూస్తూ ఉండిపోయాడు శంకరం. మెల్లిగా విరించి సంగతి చెప్పాడు.

తీసుకువచ్చిన పుస్తకాలు ఇచ్చేస్తూ, "బాబుగారూ! ఇన్ని చదివినమీదట వీటన్నింటికీ ఎక్కడో లింకు ఉందని పిస్తోంది. ఏమిటో నా బుర్రకు అందడం లేదు. తెలుసుకునేదాకా ఏ కర్మకాండలు చేసినా ఫరవాలేదు. తెలిసిన తరవాత ఈ క్రతువులు వృధా అన్న థియరీ ఏమిటి? మరి మీ ఆదివారం, అమావాస్య తర్పణం ఏమిటి?!"

దూరంనుంచి ఇంటివారి అమ్మాయి వీణా వాయిద్యము, ఎక్కడో వ్రతంగి పనివాళ్ళ సందడి-ఇవన్నీదాటి రామేశంగారి గొంతు ఖంగుమన్నది.

"ఒక్కొక్కడు ఒక్కొక్క మార్గాన్ని ఆ జ్ఞానప్రవాతను కలుసుకోడానికి ఎన్నుకుంటారు. నేను వేదకర్మలకు అలవాటయిన కుటుంబంలో పుట్టాను. ఈ పద్ధతులకు అలవాటు పడ్డాను. కానీ ఈ తంతు యజ్ఞంగా, కేవలం ఉచ్చాటన మంత్రంగా మారటానికి మధ్య ఒక గొప్ప ప్రక్రియ ఉన్నది. అది 'నిన్ను నువ్వు తెలుసుకోవడం' ద్వారా సంక్రమిస్తుంది. ఆ ప్రక్రియమాత్రం అన్ని మతాలకూ, అన్ని సిద్ధాంతాలకూ ఒకటే.

"ప్రతి నమ్మకంలోదుష్టత్వానికీ, దైవత్వానికీ మధ్య ఉన్న సుదూర మార్గాన్ని దాటే పద్ధతి తెలిసే విధానం ఉంటుంది. మనిషి చచ్చిపోవడంతో సమస్య ఆగిపోవడం లేదు. కాజ్ అండ్ ఎఫెక్ట్ థియరీ ప్రకారం మళ్ళీ పుట్టుక, అనుభవం ఉన్నది. పెద్దవాడైన మనిషి చనిపోయినా చెడ్డతనం మర్చిపోవడం లేదు. అందుకని చంపవలసిన దేమిటంటే అజ్ఞానాన్ని, దానికి కారణభూతమైన అహంకారాన్ని"

శంకరం ఊపిరి పీల్చడం మర్చిపోయి వింటున్నాడు.

"ఊఁ! దీపంతో భగవద్గీత చదవచ్చు, ఒళ్ళూకాల్చుకోవచ్చు. అజ్ఞానం సర్వజగతికీ సృష్టికీ ఎంత ప్రమాదమో తెలియజెప్పడానికి ఈ పురాణాలు పుట్టాయి. కానీ, మన ఖర్మ. మనం విషయం తప్పించి, కథలు జ్ఞాపకం పెట్టుకుంటాము. దేవీ భాగవతం చదివితే, మనకు శ్రీదేవీ శక్తి ఎలా లక్ష్మి, సరస్వతీ, పార్వతి గాయత్రి, రాధ, సావిత్రులుగా రూపాంతరం పొందిందో తెలుసుకుంటాం. కానీ, మళ్ళీ రాధ కృష్ణుడి మేనత్తని, దేముడు కాబట్టి ఏ వెధవ పనులు చేసినా సరిపోయె అని వెకిలిగా మన ఈ దిక్కుమాలిన సంబంధాలు వాళ్ళకి అంటగట్టి ఆనందిస్తాం. లక్ష్మి సరస్వతిలలో బీజాక్షర సంపుటీకరణంలో మార్పు తప్ప శక్తి భేద లేదని చదువుతూనే, వాళ్ళిద్దరు అత్తాకోడళ్ళనీ, వాళ్ళకు పడదనే కవి చమత్కారం రుచించినట్లు నిజం రుచించదు. అర్థంకాదు. అసలు నా ఉద్దేశ్యం ఏమిటంటే, దైవత్వాన్ని, మన స్థాయికి దించి, మాలో నువ్వూ కలిశావు అనే వెకిలి దంభత్వం మనలో ఉన్నది. ఘోరమైన పతనానికి ఇంతకన్న నిర్వచనం ఏమిటి?! ఈ జీమూతం తొలగాలంటే మనస్సును ప్రాభావితం చేసే మహాశక్తి గురు రూపంలోనో, మరొక రూపంలోనో వచ్చి మనసు తట్టి లేపితేకానీ, ఈ



మృత్యుసమాన నిద్రావస్థలోనుంచి లేవము. అందుకే ఎవరి దారి ఏదైనా, ప్రక్రియ ఏదైనా, వెనకాల ఆశయం 'సత్యాన్వేషణ' కావాలి."

శంకరానికి ఎందుకో ఉమ చెప్పిన ఏ మిథ్యా ఆడంబరం లేని ఫాట్ కావాలి- అన్నమాట గుర్తుకు వచ్చింది. ఏమిటి దంతా? జీవితంలో యాభైఐదు సంవత్సరాలు అసలు ఇటువంటి విషయాలు 'మనకెందుకులే' అనే గడిపేశాడు తను. దానివలన తనేం నష్టపోలేదు ప్రాపంచికంగా ... కానీ, తనది గుడ్డి వాడి ప్రపంచం. సౌందర్యం కనిపిస్తేగా పోయిందన్న బాధ. ఇప్పుడు...

"బాబుగారూ! జీవిత సంధ్యాకాలంలో ఉన్నవాడిని.... ఇప్పుడేవో నేర్చుకుని, చదువుకుని చేసే ఓపికాలేదు. తెలియవు కూడా. ఏదో జడుడిలా నిద్రిస్తున్న నన్ను మీరు అనవసరంగా నిద్రలేపారు. ఇప్పుడీ తపన ప్రారంభమైంది. ఏం చెయ్యను నేను?!"

ఖంగుమని సమాధానం ఇచ్చారు రామేశంగారు,

"ధ్యానం. చాలు.. అన్ని ఆలోచనలను ఆపేసి, నిశ్శబ్ద స్పందనలోనుంచి వినిపించే ఆత్మజ్ఞానాన్ని అర్థం చేసుకోండి. ఒక్కసారి మీలో ఏడుపొరల వెనకాల ఉన్న ఆత్మను నిద్రలేపి,నిజమైన శక్తి ఏమిటో తెలిస్తే సృష్టిలో ప్రతి ఒక్కటి గురువే అవుతుంది. దత్తాత్రేయులకు వెన్నెల, సూర్యుడు, పక్షి, చెట్టు, పుట్ట తదితరమైనవన్నీ కలిపి ఇరవై నాలుగు మంది గురువులట.

'నా ఉచ్ఛ్వాసనిశ్వాసలు, స్నానం నడక, మాట అన్నీ నీ పూజలే తల్లీ' అన్నారు సౌందర్యలహరిలో. అన్నింటినీ హృదయంతో అర్థం చేసుకుని, మేధస్సుతో ఆలోచించండి.

'కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా నభవతి'" (తల్లీ! చెడ్డ బిడ్డ ఉంటాడేమో కానీ, లోకాన చెడ్డ తల్లి ఉండదు కదా) అన్నారు కళ్ళంబడి నీళ్ళతో జ్ఞానచక్షువులకు కనబడే శక్తికి సమస్కరిస్తూ.

* * *

శంకరంగారి దగ్గర నుంచి నేరుగా వచ్చిన విరించి, తండ్రికి జబ్బుగా ఉన్న దన్న టెలిగ్రాం చూసి రైలు ఎక్కాడు.

మానవత్వానికి జడత్వం నించి ఒక ప్రేరణ కావాలి. అది ఏరూపంలో జరుగుతుందో చెప్పలేం. ఉమ స్నేహ మాధుర్యంతో విరించి ఈ జీవన నాటకాలకి సమీక్షకుడయ్యాడు.

అతను వెళ్లేటప్పటికే తండ్రి పోయాడు.

పదమూడు రోజుల ఖర్మ... మంచం మీదనుంచి లేవలేని తల్లికి వైధవ్యం...

"పార్వతీదేవి లాంటి అత్తయ్యను ఇలా చూడలేనయ్యా?" అని వెక్కి వెక్కి ఏడుస్తోంది సుభద్ర. ఆమె వంకే చూస్తూ కూర్చున్నాడు విరించి. అతనికీ కళ్లంబడి నీళ్లు వచ్చాయి... ఈ దుఃఖం ఎంత గొప్పది? ఎంత పవిత్రమైనది?! ఎంత శాంతి దీని వల్ల? వదిన దుఃఖంలో అమ్మ తప్పులూ, అమ్మ పెట్టిన బాధలు చోటు చేసుకోవు...అనుకున్నాడు.

రఘు, అతని భార్య వచ్చారు.

చాలా మాటరాఫ్ ఫాక్ట్‌గా చితిదగ్గర రెండు చేతులూ కట్టుకుని నిలబడి చూస్తున్నాడు అతను.

'వీడికి అసలు ఫీలింగ్స్ ఉండవా?' అనిపించింది విరించికి.

 

"ఎందుకురా! ఫీలవ్వనిది చెప్పే హిపో క్రసీ నాకు లేదు. ఫీలయ్యేవి చెప్తే ప్రపం చానికి అఖ్ఖర్లేదు... పైగా ఊరుకోదు.... లెటిట్ గో టు హెల్..." అన్నాడు.

రఘు భార్యలో కనబడే సున్నితత్వం వెనకాల ఏదో తెలియని కాఠిన్యమున్నది... ఆ మృదుత్వం లేత చిగురాకు వంటిది కాదు. ఉలిపిరి కాగితం లాంటిది. ఏది ముట్టుకున్నా సున్నితంగా ఉండాలని, మునివేళ్ళ తప్ప మరే అవయవాలు పని చెయ్యనట్లు ప్రవర్తించాలనే తపన ఉన్నది ఆమెలో. అది అందరూ చూడాలనీ, అందులో ఈ అనాగరికత మధ్య తనకొక ప్రత్యేకత కావలనుకునే 'ఈగో' ఉన్నది.

సుభద్ర చిక్కిపోయింది. నల్లబడు తోంది. కాటుక కళ్ళ కిందికి నీలినీడలు వచ్చేస్తున్నాయి. కచ్చిక, బూడిదతో అంట్లు తోమిన చేతులకు అప్పుడప్పుడు గోరింటాకు తప్ప మరే అనులేపనం లేదు. వేలుముడి తప్ప ఈమధ్య జడకూడా వేసుకోవడం లేదు. ఈ ఇల్లాలు మరొక ఆడదాని కష్టాలు ఆలోచిస్తోంది. చిన్న వదినకు ఈవిడ అంటే ఇష్టం లేదు, అయిష్టం లేదు.... వదినంటే తన భర్తకు ఎంత గౌరవమో తెలుస్తుందా ఈమెకు ఎప్పుడైనా? ఆ అవకాశం ఈ జన్మకు రాదు... కొన్ని అంతే..ఎందుకో 'ఉమ' గుర్తుకు వచ్చింది విరించికి.... వదినకు చెప్పాలనిపించింది.

బంధువులంతా ఎక్కడి వాళ్ళక్కడ సర్దుకున్నారు.

"వాడు నీ మాట వింటాడు చెప్పవే" అత్తగారు సతాయిస్తోంది దేన్నిగురించో సుభద్రను.

"ఆ ఒక్కటీ అడక్కండి నన్ను... నాకు తెలియదు..." అని వెళ్ళిపోయింది సుభద్ర. ఎంతో సహనంగా ఉండే ఆమె మాటల్లో అణుచుకున్న ఆవేశం వినిపించి ఉలిక్కిపడి, తల్లిగదిలోకి వెళ్ళాడు విరించి.

"ఏమిటమ్మా?"

"చూడరా! ఆ రఘుగాడు పెళ్లాం మాటవిని ఆ నాలుగెకరాల కొండ్రా అమ్ముకుపోతాడట. ఇక్కడ ఇంటికి వచ్చేది ఒళ్ళో బెట్టనా, దళ్ళో పెట్టనా అన్నట్లుంది. ఆ నాలుగెకరాల ఆయివేజూ ఉంటే కాస్త కాలం హాయిగా గడుస్తుంది. వాడేదో గడిస్తున్నాడు. వాడి పెళ్లాం తరఫున బోలెడాస్తి. వాణ్ణి నోరుదెరిచి అడగవే అంటే నిక్కుతోంది. ఏం చూసుకుని ఆ విరగబాటు? కాట్లో ఒక కాలున్నదాన్ని నా కోసరమా?"

తలుపుకు ఆనుకుని ఆవిడనే చూస్తు న్నాడు విరించి.

"అమ్మ" — ఈ పదానికి అర్థమేమి టసలు? ఎంత పరోక్షంగా వదిన చేత అడిగించి పని జరిపించుకోవాలను కొంటోంది? ఆ మనస్తత్వంలో ఎంత వెలితి? ఎంత మురికి? ఇప్పటికీ కోడలి మీద నమ్మకమూలేదు, ఇష్టమూ లేదు. కానీ, ఆవిడ ఆత్మాభిమానాన్ని తను సులభంగా తాకట్టు పెడదామను కుంటోంది నాలుగెకరాల కోసరం...ఏం మనుషులూ? నిజం 'ఉమ' రాసింది. ఛాట్‌లో లేని నిజాయితీ — నిజాయితీ ఛాట్‌లో ఉంటే అన్నీ సజావుగా ఉంటాయి. అసహ్యమనిపించి, మారు మాట్లాడకుండా బయటకు వచ్చేశాడు.

ఆ సాయంత్రం పొలం అమ్మడానికి బయానా తీసుకున్నాడు రఘు.

పొలాల గట్లమీద నడుస్తున్నారు

ఇద్దరన్నదమ్ములు. పెద్దన్నయ్య పనిమీద పక్కఊరికి వెళ్లాడు. ఇంటి పరిస్థితి చెప్పాలనుంది విరించికి. కానీ పత్రికలో ఉద్యోగం చేస్తూ నెలకు ఏ వందో ఇంటికి పంపే తను వాడిని ఆలోచించరా అని ఏమని అడగగలడు? అయినా చెప్పాలి.



"ఇంటి పరిస్థితి బాగాలేదురా"

మాట్లాడలేదు రఘు.

"ఈ పొలం కూడా అమ్మితే వాళ్లు మరీ రోడ్డున పడతారేమో"



ఆలోచిస్తున్నాడు రఘు.

"మధ్యాహ్నం అమ్మ అంటోందిరా"

"విన్నాను" ఆ గొంతులో రాయి కుండే కాఠిన్యం ఉంది.

"ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు విరించి.

"వదినను అమ్మ నన్ను అడగ మనటం.... ఒరేయ్..." అంటూ గిర్రున తిరిగి "మీరందరూ వెధవ కాయితాలు ఖరాబు చెయ్యటమేకానీ ఈ పరిస్థితులకు నిప్పుపెట్టే ఒక ఉద్యమం లేవదీయ రాదుటరా. ఆ ముసలావిడ నన్ను అడ్డం పెట్టుకుని వదినను పెట్టిన నరకం, నోట్లో నాలిక లేనట్లు కనబడే అన్నయ్య పెట్టిన చెర నాకు తెలియదనుకుంటు న్నావురా! అప్పుడు చెయ్యని తప్పుకు ఆవిడకు నరకం చూపెట్టారు. ఇప్పుడు ఆనాటి నా బలహీనతను ఆసరాచేసుకుని లొంగదీద్దామని ప్రయత్నిస్తున్నారు. ఆవిడ సుభద్ర కాబట్టి సరిపోయింది. ఛీ! వాళ్ళకు తల్లి,తండ్రి, అక్క, తమ్ముడు– ఈ గౌరవాలిచ్చి ఇంకా ఆలోచించమంటు



న్నావా?"

మాట్లాడలేదు విరించి. కొన్ని కొన్ని అసహ్యకరమైన పరిస్థితుల గురించి ఆలోచించడంకన్న ఎదుర్కోవడం సులభం.

"కానీ వదినే సర్దలేక చచ్చిపోతుందిరా! ప్రతి సంవత్సరం అక్కయ్యల రాకపోకలు, పెట్టుబళ్ళు, అమ్మకు మందులు...ఏమిటో"

"ఒరేయ్! నేనిచ్చేది వదినకు ఉపయోగిస్తుంది అంటే ఈ క్షణం వదిలి వెళ్ళిపోతాను. వచ్చిననాటినుంచి చూస్తున్నాను. ఆవిడకు లెక్కకు నాలుగు చీరలున్నాయిరా. మనిషిని చూశావా—ఖాళీగా ఒక్క క్షణం కూర్చుంటే పాపం అన్నట్లు ఈ దిక్కుమాలిన దుర్వాసన కొట్టే కొంపకు సుగంధ లేపనాలు అద్దుదామని చందనపు కట్టెలా అరుగుతోంది. ఈ పది రోజులుగా ఇరవై ముప్పైమందికి వండి వారుస్తోంది. నా డబ్బు ఆవిడను ఈ కష్టాల్లోనించి తప్పిస్తుందంటే ఇప్పటికిప్పుడు రాసిస్తా. లాభం లేదురా... ఈ దిక్కుమాలిన పరిస్థితులు, ఈ ముడతలుపడికుంచుకుపోయిన మనుష్యులు మారరు. భస్మం...భస్మం అయిపోవాలి. అంతే" అతడి మాటల్లో ఆవేశం. అణుచుకుని లావాలా బైటపడే ఆ ఆవేశం ఎంత భయంకరమైనదో తెలుసు విరించికి.

ఏం మాట్లాడలేదతను. నది ఒడ్డున నడుస్తున్నారు. ఊరంతా మురికిచేసినా ఎందుకో జనం ఆ ఒడ్డు ఊరికి దూరంగా ఉందనేమో వదిలిపెట్టారు.

సాయంత్రపు సూర్యకిరణాల్లో ఎండ తళుక్కుమంటోంది. "పందికొక్కు తవ్విన మట్టిలో గాజుముక్కల్లా ఆలోచనలు" ఎక్కడో చదివిన మాటలు గుర్తుకువచ్చాయి విరించికి.

నదిపై పున్నాగ పువ్వులు తేరు కట్టాయి. ఈ నదిలోనే రఘు వదిన పూజకు పూవులు కోయబోయి దెబ్బలు తగిలించుకున్నాడు. అప్పుడవన్నీ ముళ్ళ కంచెలు. ఇప్పుడా ప్రదేశమంతా ఏవో పేరు తెలియని పసుపు పూవులు.

ఎదురుగా ఉన్న రాయిని ఫతేలుమని తన్నాడు రఘు. అతని పెదవి బిగింపులో కచ్చ, అతనిలో అణచిపెట్టిన లావా గాడ్పులు, గుండెల్లో మంటలు. బైట ప్రపంచంలో బిజినెస్‌మాన్‌గా చాలా లౌక్యుడిలా ప్రవర్తించే రఘులో ఇంత మానసిక సంఘర్షణ, ఆవేదన ఏమిటసలు? ఏ మహాకవో, కళాకారుడో ఈ గుణాలతో ప్రభావితుడయ్యాడంటే అది వేరు. అసలు వీడి జీవితానికి, ఆలోచనలకు సామరస్యం ఏమిటి?

"ఎప్పుడో ఇవన్నీ వదిలిపెట్టి పేరు తెలియని ఊరులో నేనెవరో తెలియకుండా బతికేస్తాను చూడు..." ఏదో చెప్తున్నాడు రఘు. ఎక్కడో చదివిన వాక్యాలు గుర్తుకువచ్చాయి విరించికి. మనిషిలో ఏడు శరీరాలు ఉంటాయిట. ఇతనిలో ఈ రఘు నిజం. కానీ ఈ కబుర్లూ, ఈ సెంటిమెంట్లూ, ఈ నది ఒడ్డున ఊహలు మేటలు వేసే చోటునే. ఊళ్ళో ప్రవేశించగానే ఎకరాల రేటు, పాలిష్టర్ షర్టు ఖరీదులు, ఇంపోర్టెడ్ వస్తువుల మోజు—మళ్ళీ మామూలు రఘు. ఆ రఘూ నిజమే. పరిస్థితుల ప్రభావంవల్ల ఒక మనిషి బయటకు వచ్చి మిగతా రూపాలు అడుక్కు వెళ్ళిపోతాయి. అందుకే సాంగత్యంలో ఉంటుంది సంగతంతా అంటారు

ఎన్నో భావ సంఘర్షణలను కంపోజ్ చేసి ఫ్రేముల్లో ఇరికించి 'కాలం'గా కుదించడం చూసిన విరించికి ఇప్పుడు




ఇవి ఏవీ కొత్తగా అనిపించవు...ఈ ఇద్దరు రఘులూ నిజమే... ఈ ఇద్దరేమిటి? ఇంకా ఎన్ని స్వరూపాలు లోపలనించి విస్తరించి రూపు కట్టుకోబోయి ఆగిపోతాయో! అసలు ఏది నిజం? ఇవన్నీ ఎక్కడివి? మనస్సు ఛాలసలోనివా? ఏది శాశ్వతం? ఈ క్షణమేనా?! దానిమీద పాత అనుభవాల నీడలు, రేపటి కలల తెరలు లేకపోతే ఈ క్షణం...ఈక్షణంగా ఏమిటసలు?!

ఎందుకో రాఘవ గుర్తుకు వచ్చాడు విరించికి. సరిగ్గా ఇక్కడే పట్టుజారిపో బోయిన రాఘవ 'ఉమ' అనే ఒక ఫినామినన్‌తో మార్పు చెందాడు. ఉమ పోయిన తరవాత రాఘవలో మార్పేమిటో అతనే ఎనలైజ్ చేసుకోలేదేమో! అతని చుట్టూ ఉన్న చాలా మందికి తెలియదు కూడా.. దగ్గరతనం అసలు మనిషిని తెలుసుకోడానికి చాలాసార్లు ఉపయోగించదు. ఒక పదిసార్లు కలుసుకొని, కొన్ని గంటలు మాత్రం చూసిన ఉమకు తెలిసిన రాఘవ, పదిహేనేళ్ళుగా అతనితో కలిసి కాపురం చేస్తున్న భార్యకు తెలియదు.

పాపపుణ్యాలు, తత్వాలు — అతను వీటన్నిటినీ మించిపోయి ఆలోచిస్తున్నాడిప్పుడు.తిరిగి చూసినా అర్థం చెప్పుకోలేని అనుభవాల మధ్యగాచూసుకువచ్చే కిరణాలతో స్వప్న జగత్తులోని నీహారికలకు అమృతత్వాన్ని ప్రాప్తింపచేస్తున్నాడు. అతని గాయం కనబడనిది... అతని కన్నీళ్ల రూపం లేనివి...దుఃఖం అంతం లేనిది.

అన్నదమ్ములిద్దరూ ఎవరి ఆలోచనతో వారు ఇంటికి చేరారు. పశువుల కొట్టం నుంచి బయటకు వస్తూ–

"అన్నం పెడతాను రండయ్యా!" అంటూ లోపలికి వెళ్ళింది సుభద్ర.

వంటింట్లో గోడకానుకుని ఏదో ఇంగ్లీషు నవల చదువుతోంది లక్ష్మి. గదిలోనుంచి దుర్గమ్మగారి మూలుగు. నిద్రగన్నేరు మత్తులో జోగాడుతోంది.

ఈ ఇంట్లో ఏదో వెలితి! ఏమిటది? ఎవరి జీవితాల్లో వెలితి వారికి చిల్లిపడ్డ డప్పులా మోతలో ఏదో అపశ్రుతిద్వారా తెలుస్తుంది. ఇది అని తెలియదు. ఆలోచిస్తూనే అన్నానికి కూర్చున్నాడు విరించి.

* * *

"వదినా!"

"ఏమిటయ్యా?" అప్పడాలు చేసుకుంటూ అన్నది సుభద్ర. ఉన్న అప్పడాలు, వడియాలు తోడికోడలకు మూట కట్టి ఇచ్చింది. "పల్లెటూరి తిళ్లు అనుకోకమ్మా! మా రఘుకు ఇష్టం.." అని పులిహోర, గోంగూర ఇచ్చింది. ఇప్పుడు మళ్ళీ తమకోసరం కాబోలు....

"ఏమిటయ్యా! చెప్పవేం?

"నీకు ఒక అమ్మాయి గురించి చెప్పాలి."

తలెత్తి చూసి సన్నగా నవ్వింది.

"ఎవరయ్యోయ్!" అన్నది. ఆ పల్లెటూరి మాటలో ఎంత చనువు, ఎంత పరిహాసం ఉన్నదో విరించికి తెలుసు.

"అమ్మాయి అనగానే ఇంకే ఆలోచనా రాదేం వదినా?" నవ్వుతూఅన్నాడు

"ఛా! అది కాదయ్యా! పోనీ" ఎలా ఆలోచించాలో చెప్పు..." మళ్ళీ నవ్వుతూ అన్నది.

"ఉమ అని."

"ఊఁ!"

"నీకెలా చెప్పాలో తెలియడం లేదు. ఆ అమ్మాయి, నాకూ రాఘవకూ, మాకేమిటి చాలామందికి మంచిస్నేహితురాలు..."

"స్నేహం అంటే?" ఓరగా చూస్తూ అంది సుభద్ర.

బిత్తరపోయాడు విరించి...

ఎక్కడినుంచో ఆవుదూడ 'అంబా' అని అరిచింది. పెద్ద వంటింటి మూల బోర్లించిన కుండలో ఎలుక దూరి బైటికి రాలేక అవస్థపడుతోంది... అదే చూస్తున్నాడు విరించి.

తన మాటలలో ఎంత వెలితి ఉందో, ఉమను గురించి చెప్పాలంటే పదజాలమెంత సరిపోదో...ఏమర్థం కాలేదు.

"వదినా! ఆవిడ అందరిలాంటి ఆడపిల్ల కాదు"

ఇక ఆ తరవాత తను చెప్పేవి చెప్పేశాడు. ఆవిడ స్నేహంలోతియదనం, రాఘవ లాంటి సినిక్‌ను మార్చిన మంచితనం, అసలు ఆవిడ జీవన పోరాటంలో 'ఖాట్‌ను పాడుచేసుకోకండి. నెగటివ్ థింకింగ్‌కు అలవాటు పడకండి' అని రాసిన ఉత్తరం...ఇంత చెప్పిన మనిషి బతుకు పోరాటంలో, సర్వప్రాపంచిక సుఖాలు ఉండీ చచ్చిపోవడాన్ని.... అందులో పైగా మృత్యువును జీవితానికి మరొక ద్వారంగా, ఆవతలి ఒడ్డుగా, కాటర్ పిల్లర్ స్టేజినుంచి మారే సీతాకోక స్థితిలా తీసుకున్న స్థితప్రజ్ఞత్వం..ఆవిడ పెళ్ళి ఒక భయంకరమైన నిజంగా మిగిలి పోవడం - అన్నీ తన భాషలో చెప్పాడు.

నిజంగా గుండెలు నిండి పొంగినప్పుడు ఆనందమవనీ, దుఃఖమవనీ అది తప్పకుండా మరొక స్పందించే హృదయాన్ని కదిలిస్తుంది. తప్పదు.

సుభద్ర కళ్ళల్లో నీళ్లు.

"పాపం అంత అందమైన పిల్ల, అంత డబ్బున్న పిల్ల - ఆవిడముందు నాబోటిదాని కష్టాలు ఏపాటివయ్యా... విరించీ! నాకప్పుడప్పుడు ఏమనిపిస్తుందో తెలుసా? ఇదేదీ శాశ్వతం కాదని, ఏదో నాటకమాడి గడిపేస్తున్నామనీ అనిపిస్తుంది" సుభద్ర అలా మాట్లాడ్డం సాధారణంగా జరగదు. ఆమె అలా ఆలోచిస్తుందని కూడా చాలా మందికి తెలియదు.

"నిజం వదినా! ఉమ తన జీవితంలో ఇష్టమొచ్చిన సీనులో ఆత్మహత్య చేసుకుని మనకు క్లైమాక్స్ చూస్తున్నామనే సంతోషం మిగిల్చింది. యాంటీ క్లైమాక్స్ ఆమె బతుకుంటే జరిగుండేది. 'రచన వేరు. అది ప్రపంచం కోసరం. జీవితం వేరు-అది నాకోసరం' అనుకునే చాలా మందిలో ఆమె ఉండదు. తను నమ్మింది, చెప్పింది, ఆలోచించింది ఒకటే. అయినా బతకలేకపోయింది. ఎక్కడున్నది లోపం?! ఈ వ్యత్యస్త పాదారపిండుడి అస్థావిస్తపు లోకంలో ఆమె చేసిన తప్పు అదేనా?!

"వదినా! నువ్వు దేవుణ్ని నమ్ముతావా?"

"ఏమోనయ్యా! నా నమ్మకాలు నావి. వదిలేయ్. పనుంది లోపల" అంటూ లేచింది సుభద్ర.

ఒక్కక్షణం తీరికలేని ఈ మనిషి ఏమిటి యంత్రమా? ఏదో నమ్మకాలు, పాపపుణ్యాలు-వీటి గురించిన మత్తు నరనరాల్లో స్పందించకపోతే, ఈ ఇంటికి ఒక సుభద్ర అగరవత్తిలా, హారతి కర్పూరంలా అంకితమైపోదు.

ఆలోచనలు కట్టిపెట్టి లేచాడు విరించి.

* * *

గాలి మామూలుగానే వీస్తోంది. ప్రపంచంలో చెప్పుకోదగ్గ మార్పులేదు. సూర్యుడి ఉదయం, అస్తమయం మామూలే. సిద్ధాంతులు, అతివాదులు, మితవాదులు, తాత్వికులు, వేదాంతులు, మత గురువులు ఎవరి సిద్ధాంతాలు వారు ప్రచురిస్తూనే ఉన్నారు. కొందరు నమ్మినవి చెప్పే, కొందరు మరికొందరి కోసరం చెప్పే కొంతమంది ప్రపంచాన్ని వంచించడానికి చెప్పే-ఏ రకమైతేనేం ప్రతి ఒక్కరి ఆలోచనా, అందులో బలమైన ఆలోచనా సరళిగల ప్రతి వ్యక్తి ఆలోచనా కనబడని రూపు దిద్దుకుని ప్రపంచ వాతావరణాన్ని మారుస్తూనే ఉన్నది.

1999కి ప్రళయం అని ఒకరంటే, రేపే మనదేశంలో పెట్రోలు పడుతుందని మరొకరి ప్రయత్నం. చేస్తున్న పనిని ఏదో తెలియని నిర్దేశకత్వంతో చేసుకుని పోతునే ఉన్నాడు రాఘవ. అతనికి పెరిగిన జీతంతో, హోదాతో, పెద్ద ఇంట్లోకి మారి, వాయిదాల మీద ఫ్రిజ్ కొనాలని ప్రయత్నిస్తోంది అతని శ్రీమతి. ముద్దబంతిపూవులాంటి పిల్లను పెళ్ళి చేసుకుని పుట్టిన బంగారుతల్లికి 'ఉమ' అని పేరు పెట్టుకున్నాడు విరించి.

"చచ్చినవారికేడ్చేదరు. చావనివారికి భంగి. అంతా ఇంతే! సముద్రంలో ఒక నీటిబుడగ ఉదయించింది. కొన్నేళ్ళు సూర్యరశ్మిలో మిలమిలా మెరిసింది.మళ్ళీ అందులోనే లయించిపోయింది. ఇదంతా అంతే"

భార్య చితికి నిప్పుపెట్టి నిర్వేదనం నిండిన కళ్ళతో, తడిబట్టలతో నిలబడి అన్నారు రామేశంగారు.

ఆమెగారి అస్థికలతో ఇహ తిరిగి రానని చెప్పి రైలెక్కారు ఆయన.

"అనంతమయిన ప్రయాణం. దుఃఖ పడకండి. ఇదొక మజిలీ. మరొక ప్రయాణానికి సంసిద్ధులమవ్వాలి. అంతే" దుఃఖ పడుతున్న శంకరాన్ని ఓదారుస్తూ అన్నారు. అతని జీవితంలో ఎన్నో మూసిన కిటికీలను తెరిపించి, ప్రపంచాన్ని, సృష్టిని మరొక డైమన్షన్‌లో చూపించిన వ్యక్తి.

వసుంధర, ఆమె భర్త మారలేదు. ఉమ భర్త రంజిత్ ఎవరో షేక్‌తోకలిసి కొన్ని కోట్ల ప్రాజెక్ట్‌లో వాటాదారయ్యాడని తెలిసి మళ్ళీ అతనికి రమ నిద్దామని ప్రయత్నాలు చేస్తున్నారు.

ఉమలా సెంటమెంటల్ ఫూల్‌ని కాదు. తనకేం అభ్యంతరంలేదని అన్నది రమ.

లక్ష్మణ్ మారలేదు. అతనికి మరొక వందరూపాయిలు జీతం పెరిగింది.

ఉమ చనిపోయిన పరిస్థితులను మరింత విపరీతంగా వర్ణించి "నవలా సాహిత్యంలో ఒక విప్లవ వనిత" అని బిరుదుఇచ్చి, ఆమె రాసిన నవలలు, గేయాలు హాట్ కేక్స్‌లా అమ్ముడు పోయేటట్లు చేసుకుంటున్నాడు ఆమె పబ్లిషర్. రాయల్టీ విషయంలో హెచ్చు తగ్గులువచ్చి ఉమ తండ్రి అతనిపై దావా వేశాడు.

థియసాఫికల్ సొసైటీలో వెదురు చెట్లు అన్నీ వేణువులవ్వడంలేదు. కానీ' అక్కడి వాతావరణంలో విశ్వసంగీతం వినిపిస్తూనే ఉన్నది.

గాలి మామూలుగానే వీస్తోంది. సూర్యుడు మర్యాదగా ఉదయించి అస్తమిస్తూనే ఉన్నాడు.





కూచిపూడి

ఉత్తరాది నృత్య నాటిక

# మీ మనసులోకి
# తొంగి చూడండి!



సూర్యుడు అస్తమించగానే చీకటి ప్రవేశిస్తుంది. మనుషుల కళ్ళమీదకి నిద్ర తెరలా వచ్చి వాలుతుంది. 'కలలు కనే వేళ ఇదీ కన్నయ్యా' అని మాతృమూర్తులు బిడ్డలకు జోలపాడుతారు. ఈ సమాజంలో ఆఖరికి కలలకి కూడా సంకెళ్ళే అని వాపోతాడో కవి. "కనులు కనులతో కలబడితే ఆ తగవుకి ఫలమేమి? కలలే.... ఆ కలలో నీవే కనబడితే ఆ చొరవకు బలమేమి?" అని అర్థాలకోసం వెతుక్కుంటారు యువతీ యువకులు.

ఈ విధంగా అన్ని తరగతులవారినీ సూదంటురాయిలా ఆకర్షించే అంశం కలలు.

కలలు జీవితంలో ఒక భాగం. ప్రతి ఒక్కరికీ కలలు వస్తాయి. మనిషి జీవించి వున్నంత కాలం కలలు వస్తూనే వుంటాయి. 'ఆ...అదంతా ఉత్తదే. నాకు ఇంత వరకు ఒక్క కలకూడా రాలేదు తెలుసా?" అంటారు కొందరు. అది వారి

నమ్మకమే అయినా నిజంకాదు. కొందరు నిద్రలేవగానే కలను మర్చిపోతారు. అందుకని వారికి కల వచ్చినట్లే అనిపించదు. అందుకే కలలు రాలేదనుకుంటారు. ఆఖరికి మాతృగర్భంలో వెచ్చగా నిదురించే పసిబిడ్డ కూడా కలలు కంటుంది.

అసలు కలలు ఎందుకు వస్తాయి అన్నదాన్ని గురించి చాలా పరిశోధనలు జరిగాయి. ప్రతి మనిషి రెండు రకాల ప్రపంచాల్లో జీవిస్తాడు. బాహ్య ప్రపంచం, మానసిక ప్రపంచం. బాహ్య ప్రపంచం ఎంత నిజమైనదో మానసిక ప్రపంచం కూడా అంతే నిజమైనది. బాహ్య ప్రపంచంలో వున్నవన్నీ మానసిక ప్రపంచంలో కూడా వున్నాయి. మానసిక ప్రపంచంలో వున్నవి బాహ్య ప్రపంచంలోనూ వున్నాయి.

మనిషి మనసు మూడురకాలుగా ఆలోచిస్తుంది. బాహ్య ప్రపంచం గురించిన సమాజం ఆమోదించే 'చేతన' ఆలోచనలు. సమాజం హర్షించదన్న ఉద్దేశంతో మనసులోనే దాచుకునే 'అంతర్‌చేతన' ఆలోచనలు. సమాజానికే గాక తన గురించి తనకే తెలియని 'అచేతన' ఆలోచనలు. ఈ అంతర్‌చేతన, అచేతన ప్రపంచంలోకి ప్రవేశించడానికి దారివంటివి కలలు.

కలల మీద చాలా కాలం నుంచి అనేక పరిశోధనలు జరుగుతున్నాయి. ఫ్రాయిడ్ మనిషి శారీరక అనారోగ్యానికి మానసికమైన కారణాలు వున్నాయని, ఆ మానసికమైన కారణాలను కలలు పరోక్షంగా వ్యక్తపరుస్తుంటాయని భావించాడు. మనిషి అంతరంగంలో అణచి పెట్టబడిన అనుభవాలు, ఆలోచనలను దృశ్యరూపంగా చూపించే భాష కలలు. కలలోని దృశ్యాలు, చర్యలు ఒకోసారి ఎంతో అర్థరహితంగా, తలాతోకా లేకుండా వుంటాయి. కాని అవి అన్నీ ఏదో ఒక అర్థాన్ని సూచిస్తుంటాయని పరిశోధకులు తెలిజేస్తున్నారు. ఫ్రాయిడ్, జంగ్ వంటి ప్రముఖ మనస్తత్వ శాస్త్రవేత్తలు కలల స్వభావ స్వరూపాలు, వాటికి మానవజీవితంతో గల సంబంధాన్ని గురించి తెలుసుకోడానికి అనేక శాస్త్రీయ పరిశోధనలు నిర్వహించారు. వీరు కలలలోని సంఘటనలు సన్నివేశాలను, వాటిలోని సింబాలిక్ అర్థాలతో లేదాఅంశాలతో పోల్చిచూశారు. మనిషి అంతరంగాన్ని విశ్లేషించడంలో కలలు చాలావరకు సాయపడుతున్నాయని తేల్చారు వారు.

ఫ్రాయిడ్ సిద్ధాంతాల ఆధారంగా ఇప్పటివరకూ కలల మీద అనేక పరిశోధనలు జరిగాయి...జరుగుతున్నాయి. ప్రస్తుతం మానసిక వైద్యచికిత్స (సైకో థెరపీ)లో కలలు ఒక ముఖ్యమైన సాధనంగా ఉపయోగిస్తున్నారు. మనస్తత్వవేత్తలు కలలో తరచూ వచ్చే దృశ్యాలు, వ్యక్తులు, వస్తువులు, జంతువులు ఒకో అర్థాన్ని సింబాలిక్‌గా సూచిస్తాయని అంటున్నారు. కలలోని గుర్తులు కలలను విశ్లేషించడానికి తోడ్పడుతున్నాయి. ఈ అర్థాలు సన్నివేశాలు, వ్యక్తులు,వయసు వారి అనుభవాలకు అనుగుణంగా మారుతుంటాయని సైకాలజిస్టుల అభిప్రాయం. కలలో కనిపించే దృశ్యాలకు అర్థం తెలిస్తే ఎవరికివారు తమ అంతఃచేతన, అచేతనాల్లో తమకే తెలీకుండా దాగివున్న సమస్యలను అర్థం చేసుకొని వాటి పరిష్కారానికి కృషిచేసి జీవితాన్ని సరైన మార్గంలో మలచుకునే అవకాశం




వుంటుందనడంలో సందేహం లేదు. అందుకే సైకాలజిస్టులు ఇచ్చిన సింబాలిక్ అర్థాలతో ఓసారి మన మనసుల్లోకి తొంగి చూస్తే అది కొంతవరకూ అర్థంకావచ్చు.

### అగాథం, లోయ

కలలో ఏదేనా అగాథం లేదా లోయ కనిపించడం ఒక హెచ్చరికవంటిది. కాలి బాట లోయవద్ద అంతమైపోతే వెనక్కి తిరిగిరావడం మంచిది. ఒకవేళ దారి లోయలోగుండా సాగితే కలగనే వ్యక్తి ఎదుర్కోబోయే సమస్యను చాలాలోతుగా పరిశీలించాలని అర్థం. ఒకవేళ లోయ మీదుగా అవతలివైపుకి వంతెన వుంటే ఇతరులతో ఏర్పడిన విభేదాలను పరిష్కరించుకోవచ్చని, వారితో రాజీకి వచ్చి కలిసిపోవచ్చని అది సూచిస్తుంది.



### రొట్టెలు చేసేవాడు

ఇతను రోజువారీ ఆహారాన్ని తయారుచేస్తాడు. గోధుమలను పౌష్టికాహారంగా మారుస్తాడు. అంటే కలగనే వ్యక్తి తన మనసుకి ఆరోగ్యకరమైన ఆహారాన్ని అంటే ఆలోచనలను అందించవలసి ఉందని సూచిస్తున్నాడన్న మాట.

### ఏపిల్ పండు

ఇది యువకుల కలలో కన్పిస్తే శృంగార భావనలను సూచిస్తుంది. అదే వయసుమళ్ళినవారికి కనుపిస్తే ఆధ్యాత్మిక పరిపుష్టిని సూచిస్తుంది.



### మరణించడం, కాలు, చేయి తెగిపోవడం

కలలో సన్నిహితులు చనిపోవడం హెచ్చరిక సూచనే. కాలు తెగిపోవడం అతని పురోగతి కుంటుపడుతుందని లేదా ఆధ్యాత్మికంగా, మేధాపరంగా కాస్త వెనక పడుతున్నాడని అర్థం. చేయి తెగినట్లు కలవస్తే తనకు నచ్చినట్లు ప్రవర్తించే స్వేచ్ఛ కోల్పోవడంగా దాన్ని విశ్లేషించవచ్చు.

### దేవత–దేవదూత

దేవదూత, దేవతలు సంరక్షణకు

గుర్తు. చేతన, అచేతనత్వాలను సరైన పంథాలో నడిపే ఆధ్యాత్మిక నాయకులు వీళ్ళు అనవచ్చు. లేదా మానసిక, శారీరక అంశాలను ఏకంచేసే శక్తికి గుర్తుగానూ పరిగణించవచ్చు.

### స్నానం

పురాణ కథల్లోలాగే స్నానానికి అర్థం మార్పు, శుభ్రత. స్నానం చేసినట్టు, స్నానాలగది కలలు ముఖ్యంగా జీవితాన్ని ముఖ్యమైన మలుపు తిప్పే నిర్ణయాలు తీసుకునేముందు వస్తుంటాయి. కలలోని నీళ్లు ఆధ్యాత్మిక లేదా మానసిక శక్తిని సూచిస్తాయి. ఒకవేళ ఆరుబైట చెరువులో స్నానం చేసినట్లు కల వస్తే మంచిదే. ఈత కొలనులో స్నానం చేస్తున్నట్లు వచ్చే కల మనసు శుభ్రపడటానికి, మారడానికి ఆధునిక నాగరికత అడ్డుగా వుందని సూచిస్తుంది.



### పక్షి

పక్షులు ఎక్కువగా ఆకాశంలో ఎగిరే జీవులు. ఆకాశం ఎత్తుగా వుంటుంది. అంటె పక్షి ఉన్నతమైన మేధస్సుకి చిహ్నం. కలలో కనిపించే పక్షులు మేధా సంబంధమైన విషయాలకు ప్రతీకలు.




### బంతి

వృత్తంలాగే బంతికూడా పరిపూర్ణత్వానికి గుర్తు. అంటే బంతి కేంద్రీకృతీకరించబడిన మానసిక శక్తికి చిహ్నం. బంతి ఏదో ఒక విషయంలో మార్పును సూచిసోందన్న మాట.

### మంచం

కలలో మంచం కనిపించడం శృంగార భావనలకు గుర్తుగా పరిగణిస్తారు. మంచం గదంతా ఆక్రమిస్తే ఆ వ్యక్తి జీవితంలో సెక్సుకి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తాడని అర్థం. అలాగే ఇరుగ్గా, చిన్నగావుండే మంచం సెక్సును అత్యల్ప ప్రాధాన్యత ఇస్తున్నాడని సూచిస్తుంది.

### పుట్టుక

కలలో బిడ్డ పుడుతున్న దృశ్యం కనిపించడం జీవితంలో నూతనారంభానికి గుర్తు. మగవారికి ఇలాంటి కలవస్తే కొత్త

ఐడియాలు, కెరీర్ అవకాశాల ప్రారంభానికి నాంది అని సూచిస్తుంది.

### వంతెనలు

కలలో వంతెన కనుపిస్తే జీవితంలోని సమస్యతో రాజీపడవచ్చని లేదా సమస్యను అధిగమించవచ్చని సూచిస్తుంది. అయితే అన్ని వంతెనలూ ఒకేరకమైన అంశాన్ని సూచించవు. వంతెన నిర్మాణాన్నిబట్టి అర్థం మారుతుంది. ఉదాహరణకు వంతెన అసంపూర్తిగావున్నా, వంతెనకు ఇరుపక్కల రెయిలింగ్ లేకపోయినా ప్రమాదాన్ని సూచిస్తుంది. సమస్య క్లిష్టంగా వుందని, జాగ్రత్తగా పరిష్కరించుకోవాలని హెచ్చరిస్తుంది.



### అంత్యక్రియలు, సమాధి

కలలో తరచూ కనిపించేవాటిలో ఇది ఒకటి. ఇది జీవితంలో ఫలించని ఆశలను లేదా సమస్యలను తగలబెట్టమని సూచిస్తుంది. లేదా గతంలోని బాధాకరమయిన అనుభవాలను సూచిస్తుంది. కలలో అంత్యక్రియల తర్వాత జరిగే సన్నివేశాలు మిగిలిన పరిణామాలను సూచిస్తాయి. మరణం మార్పు అనే ప్రక్రియను సూచిస్తుంది. పాతదనం నశించగానే కొత్తదనం జన్మిస్తుంది అని కూడా మరణం సూచిస్తుంది.






### ఆంబోతు

ఇది పురుషశక్తికి, సామర్థ్యానికి చిహ్నంగా పరిగణించబడుతోంది. బుల్ ఫైట్‌లో వ్యక్తి దానికి ఎదురెళ్ళి మచ్చిక చేసుకొని లొంగదీస్తాడు. కనుక కలలోని ఆంబోతు నిజజీవితంలో మానసిక శక్తిని అదుపులోకి తెచ్చుకోవాలన్న విషయాన్ని సూచిస్తుంది.

### ఎడారి

ఎడారి ఆధునిక మానవుడు సమాజానికి రానురాను దూరమయిపోతూ ఒంటరి అయిపోతున్నాడని సూచిస్తుంది. ఎడారి ప్రాంతంలో పంటలు పండనట్లే ఒంటరితనంలో అనుబంధాలు అభివృద్ధి చెంద

వని అర్థం.



### రక్తం

రక్తం శక్తికి చిహ్నం. అంతేకాదు ప్రేమకు కూడా చిహ్నం. రక్తం పోయినట్లు కలవస్తే ప్రేమను కోల్పోవడం లేదా త్యాగం చేయాల్సిన అవసరం వుందని సూచిస్తుంది. రక్తమార్పిడి మానసిక బలాన్ని సూచిస్తుంది.

### బాంబులు, యుద్ధాలు

ఇలాంటి కలలు ప్రమాద సూచకాలు. ఇవి గతకాలపు యుద్ధానుభవాలు కావచ్చు. లేదా మనసుకి షాక్ కలిగించిన సంఘటనలను సూచించవచ్చు.

### దొంగలు

తరచూ దొంగలు ఇంట్లో చొరబడినట్లు కలలు వస్తాయి కొందరికి. ఇది నిత్య జీవితంలో అణచివేయబడిన లేదా ప్రాధాన్యత ఇవ్వబడని అంశాన్ని సూచిస్తుంది.

### రంగులు

కలలు రంగుల్లో రావని అంటారు. కాని అది నిజం కాదు. నలుపు స్థిరత్వానికి, నిశ్చలత్వానికి గుర్తు. తెలుపు మృత్యువు ఆగమనాన్ని సూచిస్తుంది. పసుపు మానసిక చైతన్యం, సామర్థ్యానికి గుర్తు. ఎరుపు ఎక్కువగా ప్రభావితం చేసి ఆకర్షిస్తుంది. ఎరుపు శక్తికి గుర్తు. ఇది ఏనిమల్ ఇన్‌స్టిక్ట్స్, పశుబలానికి కూడా గుర్తు. ఆరంజ్ చురుకుదనానికి గుర్తు. నీలం మేధావితనానికి గుర్తు. వంగపండు రంగు గుర్తింపు గల అంశాలకు గుర్తు. ఆకుపచ్చ శుభానికి, పొగాకు రంగు అచేతనంలోని కాంప్లెక్సులను సూచిస్తుంది. ఊదా రంగు అభిప్రాయ భేదాలు వచ్చే అవకాశాన్ని సూచిస్తుంది.

కలలో ఊదారంగు కని
పించింది. గొడవ పడ-
కమునుపే పుట్టింటికి
వెడితేమంచిదని...



### శవం

ఇది తీవ్రస్థాయిలోని ప్రమాదాన్ని సూచిస్తుంది. మరణించడం రూపాంతరం చెందడం తర్వాత పునర్జన్మను సూచిస్తుంది. శవం వ్యక్తి వ్యక్తిత్వంలో





ఎంతో కాలం క్రితం నిర్జీవమైపోయిన అంశాన్ని, కొంతవరకు అచేతనత్వానికి భారంగా తయారయిన కాంప్లెక్సును చూపిస్తుంది.




సీతాకోకచిలుక

మానసిక అస్థిరత్వాన్ని సూచిస్తుంది.

కారు

కారు వ్యక్తిలోని శక్తిసామర్థ్యాలకు ప్రతీక. కారు సైజు, నిర్మాణం ప్రపంచం అతన్ని ఏ విధంగా పరిగణిస్తోందో తెలియజేస్తుంది. వేగంగా నడిచే స్పోర్ట్సు కారు సెక్సుకి గుర్తు. కారు వేగం అవధులులేని ప్రేమను కూడా సూచిస్తుంది. కలలో కారు నడపడం, కారు కనిపించడం సెక్సు కన్నా వ్యక్తి సామర్థ్యాన్ని ఎక్కువగా సూచిస్తాయి.

దుస్తులు

దుస్తులు కలగనే వ్యక్తి పర్సనాలిటీని చూపిస్తాయి. లేదా అతను ఎలా ఆలోచిస్తాడు, అతన్ని సాటివారు ఏ దృష్టితో చూస్తారు అనేది సూచించబడుతుంది. ఇది వ్యతిరేకార్థాన్ని కూడా ఇవ్వచ్చు. అతన్ని ప్రపంచం ఏ దృష్టితో చూస్తోందీ సూచిస్తుంది. కోటు మారువేషాన్ని, రక్షణను సూచిస్తుంది. ఈ కల వచ్చిన వ్యక్తి మీద ఆధారపడినవారికి రక్షణ అవసరం అని కూడా మరో సూచన.

బాల్యం

చిన్నతనం కలలో కనిపిస్తుంటుంది. ఈ కల చాలాకాలం క్రితం మర్చిపోయినా అచేతనంలో భద్రపరచబడి జీవితంలో చాలా ముఖ్యపాత్ర వహిస్తున్న విషయాన్ని సూచిస్తుంది. కనుక ఆ వ్యక్తి కలవచ్చిన సమయంలోగల పరిస్థితిని పునరాలోచించడం మంచిది. పెద్దవారయినాక వచ్చే మానసిక బలహీనతలు, అతని ప్రవర్తనపై బాల్యం యొక్క ప్రభావం వుంటుంది.




పసిబిడ్డ

పసిపాప నూతనారంభానికి, మార్పుకి,

శక్తికి చిహ్నం. అంటే జీవితంపట్ల నూతన దృక్పథం ఏర్పరచుకొనే అవకాశం వుందని సూచించడం. కలలోని పసిపాప అనారోగ్యంగా వున్నా, చనిపోవడానికి సిద్ధంగావున్నా అది హెచ్చరిక సూచన. అతనిలోని ఆధ్యాత్మిక అంశాలు అడుగంటిపోయే ప్రమాదం ఏర్పడిందని అర్థం. ఇలాంటి కలలు అరుదు.



### శిరచ్ఛేదము

తల నరికినట్లు కల రావడం ఎంత భయంకర దృశ్యమో అది అందించే అర్థం కూడా ఆలాంటిదే. ఉదాహరణకు మనసు ఈ దృశ్యం ద్వారా ఆ వ్యక్తి బయటపడే అవకాశం లేని పరిస్థితిలో ఇరుక్కుంటున్నాడని హెచ్చరిస్తుంది. ఒకోసారి మానసిక అవస్థలోంచిమార్గాన్ని సూచిస్తుంది.

### సంకెళ్లు

గొలుసులు బంధనానికి, అనుబంధానికి గుర్తు. దాన్ని పాజిటివ్‌గా తీసుకుంటే వివాహమని, నెగిటివ్ దృష్టిలో అయితే జైలుకి గుర్తుగా భావించవచ్చు.

### డాక్టర్

కలలో డాక్టర్ కనిపించడం మానసిక అనారోగ్యాన్ని, అస్థిరత్వాన్ని సూచిస్తుంది. డాక్టర్ కలగనే వ్యక్తికి ఏ సమస్యకు చికిత్స అవసరమో సూచిస్తాడు. ఒకోసారి ముందు ముందు రాబోయే అనారోగ్యాన్ని కలలోని డాక్టర్ ముందే సూచనప్రాయంగా తెలిజేస్తాడు.

### కన్ను

'మనిషి మనసు అతని కళ్ళల్లో ప్రతిఫలిస్తుంది' అంటారు. పురాతన గ్రీకులు సూర్య చంద్రులు దేవతల కళ్ళని భావించేవారు. కలలోని కన్ను మనిషి చేతనకు గుర్తు. దృష్టి సరిగా లేకపోతే జీవితంలోని ఒక సమస్యను లేదా జీవిత విధానాలను సరిగా విశ్లేషించలేదని అర్థం.





### గుర్రం

కలలో కనిపించే గుర్రానికి చాలా ప్రాముఖ్యత వుంది. పాశ్చాత్యుల కలల పరిశోధనల్లో గుర్రం మరణాన్ని సూచించే వార్తాహరుడన్న నమ్మకం చాలా వరకూ నిజమేనని ఋజువయింది.




### పొయ్యిలో నిప్పు

మానవ అనుభూతుల వెచ్చదనాన్ని సూచిస్తుంది. ఈ కలలు స్త్రీలకి ఎక్కువగా వస్తాయి. ఇవి వివాహ సమస్యను సూచిస్తాయి.

### అగ్నిజ్వాలలు

అన్నిటినీ నాశనం చేస్తున్నట్లు వచ్చే అగ్ని జ్వాలల కల ప్రమాదాన్ని సూచిస్తుంది. ఇది వ్యక్తి సెక్సువల్ సమస్యలను, ప్రేమ సంబంధమైన సమస్యలను సూచిస్తుంది.

### వంట పాత్రలు, స్టవ్

వంట గదిలోని స్టవ్ వివాహాన్ని సూచిస్తుంది. ఒకవేళ పొయ్యి ఆరిపోయినట్లు కలవస్తే కుటుంబసభ్యుల మరణాన్ని సూచించే అవకాశం వుంది.

### అడవి

అడవి మనిషిలోని అచేతనత్వాన్ని, స్తబ్ధతను సూచిస్తుంది.

### ఎగరడం, విమానం

ఎగురుతున్నట్లు సాధారణంగా కలలు వస్తాయి. చాలా దూరం ఆలోచించి అర్థం చేసుకోవలసిన అభిప్రాయాలు, ఆలోచనలను అందించేవిగా కనిపిస్తాయి. ఇది వ్యక్తి స్వేచ్ఛను సూచిస్తాయి. ఎగరడం అనేది అందులోనూ విమానం లేకుండా అలా గాల్లో తేలడం ప్రమాద సూచకం. ఇలా కలవస్తే వాస్తవ జీవితానికి అనుగుణంగా ఆలోచనలు లేవని సూచిస్తుంది. కొంతవరకూ సమస్యలను ఎదుర్కోకుండా దాట వేస్తున్నాడని కూడా అర్థం.



### హొటల్

హోటల్‌లో ఎవరూ శాశ్వతంగా నివసించరు. అక్కడ అపరిచితులు, కొత్తవారు ఎదురుపడుతుంటారు. దీన్ని కలల

భాషలోకి అనువదిస్తే దాని అర్థం కలల్లో హోటల్‌లో కలిసే వ్యక్తులు ఆ వ్యక్తిపై గల అపరిచిత మానసిక ప్రభావాలకు ప్రతీకలుగా నిలుస్తారు.

### ముద్దు

ముద్దు కలయికకు చిహ్నం. సహజంగానే కలలోని ముద్దు కూడా శృంగార పూరితమైన అర్థాన్నే సూచించవచ్చు. ఇదేగాక వేరే అర్థాన్ని కూడా సూచిస్తుంది ముద్దు. కల వచ్చిన వ్యక్తి అతని జీవితంలోని ఒక వ్యక్తితో రాజీ పడాల్సి వుంటుందని లేదా ఆ వ్యక్తిని అంగీకరించాల్సి వుంటుందని సూచిస్తుంది.




### తోలువస్తువులు

కలలోని తోలు దుస్తులు, తోలు హంటర్ మొదలైనవి మనిషిలోని ఆహాన్ని సూచిస్తాయి. మనిషిలోని ఆహాన్ని, శాడిస్ట్ లక్షణాలను అదుపు చేసుకోవలసిన అవసరాన్ని సూచిస్తుంది



### ద్వీపం

ద్వీపం అంతులేని కోరికలకు గుర్తు. ద్వీపం చుట్టూ సముద్రం వుంటుంది. అది అంతర్గతంగా వున్న కాంప్లెక్సులను సూచిస్తుంది.

### ప్రయాణం

కలలో ప్రయాణాలు తరచూ అందరికీ వస్తుంటాయి. కారు, ఓడ, రైలు దేనిద్వారా ప్రయాణం చేస్తున్నా ఇది జీవన ప్రయాణాన్నే సూచిస్తుంది.

### చిక్కుముడి

చిక్కుముళ్లు విప్పుతున్నట్లు వచ్చే కల అతని జీవితంలోని పరిష్కరించబడని చిక్కు సమస్యను ఎదుర్కొంటున్నాడని సూచిస్తుంది.

### సింహం

సింహం అంతర్గతమైన మానసిక సమస్యలను సూచిస్తుంది తరచూ. ఒకోసారి బలమైన మానసిక శక్తిని

కూడా సూచిస్తుంది.

యంత్రాలు

సైకోథెరపీ రంగంలోని అసుభవం యంత్రాలు, యంత్రపరికరాలు, యంత్రాలతో కూడిన ప్రదేశాలు, తీవ్రమైన మానసిక అస్వస్థతను సూచి స్తాయని తేల్చింది.

మంచు

కలలో మంచు లేదా గడ్డకట్టిన నది లేదా సరస్సు కనిపించడం ప్రమాద సూచనలు. కల వీటిద్వారా ఆ వ్యక్తికి ఇతరులతో గల అనుబంధాలు వట్టిపో సున్నాయని, మానసిక జడత్వం, ఒంటరి తనాన్ని కోరి తెచ్చుకుంటున్నాడని హెచ్చ రిసుంది.





సూర్యుడు

మానవుడిలోని సృజనాత్మక, ఉత్పా దక శక్తికి ప్రతీకగా నిలుస్తుంది. సూర్యుడు భూమిమీద ప్రాణకోటి అవత రించడానికి మూలం. కలలోని సూర్యుడు సూచించే అర్థాలు మారవచ్చు. కాని ఎల్ల ప్పుడూ కళాత్మక, మేధా సంబంధమైన, చేతన సంబంధమైన విషయాల సృష్టికి కారణమయే సృజనాత్మక, ఉత్పాదక శక్తులను సూచిస్తుంది.






డబ్బు

డబ్బు మానసిక శక్తిని లేదా మాన సిక శక్తి స్థాయిని సూచిస్తుంది. అనుకో కుండా డబ్బు దొరికినట్లు వచ్చే కల మంచినే సూచిస్తుంది. డబ్బుపోయినట్లు వస్తే ఆ వ్యక్తి నిజజీవితంలో తనలోని కొన్ని సామర్థ్యాలను, నేర్పును ఉపయో గించుకోడంలేదని; అవి వృథా అవుతున్నా యని తెలియజేసుంది. కలలో డబ్బు నాణాల రూపంలో కనిపిస్తుంది. వెండి నాణాలు స్త్రీ సంబంధిత అంశాలను సూచిస్తాయి. ఒకవేళ బాంకులలో డబ్బు అధిక సంఖ్యలో దాస్తున్నట్లు వచ్చే కల అతనికి అందుబాటులో వున్న శక్తి

సామర్థ్యాలను వినియోగించుకోవడంలేదని సూచిస్తుంది.




తాళం-చెవి

పూర్వంనుంచి తాళం, చెవి సెక్స్ పరమైన భావనకు గుర్తుగా భావించబడుతున్నాయి. స్త్రీ పురుషుల కలయికలోంచి ఈ భావన పుట్టింది. జానపదకథల్లోని తాళంచెవిని విషయ పరిగ్రహణకు మార్గంగా భావించవచ్చు.

విమాన ప్రమాదం

విమానం కూలిపోవడం ఆ వ్యక్తి జీవితంలోని నిజాలకు దూరంగా ఆకాశంలో నడుస్తున్నాడని, మళ్ళీ నేలమీద పడక తప్పదని సూచన. రైల్వేస్టేషన్ వ్యక్తుల జీవితాలకు ప్రతీక. రైల్వే స్టేషన్‌కి లేటుగా రావడం, తప్పు రైలు ఎక్కడం, హఠాత్తుగా అపరిచితమైన ఊర్లో దిగడం—ఇవన్నీ అతను జీవితంలో చేసే వివిధ పొరపాట్లను సూచిస్తుంది. ఆ పొరపాట్లను స్టేషన్‌మాస్టర్, గార్డ్‌ల చర్యల ద్వారా మనసు ప్రత్యామ్నాయాలను సూచిస్తుంది.

రాత్రి

కలలోని రాత్రి ఆ వ్యక్తి ఆధ్యాత్మిక భావనను సూచిస్తుంది. అతను ఆధ్యాత్మికంగా ఇంకా ఎదగలేదని, చీకటిలోనే వున్నాడని రాత్రి సూచిస్తుంది.

ఆస్పత్రి

ఆస్పత్రి మానసిక అస్వస్థతకు చిహ్నం. ఆస్పత్రిలోని శాఖలు వ్యక్తిలోని వివిధ రకాల సమస్యలను ఎత్తి చూపుతాయి. ఉదా-గుండెజబ్బు మానసిక కల్లోలాన్ని, లేదా అస్వస్థతను; కన్ను జీవితంలోని అనుబంధాన్ని లేదా సమస్యపై సరిగా దృష్టికేంద్రీకరించడంలేదని, పట్టించుకోవడంలేదని సూచిస్తుంది. పొట్టకు సంబంధించిన అనారోగ్యం అతని జీవితంలోని సంఘర్షణ లేదా ఎవరితోనో ఏర్పడిన అభిప్రాయ భేదాలను అరిగించుకోలేకపోతున్నాడనిసూచిస్తుంది.



ఇల్లు

ఇక్కడ ఇల్లు అంటే ఆత్మ. కలలో కనిపించే ఇల్లు కూడా ఈ అర్థాన్నే సూచిస్తుంది. ఇంటిలోని గదులు ఒకో అర్థాన్ని సూచిస్తాయి. వంటగది మనసుకు కావలసిన బలవర్ధకమైన ఆహారాన్ని (ఆలోచనలను) అందించేది. ఇది స్త్రీత్వాన్ని, మాతృత్వ సంబంధమైన అంశాలను సూచిస్తుంది. లివింగ్‌రూమ్, స్టడీరూమ్ మానసిక అనుభవాలకు; పడక గది వైవాహిక సెక్స్ జీవితానికి; అటక అణిచివేయబడిన, మరిచిపోయిన జ్ఞాపకాలకు గుర్తులు.




కత్తి

కత్తి దేన్నయినాసరే కోస్తుంది, వేరు చేస్తుంది. ఒకవేళ ఈ కలను ఆ వ్యక్తి జీవితంలో జరిగిన సంఘటనకు ఆపాదిస్తే సమస్యను, సంఘటనను క్షుణ్ణంగా విడదీసి పరిశీలించాలన్న సూచన కనిపిస్తుంది. ఇది ఆయుధంగా కూడా ఉపయోగపడుతుంది. కత్తి కలవచ్చిన వ్యక్తి చేతిలోనే వుంటే అతని అంతరంగం అట్టడుగున పడిపోయిన ఓ సమస్య వైపు దృష్టి మళ్ళించాల్సిన అవసరం ఉందని అర్థం.




పాము

బైబిల్ ప్రకారం పాము చెడుకు ప్రతీక. అది ఏపిల్ పండును తెచ్చి ఆడమ్, ఈవ్‌లను ప్రలోభపెట్టి ఏపిల్ పండు తినేలా చేస్తుంది. ఆవిధంగా మానవుడు తనను గురించిన పరిజ్ఞానాన్ని సంపాదిస్తాడు. మానవుడిలోని చేతన అతనికీ, ఇతర ప్రాణులకూ వున్న తేడాను గుర్తించేలా చేస్తుంది. ఈ చేతనత్వమే మనిషిని భగవంతుడి స్థాయికి చేర్చింది. అతని నైతిక ప్రవర్తన గురించి ఆలోచించదు.

కల్లో పాము వివిధరకాల అర్థాలనిస్తుంది. ఇది మనిషిలోని సహజసిద్ధ

మైన కోరికలకు గుర్తు. యువతరంలో ఇది సెక్స్ పరమైన కోరికలను సూచిస్తుంది. ఫ్రాయిడ్ ప్రకారం పాము మగవారి అంగానికి ప్రతీక. ముసలి వారికి కలలో పాము కనిపిస్తే మార్పుకి, పునరుద్ధరణకు సూచిక. పాము ప్రమాదాన్ని కూడా సూచిస్తుంది ఒకో సారి. వ్యక్తి యవ్వన శక్తిని సెక్స్‌ద్వారా పొందాలని ప్రయత్నిస్తే ప్రమాదమని సూచిస్తుంది పాము. లేదా మధ్యవయస్కు లయితే విషపూరితమైన స్త్రీ వ్యామోహంలో పడబోతున్నాడని సూచిస్తుంది.



### రోడ్లు

కలలో కనిపించే దారులు, రోడ్లు వ్యక్తి జీవన మార్గాన్ని సూచిస్తుంది. క్రాస్‌రోడ్లు అత్యవసర నిర్ణయం తీసుకోవలసిన అవసరాన్ని సూచిస్తాయి. రోడ్ల నిర్మాణం విశాలంగా వుందా, ఇరుగ్గా వుందా, గతుకులుగానా, సాఫీగా వుందా అనేది అతని అప్పటి జీవన పరిస్థితిని సూచిస్తుంది.

### హత్య

ఇది ఆ వ్యక్తి తన వ్యక్తిత్వంలోని ఒక అంశాన్ని బలవంతంగా అణిచి పెడుతున్నాడని, అలాగే అతని సామర్థ్యాన్ని సరిగా ఉపయోగించడంలేదని, సన్నిహితులతో అనుబంధాన్ని నిర్లక్ష్యం చేస్తున్నాడని సూచిస్తుంది.

### త్యాగం

ఇది ఉన్నతమైన విలువలు త్యాగం వలనే సిద్ధిస్తాయని సూచిస్తుంది. మరో అర్థం-అతనిలో సరిగా లేని ప్రవర్తనను లేదా అనుబంధాన్ని వదులుకోవల్సి వుంటుందని సూచిస్తుంది.

### అంకెలు

జంగ్ బోధనల ప్రకారం అంకెలు మనిషి చేతనత్వం ద్వారా సృష్టించబడలేదు. ఇవి అచేతనంలోంచి ఉత్పత్తి అయినవి. ఆధునిక శాస్త్రజ్ఞానం ప్రపంచంలోని జీవులకు సంబంధించిన అన్ని అంశాలనూ గణిత సూత్రాలద్వారానే చెపుతుంది.

రెండవ అంకె స్త్రీ – పురుషుల కలయికను సూచిస్తుంది. అదిగాక రెండు పరస్పర విరుద్ధమైన స్వభావాలను స్త్రీ – పురుషుడు, ఆకాశం – భూమి...ఇలా కూడా సూచిస్తుంది. మూడవ అంకె పూర్వం నుంచి మేజిక్‌లో భాగంగా వుంది. ఇప్పటికీ ఒక విషయానికి ప్రాముఖ్యత నివ్వడానికి మూడుసార్లు రిపీట్ చేస్తారు. ఏడు డైనమిక్ సంఖ్య. వారానికి ఏడు రోజులు, సప్తవర్ణాలు. సంపూర్ణ సంఖ్య అనిపించే నాలుగుకి మూడును కలిపితే ఏడు వచ్చింది. అంటే ఇది సృజనాత్మక మేధాశక్తికి గుర్తు.




ఎనిమిది సంఖ్య కలలో అష్టభుజ ఆకారాలు, గదులుగా కనిపించవచ్చు. ఇది సంపూర్ణత్వాన్ని సూచిస్తుంది. మరోవైపు సంపూర్ణత్వాన్ని సూచించే ఎనిమిది ఇక పెరుగుదల లేదన్న విషయాన్ని కూడా సూచిస్తుంది. ఆవిధంగా ప్రమాద సూచిక కూడా ఇది. ఇప్పుడు మనకు డెసిమల్ విధానం అమల్లో వుంది. పదకొండు కొత్త సీరీస్‌ను ప్రారంభిస్తుంది. కనుక ఇది నూతన పరిణామాలను సూచిస్తుంది. 13 కూడా ఇదే అర్థాన్ని సూచిస్తుంది.




## సూపర్‌మేన్

సూపర్‌మేన్ అసాధ్యాలను సాధ్యం చేసే మానవాతీత బలంగల శక్తి. ఈ కల వ్యక్తి తనలోని విపరీత భావాలు, తెలివితేటలు, ఆలోచనలతో అసలుకన్నా ఎక్కువ విలువ ఇచ్చుకుంటున్నాడని సూచిస్తుంది.

## దొంగతనం

వ్యక్తి అజాగ్రత్తవలన దొంగతనం జరిగి అతనికి నష్టం కలిగిందని దొంగతనం సూచిస్తుంది. అది ఒకోసారి ఆ వ్యక్తి బాహ్యప్రపంచంతో సంబంధాలను కోల్పోతున్నాడని కూడా సూచిస్తుంది.

## మరుగుదొడ్డి

ఇది సహజ పరిణామ విషయాలను సూచిస్తుంది. అంటే మానసికంగా సరిగా అరిగించుకోలేని అంశాలను విసర్జించమని సూచిస్తుంది.

ఈ కలలు సూచించే అర్థాలను గ్రహించి మనుషులు తమ జీవితంలోని సమస్యలకు అన్వయించుకోగలిగితే మరింత మనశ్శాంతితో అర్థవంతమైన జీవితం గడపగలరని మనస్తత్వ శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

## సాలెపురుగు

ఇది కూడా రాబోయే ప్రమాదాన్నే సూచిస్తుంది. సాలెపురుగు గూడు అల్లి అందులో పురుగుల్ని బంధించి తింటుంది. అలాగే వల్లో వేసుకోవాలని ప్రయత్నించే స్త్రీ పురుషుల గురించి ఇది హెచ్చరిస్తుంది.

## మెట్లు

కలలోని మెట్లు ఆ వ్యక్తి వ్యక్తిత్వంలోని భిన్నమైన అంశాలను కలిపే వారధి వంటిది. వ్యక్తి తన జీవితంలోని పరిస్థితులపట్ల చూపే ధోరణిలోని ఎత్తుపల్లాలను మెట్లు ఎక్కడం, దిగటం సూచిస్తాయి.

## సూట్‌కేస్

కలగనే వ్యక్తి భరించవలసిన లేదా అంగీకరించవలసిన బరువు బాధ్యతలను సూచిస్తుంది.





# ఫాల్స్ ప్రిస్టేజ్

చమర

ఇందిర బస్‌స్టాప్‌లో నిలబడింది. కొద్ది దూరంలో ఓ హిప్పీక్రాఫ్, ఓ పంచెకట్టు ఉన్నారు. ఆశగా దేవుకుంటూ ఓ బిక్ష గాడు వారి వైపు వస్తున్నాడు.

హిప్పీ కళ్ళతోనే ఇందిర అందాన్ని జుర్రుకుంటున్నాడు. పంచెకట్టు మీసాలు సవరించుకుంటూ తన వేషాన్ని చూసి కాకపోయినా కనీసం చంకలోని బేగ్ చూసైనా ఇష్టపడుతుందేమోనని కోర చూపులు చూస్తున్నాడు.

ఇద్దర్నీ చూసి వళ్లు మండుకొచ్చింది ఇందిరకు. ఇంతలో మూడోవాడిలా బిక్షగాడు వచ్చాడు.

"అమ్మా! పదిపైసలు దరమం సెయ్యండి. రెండు రోజులునుంచి గంజి నేదు"

ముఖం తిప్పుకుంది ఇందిర.

బిక్షగాడు దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. హిప్పీజుట్టు వైపు అదోలా చూసి పంచెకట్టు వైపు దేవుకుంటూ వెళ్లాడు.

హిప్పీ జుట్టుకు రోషం పొడుచుకు వచ్చింది–ఆ ముష్టివెధవ తన్ను ఇన్‌సల్ట్ చేశాడని.

"ఓయ్" బిక్షగాడిని పిలిచాడు హిప్పీ జుట్టు. ఇందిర హిప్పీ జుట్టువైపు చూడకూడదనుకుంటూనే కాకతాళీయంగా చూడడం తటస్థించింది.

"వత్తున్నా బాఁవూ" అంటూనే పంచెకట్టు వైపు వెళ్లాడు బిక్షగాడు. హిప్పీ



# కతలు

జుట్టుకు కోపం కట్టలు తెంచుకునివచ్చింది. ముష్టి వెధవకు ఏమీ ఇవ్వకూడదనుకుని ఇందిరను తనవైపు ఏదో విధంగా ఆకర్షించుకోవాలన్న ఆలోచనలో పడ్డాడు.

పంచెకట్టు చంకలోనున్న బేగ్ తీసాడు. లోపలున్న డబ్బంతా ఇందిర కగుపడేటట్టు తెరిచాడు. డబ్బును చూసి ఇందిర కళ్లు అప్రయత్నంగా మెరిసాయి. ఆమె అంత డబ్బు ఎప్పుడూ చూసి ఎరుగదు మరి బాగా డబ్బున్న పల్లెటూరి మోతుబరి రైతు కాబోలనుకుంది.

"పిలిచి దానం చేస్తానంటే పోజు కొడతావేంటి? డబ్బు ఎక్కువయ్యిందా ఏంటి?" కరుకుగా అడిగాడు హిప్పీ.

బిక్షగాడికి హిప్పీ జుట్టు పాట్లు అర్థమయ్యాయి. సంపాదించగలిగేదేదో ఇప్పుడే నాలుగు మంచిమాటలాడి లాగెయ్యాలనుకున్నాడు.

"దరమ పెబువులు అద్దు రూపాయ యియ్యండి" అన్నాడు.

'అర్నీ నీకెంత స్టయిలు వచ్చిందిరా! పిలిచి వేస్తే పదిపైసల నుంచి అర్థ రూపాయ వరకు రేటు పెంచాడు' కసిగా మనస్సులో తిట్టుకున్నాడు. ఇవ్వకపోతే బస్సు స్టాప్ సుందరి దగ్గర నామోషి. ఆత్మాభిమానం అడ్డుగోడలా నిలిచి ఇవ్వమని ప్రేరేపించింది హిప్పీని.

రూపాయి వేసే?

అమ్మో..జేబులో ఈ ఒక్కరూపాయే తగలడింది. ఇరకాటం ఇప్పుడే సంభవించాలా? రూపాయి ఇచ్చివేస్తే నడిచి వెళ్లాలి. ఎలా? ఎలా?? సందిగ్ధంలో పడ్డాడు. అర్ధరూపాయికి బదులు రూపాయి ఇచ్చి తనొక హీరో పోజు కొట్టి ఆమె మనస్సును తన వైపు తిప్పుకోవాలి. నడిచివెళ్ళి అయినా సరే రూపాయి ఇచ్చి తీరాల్సిందే.

రూపాయి ఇచ్చి ఇందిర వైపు సూపర్‌స్టార్ పోజు కొట్టాడు. ఇంతలో దూరంనుంచి సిటీబస్సు హారన్ వినిపించింది. మనస్సులో దిగులు ప్రారంభమయ్యింది.

పంచెకట్టుకు పరిస్థితి అర్థమయింది. హిప్పీ ఆమెను ఆకర్షించేసుకుంటున్నాడు.

తను రెండు రూపాయల నోటు ఇచ్చి సూపర్‌స్టార్ ఫోజుకొట్టాడు బిక్షగాడు చప్పున నోటును జోలిలోనికి జొనిపి "బాబయ్యా" అన్నాడు.

"ఏంది కథ?" అని వాడివైపు చూచాడు.

"ఓ సుట్టముక్క వుండే పడెయ్యి బాబయ్యా" బిక్షగాడి బుద్ధి చూపించాడు వాడు.

పంచెకట్టుకు తల తీసేసినట్లయింది. 'అర్నీ దొంగనాయాల.నా పరువు గంగలో కలిపేసినావు గదరా. నా ప్రిస్టేజీ ఏమయిపోవాలి' అనుకుంటూ మనస్సులో వచ్చిన కోపాన్ని దిగమింగుకున్నాడు.

హిప్పీ కిసుక్కున నవ్వాడు.

సుందరి ముసిముసి నవ్వులు నవ్వుతోంది.

ఇంతలో సిటీబస్సు వచ్చి ఆగింది.

సుందరి బస్సులోకి బుర్రుపిట్టలా తుర్రుమంది. హిప్పీ వేలాడదీసిన ముఖంతో నోరూర్చుకుంటూ నిలబడిపోయాడు.

పంచెకట్టు అవమాన భారంతో నిలబడిపోయాడు. హిప్పీ జుట్టు, పంచెకట్టుల మీద బస్సు దుమ్ము వలకబోస్తూ వెళ్ళిపోయింది. —కళ్యాణ చక్రవర్తి



# మంచికి పోతే...

బ్యాంకు నుంచి అప్పుడే రూమ్‌కి తిరిగి వచ్చి బట్టలు మార్చుకుంటున్నాను. ప్యాంటు, చొక్కా హేంగర్‌కి తగిలిస్తోంటే చూశాను. శేఖర్ మంచం మీద పడుకొని వున్నాడు. అతను పడుకొన్న తీరు నాకు కాస్త ఆశ్చర్యం కలిగించింది. జుత్తు చెదిరిపోయి వుంది. ముఖం జిడ్డు కారుతోంది. రాక్షసుడినో, భూతాన్నో చూసినట్లు వణుకుతున్నాడు.

చలిజ్వరంగాని వచ్చిందేమో అని సందేహం వచ్చి చెయ్యివేసి చూశాను. చల్లగానే వుంది.

"ఏమయిందిరా అలావున్నావు ? మీ బాస్‌గారి పర్సనల్ సెక్రటరీకి కన్ను కొడుతోంటే అది మీ బాసు చూసి డిస్మిస్ చేశాడా ఏం?" అని అడిగాను.

వాడి కళ్ళనుంచి ఓ కన్నీటి బిందువు జారిపడింది.

"అదేంకాదు. మా కాంతమ్మ అత్తయ్య గజలక్ష్మితోసహా వస్తోందిరా" అన్నాడు ఏడుపు ముఖం పెట్టి.

"ఎప్పుడు వస్తున్నారు?"

"ఇవాళ 7-30 రైలుకి వస్తున్నారు"

"అయితే నువ్వింతగా ఏడవటం ఎందుకురా?"

"నా ఖర్మరా! ఆ గజలక్ష్మి పుట్టగానే నా పెళ్ళాంగా ముద్రవేశారు. పెళ్ళి ఖరారు చేయడానికే ఇప్పుడు ఆవిడ కూతుర్ని వెంటపెట్టుకుని వస్తోంది" దిగులుగా అన్నాడు శేఖర్.

"ఏమిటి...అమ్మాయి అందంగా ఉండదా?"

"అందమా...డ్రాకులా ముఖాన్ని ఒక ఏనుగుకి తగిలిస్తే ఎలావుంటుందో అచ్చం అలా వుంటుంది. నాకు ఏదన్నా ఉపాయం చెప్పి ఈ పెళ్ళి తప్పించరా" బతిమాలాడు శేఖర్.

వాడి బాధ చూడలేక ఆలోచించి ఆలోచించి ఓ ఉపాయం చెప్పాను. శేఖర్ వెలిగిపోతున్న ముఖంతో నన్ను వాటేసుకుని కృతజ్ఞతలు చెప్పి బయటికి వెళ్ళిపోయాడు.

ఎనిమిది గంటలు అవస్తోండగా తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. వెళ్ళి తలుపు తీశాను. భారీ శరీరం వున్న ఒక స్త్రీ నన్ను తోసుకుంటూ లోపలకి వచ్చి కుర్చీలో కూర్చుంది. మరో గున్న ఏనుగు సూట్‌కేస్ మోస్తూ గదిలోకి వచ్చింది. చెప్పద్దూ వాళ్ళిద్దర్నీ చూస్తే నాకు కాస్త దడగానే వుంది.

"నేను శేఖర్‌వాళ్ళ అత్తయ్యను. వాడుఏడీ?" అంది కాంతమ్మ అనబడేశాల్తీ.

"వాడు ఇంకా రాలేదండి" అన్నాను ధైర్యం తెచ్చుకుని.

"టెలిగ్రాం పంపించానుగా...అంద లేదా?"

"అది ఇవాళ సాయంత్రం వచ్చిందండి. నేనే అందుకున్నాను"

"శేఖర్ రోజూ ఆలస్యంగానే వస్తాడా గదికి?" ఆరాతీసింది కాంతమ్మ.

ఓసారి నాలుకతో పెదాలను తడుపుకున్నాను.

"మీరేమీ అనుకోపోతే..." అని మధ్యలోనే ఆపేశాను.

"ఇందులో అనుకోడానికేముంది. చెప్పు"

"గత రెండు నెలలుగా శేఖర్ క్లబ్బుకి వెళ్ళి పేకాట ఆడుతున్నాడండి. ఇప్పుడు కొత్తగా తాగుడు మొదలు పెట్టాడు. ఆ అలవాట్లు మాన్పడానికి

చాలా ప్రయత్నించాను. నచ్చ జెప్పాను. తిట్టాను. అయినా వినటంలేదు" అన్నాను.

"ఇక్కడ వుండి పీడు చేస్తున్న నిర్వాకం ఇదన్నమాట. పీడేదో బుద్ధిమంతుడు అనుకొని పిల్లనిద్దామనుకున్నాను కూడా. ఇంతకీ నీ పేరేమిటి నాయనా?"

"రామారావండి"

"ఎక్కడ పనిచేస్తున్నావు?"

"స్టేట్ బ్యాంకులోనండి"

"ఊ ... పెళ్ళయిందా ? ఎవరి తాలూకా నువ్వు?"

వివరాలు చెప్పాను.

"అరే...అలా చెప్పు...రంగనాథం గారి అబ్బాయివా నువ్వు. రంగనాథానికి ఇంత పెద్ద కొడుకు ఉన్నాడని తెలీదు సుమా. రేపే ఓ ఉత్తరం రాసి పడేస్తానుండు" ఉత్సాహంగా అంది కాంతమ్మ.

"ఎందుకండీ...ఏమని రాస్తారు?" అర్థంగాక అడిగాను.

"ఎందుకేమిటీ...నాపిల్లని ఆ శేఖర్ లాంటి వాడికి ఇచ్చి చేస్తానా? బంగారు తండ్రిలా నువ్వు ఎదురుగా వుంటే మరో సంబంధం కోసం వెతకడం ఎందుకు. వెంటనే మీ నాన్నతో మాట్లాడతాను పెళ్ళి సంగతి" అని నావైపు ప్రేమగా చూసి నవ్వింది కాంతమ్మ.

అంతే...కళ్లు చీకట్లు కమ్మాయి. తర్వాత ఏమయిందో తెలీలేదు నాకు.

తుషార

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD

# ప్రియ తోడుగా ఉంటే చాలు..
# మరింత సంతృప్తి!




బ్రేక్ ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్లలో మీకు కావలసింది ఎన్నుకోండి.

[illegible] దేశమంతటా 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో * అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ * పండు మిరపకాయ * వంకాయ

ఊరగాయలు : * మామిడికాయ * అల్లం

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

ఖాద్‌తో పనిని సంధీకృతం చెయ్యమని. అతను చేస్తున్న ఈ చిన్నపని ప్రపంచ వ్యాప్తం కాకపోవచ్చు సార్. కానీ ఆత్మ తృప్తితో చేస్తున్నాడు. ప్రపంచాన్ని క్షమించడానికి అలవాటు పడ్డాడు. వస్తాను సార్!" వెళ్ళిపోయాడు విరించి.

శంకరానికి ఏదో ఆత్మబంధువు వెళ్ళిపోతున్నట్లైంది. ఎక్కడివాడితను? ఎలా వచ్చాడు తన జీవితంలోకి? అయినా 'ఒక కప్పు కాఫీతాగి, నా టైంవేస్ట్‌చేసిపొయ్యాడు' అని తిట్టుకునే తనేమిటి ఇలా ఆలోచించడం? అది అన్నింటిలోకి విచిత్రం. ఆలోచిస్తూ కూర్చున్నాడు శంకరం.

* * *

మర్నాడు పొద్దున్నే వద్దనుకున్నా అతని అడుగులు రామేశంగారింటివేపు నడిచాయి.

శంకరం ఆ ఇంటి కాంపౌండ్ లోపలికి అడుగుపెట్టేటప్పటికి ఒక వింత జరుగుతోంది.

ధోవతి కట్టుకుని పూజకు వెళ్ళబోతున్నట్లున్నారు రామేశంగారు. ఆయన ఒళ్లో రిక్షా అతను. తలకు దెబ్బ తగిలింది కాబోలు-రామేశంగారు రాగిచెంబులో నీళ్లు అతని ముఖాన చిలకరిస్తున్నారు. ఆ దృశ్యం అపూర్వంగా కనిపించింది శంకరానికి.

''పాపం రిక్షావాడండీ. మనింటిదగ్గర రిషా గోతిలోపడి స్పృహ తప్పిపోయాడండీ" ఆయన గొంతులో ఆర్తి... ఆయన కళ్లల్లో కరుణ.

కాసేపట్లో ఆ రిక్షావాడు స్పృహ తెచ్చుకుని, ఆయన కాళ్ళకు దణ్ణంపెట్టి, రామేశంగారి భార్య ఇచ్చిన పాలుతాగి కళ్ళంబడి నీళ్ళతో శలవు తీసుకుని వెళ్ళడం..ఆ తరవాత రామేశంగారు నూతి దగ్గర స్నానంచేసి పూజచేసుకుని రావడం – అన్నీ చూస్తూనే ఉన్నాడు శంకరం.

'ఏమిటీ పరస్పర విరుద్ధతత్వం?' అక్కడి పుస్తకాలు తిరగేస్తూ ఆలోచిస్తున్నాడు. రామేశంగారు రాగానే వెంటనే అదే ప్రశ్న అడిగాడు.

''నాలోని సర్వేశ్వరుడు అతనిలో లేడా?! దుఃఖం, కష్టం, ఆర్తి అన్నిప్రాణులకు ఒకటే... తనయందు, నిఖిలభూతములయందు ఒక భంగి ప్రవర్తించడమంటే ఏమిటి బాబుగారూ! నాకు యాక్సిడెంటు అయితే నేను ఎదటిమనిషి నుంచి ఏది కోరుకుంటానో, అదే నేను ఇవ్వగలగాలి. నాలో నిద్రలేచిన జ్ఞానశక్తి. అతనిలో ఇంకా నిద్రావస్థలో ఉండి ఉండవచ్చు. 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః' కానీ, 'జన్మ విభాగశః'' అనుకోను నేను"

''మరి మీరు హిందువులయి ఉండి, సనాతన బ్రాహ్మణులైయుండి..."

''అయితే? బ్రహ్మజ్ఞానాన్ని తర్కించి తెలుసుకుని మరొకరికి బోధించే ధీమతి బ్రాహ్మణుడు. అతడు ఏ మతంలోనైనా, క్రిష్టియన్ అయినా, రష్యన్ అయినా, సైంటిస్టు అయినా వాడు బ్రాహ్మడే. నా తోడుగా పుట్టినా, సాటిమనిషి మీద గౌరవం లేనివాడు, స్వార్థపూరితుడు అయిన వాడు మ్లేచ్ఛుడే. అంతర్యజ్ఞానికి పూనుకున్నవాడెవరయినా, సత్యాన్వేషణకు దిగినవాడెవరయినా పూజనీయుడే. అది ఏ రూపమయిన కానీ..."

"మరి ఈ రాగిచెంబులు, అక్షింతలు.."

"బాబుగారూ! చెప్పానుగా... ఒక పద్ధతిలో పరిశోధన చేసేవాడు తనకు


